
సంగీతం కె.వి.మహదేవన్
ఫొటోగ్రఫీ ఇషాన్ ఆర్య
నిర్మాణం-మాటలు
ముళ్లపూడి వెంకటరమణ
దర్శకత్వం బాపు


వాణిశ్రీధర్ నటించు
చిత్రకల్పన ఫిలిమ్స్
గోరంత దీపం
ఈస్ట్‌మన్ కలర్
అన్నపూర్ణ విడుదల

## 'తళతళలాడే' తెలుపు కోసం






## సుప్రీమ్ డెట్ డెటర్జెంట్ ఉతికే బిళ్ల

కొత్తగా మెరుగు పర్చబడిన డెట్ బిళ్ళ, బజార్లో దొరికే డెటర్జెంట్ ఉతికే బిళ్ళల కంటే ఎంతో మేలైనది.
మరకిని వదిల్చే శక్తికి, నురుగు నివ్వడంలోనూ, సువాసనలు చిందించడంలోనూ దీనికి మరేదీ సాటికాలేదు
వాడి చూడండి! తేడా ఏమిటో మీరే తెలుసుకోండి!
నిజమే, సుప్రీమ్ డెట్ బిళ్ళే 'తళతళలాడే' తెలుపు యిచ్చేది!

**దివ్యమైన తెలుపు,**
**డెట్ యొక్క తెలుపు**

Shilpi-dm 17a/76 Tel

సంస్థాపకులు
కీ॥శే॥ వి. వి. రాఘవయ్య



మేనేజింగ్ ఎడిటర్
శ్రీమతి వి. లీలావతి
రాఘవయ్య

సచిత్ర మాసపత్రిక
మార్చి 1978

సహకార సంపాదకుడు : వేమూరి సత్యనారాయణ

సంపుటి 16 — విషయసూచిక — సంచిక 2



ముఖచిత్రం : 'గోరంతదీపం'లో వాణిశ్రీ

జ్యోతి, 17 B రాజారాం కాలనీ, P. B. నెం 2650, మద్రాసు 600 024.
ఫోన్: 423123. సంవత్సర చందా (ప్రత్యేక సంచికతో) రు. 42/-



# మయసభ

"అంబ పలుకు

జగదంబ పలుకు!"—అంటూ వచ్చే బుడబుడక్కల వాడి సీజన్ ఇది.

అసలు భిక్షగాడు పిడికెడు బియ్యమో, పదిపైసలో ఇస్తే సంతోషంగా వెళ్ళిపోతాడు. కాని ఈ 78 ఫిబ్రవరి నెలాఖరున వచ్చే రాజకీయ భిక్షగాడలాంటి వాడు కాదు. ఓటు వేయించుకునేదాకా అతగాడు వేయని వేషం వుండదు; పెట్టని దండం వుండదు; చేయని వాగ్దానం వుండదు; అది కాస్తా ముగిసి ఎన్నికయ్యాడా ఇంక ఏకు మేకవుతుంది; భిక్షగాడు చక్రవర్తి అవుతాడు; ఎన్నికల ఏరు వెనక్కి వుండిపోయింది గనుక మీ ఓటు తెప్పతో అతడికి మరొక అయిదేళ్ళు—(ఇందిరా గాంధీ ధర్మమయితే ఆరేళ్ళు) పని వుండదు. ఎక్కడో సుడి వుండి మంత్రి కూడా అయ్యాడూ అంటే ఇంక మీకు కనపడడన్న మాటే... ఏదయినా పనివుండి మీ రాయన్ను కలవాలని హైదరాబాదో, న్యూఢిల్లీయో వెళ్ళితే— గుమ్మంలో దర్వాను — "అయ్యగారు వూళ్ళోలేరు" — అని చెప్పడం విని వచ్చినట్లు వెనక్కి రావాలి; వేరే దారేదన్నా వుందేమో తర్వాత వెతుక్కోవాలి.

నిజానికి 'అయ్యగారు' అభ్యంతర మందిరం బందున వుండవచ్చు; సాటి ప్రజా ప్రతినిధులతో కలిసి పేకాడుకుంటూ వుండవచ్చు!

ఇది హాస్యం కాదు; వ్యంగ్యం అంతకన్నా కాదు. ఈ ప్రతినిధులనబడేవారూ, ఓ మోస్తరు దేశనాయకులూ, రాష్ట్రానికి సంబంధించిన వీళ్ళు ఏ సమస్యన క్షుణ్ణంగా అధ్యయనం చేయడం పూర్వాపరాలు తెలుసుకోవడం, ఆ సమ పరిష్కారానికయి దేశరాజధానిలో కల. వలసిన వారిని కలవడం మాట్లాడడం, ఏ లోక్‌సభలోనో ఆ విషయం చర్చకు వచ్చినప్పుడు దానిమీద సాధికారంగా మాట్లాడి నలుగురినీ ఆకట్టుకురావడం, మనకున్న నలభైమందో యాభైమందో పార్లమెంటు సభ్యులు అందరూ కలిసి ఆ రాష్ట్ర సమస్య విషయంలో ఒక్క త్రాటి మీద నడిచి దానిని తీర్చడం—అన్నది, ఈ ముప్ఫైయేళ్ళలోను చాల అరుదుగా జరిగింది—అని చెప్పడం ఎంత సిగ్గు

ఏ. రామసంజీవి

# ఎన్నికల మయసభ
# మీ ముందుంది!
# అప్రమత్తులై ఉండండి!

చేటో అంత బాధాకరం అయిన విషయం.

హిందీ సమస్యమీద తమిళసభ్యులు రాజీనామా ఇవ్వడం. కేంద్రమంత్రిగా వున్న సి. సుబ్రహ్మణ్యం సైతం పదవికి రాజీనామా ఇవ్వడం (ఆ రాజీనామా అంగీకరింపక పోవడం వేరే విషయం) జరిగింది. అదే విశాఖ ఉక్కుఫ్యాక్టరీ విషయంలో కాని ప్రత్యేక ఆంధ్ర ఉద్యమ సమయంలో కాని మన మహానుభావుల్లో ఒకరయినా ఆ మాత్రం చేయగలిగారా? (రేపు మీ ఎదుట చేతులు కట్టుకుని నిలబడ్డప్పుడు అడగాల్సిన ప్రశ్నలలో ఒకటి ఇది)...ప్రత్యేకాంధ్ర ఉద్యమసమయంలో పదకొండు మంది ఆంధ్ర ఎం.పి.లు మాత్రం పాపం. లోక్‌సభలో విడిగా కూర్చుంటాం, కూర్చుంటాం — అని ఏలూరులో, విజయవాడలో ఉత్తర కుమారుల వలె భీకరప్రకటనలు చేశారు కాని తీరా ఢిల్లీకి రాగానే, తోకలు ముడిచి "అమ్మగారి" కన్నెరకు జంకి బుద్ధిమంతుల్లా మామూలుగా కూచుండిపోయారు; ఇంతా చేస్తే పదవి పోతుందనో లేపోతే రేప్పొద్దున ఎన్నికల్లో టిక్కట్టు రాదనో భయం; ఇవతల ఉద్యమం పేరు చెప్పి, అమాయకులయిన జనాన్ని విద్యార్థిలోకాన్ని రెచ్చగొట్టి. వాళ్ళజీవితాలు నాశనం చేసుకుని పోలీసుల తుపాకి గుళ్ళకు ప్రాణాలనర్పిస్తుంటే, ఈ ప్రతినిధులన బడే ఆషాడభూతులు మాత్రం విమానాల మీద ఎగురుతూ, పదవికి పరాన్నభుక్కులై తిష్ఠవేసుకోవడం ఈ నాడు మనం మరిచిపోతే ఎలాగండీ?

ఢిల్లీకి వెళ్ళితే— విదేశాలకు వెళ్ళే డెలిగేషన్లలో తమకేదయినా స్థానం వుంటుందా అనో తమ కొడుక్కో, అల్లుడికో, బావమరిదికో రావలసిన ఆ ఫారిన్ స్కాలర్‌షిప్పో నెలకు రెండువేల రూపాయిల ఉద్యోగమో ఎప్పుడొస్తుంది, దాని కోసం ఏమి చేయాలి అనో — స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషన్ వారు విదేశీ కార్లను మళ్ళీ ఎప్పుడు వేలం వేస్తారో— అనో—కనుక్కుంటారే తప్ప కనీసం కమ్యూనికేషన్స్ మంత్రిత్వశాఖకు వెళ్ళి గురుజాడ స్టాంపు వేస్తారా, వేయరా అని కూడా కనుక్కోరు ...అంతటి బద్ధకస్తులు, చేతకాని వాళ్ళు ... (అక్కడక్కడా ఇందుకు భిన్నమైన నిజాయితీపరులు, కార్యసాధకలు ఒకరిద్దరుండవచ్చు....వారికి నమోవాకములు) నిజానికి మనరాష్ట్రంలో ఎవరు ఎవరో — ఢిల్లీ సెక్రటేరియట్‌లో తెలియదు; అక్కడ ఒక మంత్రిత్వ కార్యాలయశాఖలో కార్యదర్శిని కలియాలంటే మన మంత్రిగారు ఎవరో చెప్పుకోవలసివుంటుంది. సేలం ఉక్కుఫ్యాక్టరీ వచ్చి విశాఖ ఉక్కు నిద్రపోతుందంటే కారణం ఇదే!

మున్పై ఏయేళ్ళ లోక్‌సభ, రాజ్యసభల 'ప్రొసీడింగ్స్' తీయండి, నల్గురిచేత

'ఓహోహో' అన్పించేలా తెలుగుదేశం ప్రతినిధి మాట్లాడిన సందర్భాలు ఎన్ని వున్నాయో చూడండి। అసలు ఈ సభ్యులు ఒక్కరోజు సభకు హాజరయితే 14 రోజులదాకా రాకపోయినా జీతాలు అలవెన్సులకు లోటు ఏమీరాదు. కావాలంటే ఈ లోగా విమానంమీద మనూరు వెళ్ళి స్వంతపనులను చక్కబెట్టుకు రావచ్చు; ఇలాంటి వీళ్ళు తగుదునమ్మా అని వేదికల మీదకు తయారయి-"నడుం బిగించండి; చెమటోడ్చి పని చేయండి; త్యాగం చేయండి; దేశభవిష్యత్తు మీ చేతులలో వుంది___" ("వర్తమానం మా చేతుల్లో వుంది; గతం సీసపద్యాల్లో వుంది" అని ధ్వనించేలా) మనకు శ్రీరంగ నీతులు చెబుతారు; ప్రబోధాలు చేస్తారు; పదవీ శ్లేష్మంలో మక్షికాల్లా తేలుతుంటారు;___ అధికారం బెల్లం దిమ్మచుట్టూ చీమల బారులై ప్రదక్షిణాలు చేస్తుంటారు. ఆ గోత్రంవారే ఇక్కడ అసెంబ్లీలనూ నింపుతున్నారు.

తప్పుడుపనులు చేసినందుకు కోర్టు వారు ఆరేళ్ళపాటు నిషేధించిన వారినుండి ఏడాదిలో మూడుపార్టీలు ఫిరాయించిన ఊసరవెల్లులదాక వున్నారు ఈ శతకోటి జంగాలు. ఈ ఊబి, ఈ కశ్మలం, ఈ కంపుచూచి నిజాయితీపరులు, నీతిమంతులు, మేధావంతులు___రాజకీయాల నుండి ఎంత దూరంగా వీలయితే అంత దూరంగా వుంటున్నారు; ఇది ప్రజాస్వామ్యానికి తీరనిహాని కల్గిస్తుంది. అధవా అటువంటి వారిందులోకి ఏదో కొంత మంచి చేద్దామని దిగినా డబ్బులతో ఓట్లు కొనలేక పీగిపోతున్నారు. ఎక్కడో సకృత్తుగా ఎన్నికయినా, వాళ్ళేమీ చేయలేకపోతున్నారు ___ ఈ వాతావరణం నియంతృత్వానికి ఆహ్వానం వంటిది. పరిమితమైన నియంతృత్వాన్ని పద్దెన్మిది నెలలు చవిచూచాకయినా మనం ప్రజాస్వామ్యాన్ని రక్షించుకోలేకపోతే మనకు నియంతృత్వమే శిక్షవుతుంది. స్వేచ్ఛా స్వాతంత్రాలు పోతే పోయె. నియంతృత్వం క్రిందనయినా అందరికీ ఇంత తిండి, గుడ్డ, కొంప, ఉద్యోగం దొరుకుతాయా అంటే, '75 - జూన్ 77 మార్చి మధ్యకాలపు మనదేశ చరిత్ర, అది సరికాదని చెప్పింది. కనుక ఒక కుటుంబపు వారసత్వపు నియంతృత్వం క్రింద వుండడం ఎంత చేటో ఒక పార్టీ నియంతృత్వం క్రింద మనడమూ అంతే లేటు; అలాగే పార్టీలు మార్చినా, విభూతి మానేసి ఊర్ధ్వపుండ్రాలు ధరించినా, ఎన్ని వేషాలు వేసినా ఫలానా నియోజకవర్గంలో ఫలానా వ్యక్తినే ఎన్నుకుంటారు___అన్న ఆనవాయితీ ప్రజాస్వామ్య వ్యవస్థకే గొడ్డలిపెట్టు.

వ్యక్తి నిజాయితీపరుడు కాకపోతే అతణ్ణి నిరాకరించాలి. పదికాదు పదివేల రూపాయల రాశిపోసినా ఓటును అమ్మరాదు. మన వ్యక్తిగతమైన స్వార్థాల కోసం, స్వల్పప్రయోజనాలకోసం దేశం భవిష్యత్తును ఇమ్మనుజాధములకు పణం పెట్టరాదు. ఆ విషయం తెలియనివారికి విడమరిచి చెప్పాలి. వేరు నంటిన ఈ చీడపురుగును అక్కడే నిర్మూలించకపోతే ఆ చెట్టు ఫలం చేదవుతుంది; ఆ చెట్టే కూలిపోతుంది। పురుగులే మిగులుతాయి. అభ్యర్థి వెనుక వున్న పార్టీ నికాదు,


కొత్త
for sparkling white and brilliant colour washes
Point
DETERGENT WASHING CAKE
Point
Point

అతగాడి గత చరిత్ర ఏమిటో చూడండి. ప్రజాకవి కాళోజీ కాహళిని వినండి।

"అభ్యర్థి ఏ పార్టీవాడని కాదు
ఏపాటివాడో చూడు।
ఎన్నుకుంటే వెలగబెట్టడం కాదు
ఇందాకా ఏం చేశాడో చూడు।
ఇప్పుడు కట్టే ముడుపులు కాదు
ఇందాకా చెల్లించింది చూడు।
పెట్టుకునే టోపీ కాదు——
పెట్టిన టోపీ చూడు।
ఎగరేసిన జెండా కాదు
చాటున ఆడించిన దండా చూడు।
మనిషిని చూడు చరిత్రను చూడు।
ముడుపులు కాదు నడవడి
చూడు ."

ఆ విధంగా అన్నివిధాలా సరైన వ్యక్తిని మీ నియోజక వర్గంలో ఏ పార్టీ కూడా నిల్చోబెట్టనినాడు మీరు ఎన్నికలను బహిష్కరించండి। మీ ఓటును భద్రంగా దాచండి। చేజేతుల అవినీతిపరులను, అసత్యవాదులను, కుహనా ఉద్యమనేతలను, ఓ లక్ష కమ్మడు పోయే భిక్షగాళ్ళను ఎన్నుకోవడంకన్న, అలాటి వారిచే ఏర్పడిన వాగ్దానాల ఇసుక మేడల్ని ప్రజాస్వామ్యపు కోటలుగా భ్రమించడం కన్న, ఊరుకోవడం మిన్న.

అయితే మనం ఊరుకుంటే చరిత్ర ఆగుతుందా? ఆగదు; వరిపైరు మొలవని చోట బ్రహ్మజెముడు దానంతట అదే మొలుస్తుంది; ప్రజాస్వామ్యాన్ని పెంచి పోషించలేనిచోట నియంతృత్వం తప్పదు. వెలుగు లేనిచోట చీకటి తప్పదు.

ఆ పెను చీకటిలో ప్రతి కొవ్వొత్తీ ప్రచండ భాస్కరుడిలా వెలగక తప్పదు. ఆ అశోకవనంలో నిజం సీతలా నలగక తప్పదు.

కనుక, కృష్ణపక్షం రాకముందే మేలు కోరడం మంచిది; మీ ఓటు వరం అడగ డానికి వచ్చినవాడు భస్మాసురుడో కాడో తేల్చుకోవడం మంచిది.

తమసోమా జ్యోతిర్గమయ। □

సి రి య ల్



# భూమి గుండ్రంగా వుంది

## బీనాదేవి సీరియల్

జరిగిన కథ :

జగన్నాధం ఇంట్లోవుండి 'ఇల్లు' కాపాడుతున్న ప్రకాశరావు, జగన్నాధం రాకవిని మరో ఊరు చెక్కేశాడు 'అతనెళ్ళాక నాక్కబురు పెట్టమని' పెళ్ళాంతో చెప్పి, 'అతను లేడుగా ఏం చేస్తాం' అన్న జగన్నాధాన్ని కోప్పడి అతని ఇంటి వైపు బయల్దేర తీశాడు రాజేశ్వరరావు. గోడలపై మొక్కలు మొలిచీ, కిటికీలూ, దర్వాజాలూ చెదలు తినీ జీర్ణమైవున్న ఇంటిని చూపి కృంగిపోయారు దంపతులు. ప్రకాశరావుని ఇంట్లోంచి పంపించేందుకూ, ఇల్లు బాగుచేయించేందుకూ ప్రయత్నం మొదలైంది. జానకి దగ్గరుండి ఇల్లు బాగుచేయించే పనిలో, కూలీల జీవితాలను దగ్గరగా చూడగలిగింది.

అదేం(విటో తెలుసుకొనేవరకూ అందనిచోట వీపుమీద దురదవేసినట్టుంది. అంచేత ఆ పాతికేళ్ళదాన్ని కనుసౌజ్ఞతోనే పెరట్లోకి తీసికెళ్ళింది జానకి.

"ఎవరు నువ్వు?"

"మాలలవండి"

"కులంకాదు. నీపేరు?"

"మాలచ్మి . ."

"ఎవరూ నీతో మాట్లాడరేం?"

"…. …. …. …."

"నీకు గంజి యిస్తానన్నదెవరు?"

"మా అప్పండి"

"ఆవిడ్ని నీకు అన్నం పెట్టనివ్వలేదేం వాళ్ళు?"
"పెట్టనియ్యరండి.. "
"ఎంచేత?"
"అళ్ల పెట్టనియ్యకూడదండి."
"ఏం?"
"అది మా కులం కట్టుబాటండి"
"అంటే? ."
"నేను తప్పుసేపినానండి"
"ఏం తప్పు?" కొంచెం సందేహిస్తూనే అడిగింది జానకి.
"సెయ్యకూడనిదే నండి మరి."
"ఖూనీ చేశేవా?"
"అంతకన్న గోరవేఁనండి."
"ఏవిఁటది?"
"లెగిపిపోనానండి" మొహం చాటుచేసుకుంది కన్నీరు దాచడానికి.
"... ..... ..." ఏం మాట్లాడాలో తోచలేదు జానక్కి. ఇదంతా అడక్కపోతేనే బావుండుననిపించింది.
"... మాదిగోడితో లెగిపిపోనానండి. మరది తప్పేనండి ." పాతికేళ్ళక్రితం చచ్చిన తల్లిని చూస్తున్నట్టనిపించింది ఆమెకి జానకివి చూస్తే ... "మరంచేత నాతో మావోళ్ళు మాటాడరండి. నీళ్ళు, నిప్పు కూడా యియ్యరండి. సచ్చినప్పుడు పూడిస్తే మాదిగాళ్ళే పూడచాలండి...."
"నీకు నాన్నలేడూ?"
"ఆడికంట నాను పడనండి. కంటపడితే ఆడు సచ్చన్నాపోతాడు. నన్ను సంపేనన్నా సంపేస్తాడండి. నాను అగుపడ్ను కాబట్టే ఎలాగోలాగ బతుకేస్తున్నా డండి."
జానకి మూడు రూపాయలుతీసి ఆమెకిస్తూ "ఇంద నీ కూలి తీసుకో" అంది.
"పొయ్యేటప్పుడియ్యండి."
"ఎక్కడైనా కాఫీ తాగిరా. ఆలశ్యమైనా ఫరవాలేదు."
"ఒద్దండి"
"ఏం? ఆకలి వెయ్యడంలేదూ?"
"ఎందుకెయ్యదండి?"
"మరైతే కాఫీ తాగిరా"
"కూలి తక్కువైతే తంతాడండి మావోడు."
మాట్లాడలేకపోయింది జానకి.
ఏడుపూ, నిస్సత్తువ ఆమెకు ఒక్కసారే వచ్చేయి.






కాని ఆ కూలీకి డబ్బిచ్చి "యింత ఎండలో ఆకలి కడుపుతో పని చెయ్యక్కర్లేదు. ఇంటికిపో" అని అనలేదు.

ఆ తరవాత మిగతా కూలీలు పని ఆలశ్యంగా మొదలుపెట్టినా ఆమె మాట్లాడ లేదు.

## 14

చద్దులు తిని, చుట్టలు కాల్చుకొని మళ్ళీ పని ప్రారంభించేసరికి పదకొండైంది.

ఇందాక పంపుదగ్గర పెట్టిన బాల్చీలు తిరిగి పట్టుకొచ్చేసేరు ఆ యిద్దరూ. వీధిలో రోడ్డుమీద పోసిన యిసుక యింకా అలాగే ఉంది. ఇందాక పని ఆపేసినచోట తిరిగి కూర్చున్నారు మేస్త్రీలు.

కొత్త అవడంవల్ల సరిగ్గా చూడలేదు జానకి. ఈపాటికి ఆపక్క పనంతా అయిపోయి వుంటుంది అనుకున్న జానక్కి వాళ్ళు చేసిన పని చూడగానే కంట నీరు తిరిగింది. ఒక గోడ సగం మాత్రం గజం ఎత్తువరకు సిమెంటు రాశేరు. సిమెంటు రెండు బస్తాలై పోయింది. మూడోది విప్పుతున్నారు.

అందులో సీనియర్ మేస్త్రీ తాపీని మాస్టర్ పెయింటర్ పాలెట్నైఫ్ పట్టుకున్నట్టు అతి ఆర్టిస్టిక్‌గా పట్టుకొని ముందు కుడినుంచి ఎడమకి రాశేడు సాయిబులు లవ్‌లెటరు రాసినట్టు. తరవాత ఒక్క నిమషం ఆగి ఐడియాకోసం అన్నట్టు చెవి పక్కనుండి ఆరిపోయిన చుట్టతీసి వెలిగించేడు. వెలిగించిన చుట్ట నోట్లో పెట్టుకొని, పెద్ద ఆర్టిష్టు తను గీసిన బొమ్మ బావుందో లేదో చూసుకున్నట్టు ఒక నిమషం తేరి పార చూశేడు.

ఛ. ఛ. బావులేదు.

# కేశవర్ధినిని

మీరు తలకు రాసుకొనే నూనెలో కలిపి
ఉపయోగిస్తే అధికంగా మంచి గుణాన్ని
పొందుతారు. మీ తల వెంట్రుకలు ఒత్తుగా
రోజు రోజుకీ పొడుగ్గా పెరుగుతాయి.




దక్షిణ భారతదేశపు సాంప్రదాయిక కేశ సౌందర్య రహస్యమే కేశవర్ధిని
మీరు వాడుకొనే తలనూనెలో కేశవర్ధినిని కలిపి ప్రతీ రోజూ తలకురాసి
తల చర్మానికి అంటేటట్లు చెయ్యండి మీ తల వెంట్రుకలు ఊడి
పోకుండా జేసి ఆరోగ్యవంతంగా అందంగా పెరిగించడానికి ఇదేమంచి
మార్గము ఇప్పుడే కేశవర్ధినిని ఉపయోగించటం మొదలు పెట్టండి
కేశవర్ధిని సాధారణ తల నూనెకాదు దీన్ని కొబ్బరినూనె
లోనో లేక మీరు వాడే ఇతర తల నూనెలోనో కలిపి వాడాలి.

కేశవర్ధిని ప్రొడక్ట్స్, ఆర్కాటు రోడ్డు, మద్రాసు–600 087

OBM 3837 TG



వెంటనే హిందూ పద్ధతిలో ఎడమనుండి కుడికి తాపీతో చెరిపేశేడు. తరవాత గరిగా ఒక దమ్ములాగి మళ్ళీ ఒక నిమషంసేపు చూశేడు.

ఈసారీ నచ్చలేదు.

మళ్ళీ తాపీ తీసుకొని చైనావాడిలా పైనుంచి కిందికి రాశేడు.

ఇన్స్పిరేషను చాల్లేదు. మరో రెండు దమ్ములు లాగేడు.

మూడ్ కుదరని ఆర్టిష్టులా చికాగ్గా కిందనుంచి పైకి సర్రున రాసేడు.

మిగిలిన యిద్దరు మేస్త్రీలు చుట్టూవున్న గోడల్ని శుభ్రంగా తాపీతో అడుగు లోతు చెక్కేస్తున్నారు. వాళ్ళలా గోడల్ని కొబ్బరికాయకోరినట్టు కోరడం చూపిన జానక్కి మళ్ళీ సిమెంటు రాసేవరకు ఆగకుండా పైబరువుకి యీ గోడలు కూలి పోవచ్చు అన్న భయం పట్టుకుంది. ఆ భయం మనస్సులో దాచుకోలేక పైకి అనేసింది.

"మీరలా చెక్కేస్తున్నారుకదా. ఈ గోడలు నిలుస్తాయా?"

దానికా ఎంగ్రెటిస్ మేస్త్రీగాడు, అమెరికా ఎంబాసిడరు ఇండియా ముష్టివాడ్ని చూపినట్టు ఒకచూపు జానకిమీద విసిరి, గోడకోరుడు తాత్కాలికంగా వాయిదావేసి "ఏటీయమ్మ బయం? ఈ గోడలెందుకు బడిపోతాయీ పెరుగు ఎంకమ్మ ఈపునాగ గజంన్నర మందం వుంటేనూ" అని ఎంబాసిడర్ లెవెల్ నవ్వొకటి నవ్వేడు.

జానకి కూడా చిన్నపిసరు నవ్వుదామన్కుంది కాని అంతలో "అమ్మగోరూ, అమ్మగోరూ" అన్న సీనియర్ మేస్త్రీ గావుకేకతో "కొంపతీసి గోడ అటువైపు కూలిపోయేను కదా" అన్న భయంతో ఒక్కక్షణం రెఫ్రిజిరేటర్లో పెట్టిన మనిషిలా చల్లబడిపోయింది.





కేశవర్ధనులు

"ఏఁవిఁటీ?" డబుల్ టైఫాయిడ్ పేషెంటు గొంతులావుంది.

"మరి గంటేనండీ. తవఁరిగోరి పెళ్ళికి మాంగారున్నారా? సెల్లిపోయేరా అమ్మా?" ధర్మసందేహం వెలిబుచ్చేడు.

"మాఁవఁగారి మాటెలావున్నా. సువ్వుగాని మరో గావుకేక వేస్తే నేను చెల్లిపోతాను" అనుకున్న జానకి "బతికేవున్నారు" అంది జవాబు చెప్పకపోతే మళ్ళీ కేకలేస్తాడేమోనని.

"ఆ బాబండి-గాందీగోరు సచ్చిపోయినప్పుడు నెహ్రూబాబన్నట్టు—మా యిలవైన మడిసండి. మడిసంటే ఒజ్రం కదండి. ఆ బాబుకాడ పన్చెయ్యాలంటే తెగ బయిబడేవోరండి. నాకు మాత్తరం ఆ బాబుకాడ నెలవే అనుకొండి. ఈ వొంటి ల్లంతా నా సేతుల్తోనే కదా కట్టింది. అసలా బాబుకి ఎలా సేసినా నచ్చేదికాదండి. డబ్బు నెక్కనేదు. నచ్చేవరకు సెయ్యాల్సిందే... ఒలే గుంట. కుసిన్ని నీళ్ళట్రాయే ... ఓ పాలేటైందంటే గజవెఁత్తు గోడలు లెగిసినాయండి. ఈ బాబుకి ఏటనిపించిందో ఏటో "ఏట్రా ఏడుకొండలూ తడిసిపోయిన అట్టముక్కల్లాగున్నాయ్" అని పొట్టలు గుద్దినట్టు గుభీమని కాలితో ఒక్కతాపు తన్నిసినాడు. ఇంత గోడా పాట్లపండునాగ యిడిపోనాది...."

"డబ్బు దండుగ" అంది జానకి, మావఁగారు గుద్దీసిన గోడకాదు, నీ పని. అనుకుంది మనసులో.

"ఆ బాబుకి డబ్బుకి యిలవనేదండి. ఓ సుట్టైటైందంటే....ఇదిగో యిలాగే గోడ పనిసేస్తన్నావండి. ఆ బాబదుగో మీరు కూకున్నకాడే కూకున్నాడండి కురిసీ మీద అయేల ఒకటో తారీకు మన పాలసూరమ్మనేదండీ! తఁవఁకి తెల్దులెండి-




అప్పటికే ఇజీనగరం తవఁలపాకు నాగ పండిపోనాది—ఎలా గుండేదేఁటి? ముసిలి థీవుఁడికి కోకకట్టినట్టుండేది—అదొచ్చి "బాబూ, పాల్డబ్బులు ఇస్తారేఁటి? గొడ్డుకిగడ్డి నేదు" అనడిగినాది.

"ఎంతియ్యాలే నీకు?" అనడిగినాడా బాబు. ఆ బాబుగోరికి నెక్కా, పద్దూ వుండేది కాదు. రూపాయిలు కుడిసేత్తో తేటం, ఎడంసేత్తో ఇపిరీటవూను. అదీ ఆ బాబు పద్ధతి.

"అరవై రూపాయలు" అంది సూరమ్మ.

"మరైతే ఇక్కడే వుండు. డబ్బట్టుకొస్తా" నన్జెప్పి ఆ బాబు గుమాస్తాకాడి కెళ్ళి డబ్బు అట్టుకొచ్చి "యిలా రాయే" అని నూతికాడ కెళ్ళినాడండి. అదిగో ఆ నుయ్యేనండి. "ఏటా యీ బాబు డబ్బిమ్మంటే నూతికాడికి రమ్మంటున్నా"డని బయి పడిందో ఏటో. "డబ్బులిచ్చి బాబూ పోతాను" అందండి అది.

"ఓసిఁలాయే. నిన్నేం నూతిలోకి తోసీసులే" అన్నాడండి ఆ బాబు. ఇది ఎళ్ళింది.

"పాలకెంతియ్యాలే" ఏం తెలీనట్టు అడిగినాడు.

"తవఁకి తెల్దేటి బాబూ. అరవై రూపాయలు" అంది.

ఆ రోజుల్లో అరవై రూపాయిలు పాలకి అయీది ఆ బాబుకి, ఇంట్లో రెండు గేదులుండగా. మరి సూసుకోండి.

"నెక్కెట్టుకోయే" అన్జెప్పి—అప్పడీ రుపాయి కాయితాలు ఎక్కడో గాని లేవు. ఇచ్చ రుపాయిలే—ముప్పై రూపాయిలు నెక్కెట్టి దాని సేతిలో ఐడేసినా దండి.

"అరవైకి ముప్పై యిచ్చినావేఁటి బాబూ" అనడిగిందండి.




"నువ్వు పాల్డబ్బులే కదే అడిగినావు. మిగతా ముప్పై నీళ్ళ డబ్బులు. ఇదుగో ఇస్తున్నానన్జెప్పి ముప్పై ఇచ్చరూపాయిలు నూతిలోకి సేద ఒగ్గేసినట్టు ఒగ్గీసినాడండి. అదిగదండి ఆ బాబు వోరస. మరింక అలాంటి మారాజుని సూడ వండి" అని జానక్కి ఆవిడ మావఁగారి కథ చెప్పి—

"ఆఁ ఆఁ రావాల. సిమెంటు రావాల" అని ఒక వార్ క్రై పెట్టేడు.

"ఏటి ముసిల్దాఁనా. ఏటా మొగపెళ్ళోరి నడక? సెక సెక అడుగెయ్యి. యియాళిసలు నువ్వు కూలి యెలా గట్టుకెల్తావో సూస్తాను" అరిచేడు ఎప్రెంటిస్ మేస్త్రీ.

ఆ ముసలమ్మకి వయసు ముసిలైనా, కోపం ఇంకా వయసులోనే ఉంది. ఆ మేస్త్రీ మాటలకావిడ కాలంలోవున్న కరినాగులా కస్సుమంది, "నానేటి ఆడుకుంటున్నా నేటి? ఒట్టుకెళ్ళు బాబు. సవఁద్రం బాబు. నీకు పేరేకాదు, ఆశకూడా సవంద్రవే. నా కూలి కూడా నువ్వే ఒట్టుకెళ్ళి మిద్దెకట్టే. ముసిల్దాన్ని నన్నట్టుకోపోతే. అల్లదుగో. ఊసులాడుకుంటున్నారు, ఆ గుంటల్ననవేం?" అంటూ దభీమని సిమెంటు మేస్త్రీ పక్కన పోసింది.

"ఎన్ని కలుపుతున్నారు సిమెంటు, ఇసక?" ఏ ప్రపోర్షన్‌లో కలపాలో తెలియకపోయినా అడిగింది జానకి.

"మరండి. గవర్నమెంటు పనైతే అసలు నెక్కెట్టవండి. బండి ఇసక కుప్పేసి. అందులో ఒక బస్తా సిమెంటు పోస్తారండి. ఆరికేటండి. కూలిపోతే మళ్ళా కడతారు. మావుఁ మాత్తరం ఒకటి సిమెంటైతే యిసక ఎనిమిది ఏస్తావండి. సేసినపని శాశితంగా వుండొద్దా?"

"మరి ఆ మనిషి కొలపెట్టకుండా పోసేస్తోందేం?"




"కొలక్కొచ్చేసిందండి. ఉజ్జాయింపున అంతే వుంటాది . . యింక మరి వో యి కలపకే ముష్టిలానా. టయమైపోనాది" అంటూ తాపీ కింద పడేశేడు సీనియర్. పై నుంచి ఆర్డరు అందుకోగానే మిగతా వాళ్ళంతా ఎక్కడివక్కడ అక్కడ ఆపేసి, నూతిదగ్గర కాళ్లూ, చేతులూ కడుక్కోవడం ప్రారంభించేరు.

"కూల్డబ్బులు ఐడేయండి" అంటూ వచ్చేడు అరగంట క్రితమే రెడీ అయిన ఎప్రెంటిస్.

"ఎంతైందిః" అడిగింది జానకి పర్సుతీస్తూ.

"తమకి తెల్దేటండిః పెద్ద మేస్త్రీకి ఎనిమిదండి. (పొద్దుటనుంచి కూర్చున్న చోటే తాపీ అటు ఇటు తిప్పి నందుకన్న మాట. భేష్). మాకు ఆరేసి రూపాయలండి. (గోడ కోరుడుకి) ఆడకూలీకి, మూడు, మొగోడికి నాలుగు."

లెక్క కట్టడం సులభమే. కాని వీళ్ళలో పనినిబట్టి మొగకూలీ ఎవరో, మేస్త్రీ ఎవరో చెప్పడం కష్టం.

మారు మాట్లాడకుండా డబ్బు లెక్కపెట్టి యిచ్చేసింది జానకి.

మధ్యాన్నం ఒంటి గంటైంది.

రోడ్డుమీద నిలబడితే నిలువునా కాలిపోతామేమో అన్నంత ఎండగా ఉంది. జానక్కి నాలిక ఎండిపోతోంది. ఇంట్లోవున్న వాళ్ళని మంచినీళ్ళడగడం యిష్టం లేదు. వాళ్ళు కావాలా అని అడగలేదు.

కనుచూపుమేరలో ఎక్కడా రిక్షాలేదు.

సెంటిమీటరు దూరం కూడా నడవలేనేమో అని భయపడిన జానక్కి ఆపద్బాంధవుడిలా దూరంగా ఒక రిక్షావాడు కనిపించేడు,

చప్పట్లుకొట్టి పిలిచింది.

కాని వెంటనే ఆపద్బాంధవుడ్ని చావకొట్టాలనిపించింది వాడు ఫర్లాంగు దూరానికి రూపాయి అడిగేసరికి.

వెంటనే వాడిమీద కోపంతో చరచర నడిచేసింది, యీ రూపాయి రేపు మూడోవంతు కూలి మనిషికైనా పనికొస్తుందని.

## 15

ఎండలో ఇల్లు చేరిన జానక్కి హాల్లో ఆవిడ కోసమే వెయిట్ చేస్తున్న జగన్నాధం గాని, రాజేశ్వర్రావుగాని కనిపించలేదు. ఎండలో నడవడంవల్ల కళ్లు చీకట్లు కమ్మేస్తున్నాయి. తడుముకుంటూ పక్కనున్న కుర్చీలో కూలబడిపోయింది. జగన్నాధానికి ఆవిడ మొహంలో నిప్పుల ముఖ్యా, విషపు సెగలూ కనిపించడంవల్ల అతను పలకరించలేదు. ఇవేమీ తెలీని రాజేశ్వర్రావు "ఎంతవరకూ వచ్చింది మీ ఇంటి ప్రోగ్రెస్?" అని పరామర్శించేడు.

"మా మామగారు నూతిలో ముప్పై రూపాయలు పడేయటం వరకూ."

ఎండలో రావటంవల్ల బుర్ర వేడెక్కిపోయి పరాకు మాటలు వస్తున్నాయి కాబోలు అని జాలిపడి, "ముందు శుభ్రంగా భోంచేసి నిద్రపొండి. సాయంత్రం మాట్లాడుకుందాం" అన్నాడతను.

"నా కిప్పుడు ఏం తినాలని లేదు. తరవాత చేస్తాలెండి" అంటూ సోఫాలోనే కళ్ళు మూసుకుంది జానకి. నీరసంతో కాళ్ళు గాలిలో తేలిపోతున్నాయి.

"ఒరే రాజూ, నేను రేపు వెళ్ళిపోతున్నాను. ఎల్లుండి జాయిన్ అవాలి" అని రాజేశ్వర్రావుకి చెప్పి, "జానకీ! నిన్ను ఓ పదిహేను రోజుల్లో ఎక్స్పెక్ట్ చెయ్యమంటావా?" అడిగేడు.

"అసలు ఎక్స్పెక్ట్ చెయ్యొద్దు" గొణిగింది జానకి.

"వెళ్ళక తప్పదంటావా?" రాజేశ్వర్రావు అడిగేడు.

"ఎవరైనా చస్తే తప్ప."

"మానే అన్నం తిని నూతికి కాళ్ళు చాచేరని, మీ కిద్దరికీ చావు తప్ప మరో మాట రాదా? నేనోసారి అలా వెళ్ళి వస్తాను. మీరు మాట్లాడుతూ వుండండి" అని లేచి వెళ్ళిపోయాడు రాజేశ్వర్రావు.

జగన్నాధం, జానకి మాట్లాడుకోవడానికి డబ్బు సమస్య తప్ప యింకే టాపిక్ లేదు. ఆ సమస్య మాట్లాడుకున్నంత మాత్రాన తీరేది కాదు. ఒకరి కొకరు యిచ్చుకోవడానికి ఎవరి దగ్గరా డబ్బు లేదు.

ఆ ఊరికి బైల్దేరినప్పుడు "రిపేర్లకి మహా అయితే మూడొందలుకంటె అవుతుందా? మిగతా ఖర్చుకి రెండు వందలు చాలదా?" అనుకొని అష్టకష్టాలుపడి అయిదు వందలు సంపాయించి, అవి పట్టుకొని బయల్దేరేరు. కాని యిక్కడి వ్యవహారం చూస్తే అయిదు వేలు కూడా చాలేటట్టు లేవు.

ఆ వేళ ... ... .

పెరడు బాగుచెయ్యడం మావల్ల కాదని కూలీలు పారిపోయేక, ఆ మర్నాడు వాళ్ళనే బతిమాలి, కాళ్ళు పట్టుకొని, ఎక్కువ కూలిస్తానని ఆశపెట్టి, మరింక యిలాంటి పొరపాటు యింకెప్పుడూ చెయ్యవ(ని లెంపలేసుకొని, మరింక వాళ్ళకి మందివ్వనని రాజేశ్వర్రావు బెదిరించి—ఎలాగై తేనేం పెరడంతా శుభ్రం చేయించేడు. వాళ్ళ కూలి నూట యాభై రూపాయలైంది. వాళ్ళు మొక్కలే కొట్టేరు కాని, వేళ్ళు భూమి(లోనే ఉన్నాయి. ఒక వర్షం పడితే అవి చిగిర్చి, మొక్కై, మానై, వృక్షాలైతే, వచ్చే ఏడాది మళ్ళీ జానకి కేవలం పెరడు బాగుచేయించడానికే రావాలి. ఇవన్నీ ఆలోచించిన జానకి మరో వంద రూపాయలిచ్చి కూలీలచేత ఆ వేర్లన్నీ తవ్వించేసింది. యిక్కడితో పెరటి అధ్యాయం పూర్తి అవలేదు. ఆ కొట్టిన మొక్కలు, తవ్విన వేర్లు ఎక్కడ పొయ్యటం? రోడ్డు మీద పోస్తే మున్సిపాలిటీ వాళ్ళూరుకోరు.

పక్క పెరళ్ళలో పోసేస్తే!

ఆ పెరళ్ళు యీ కర్రలు పట్టవు.

ఈ ముళ్ళ కంపల్ని ఏం చేసుకోవడం?

ఆఖరికి జగన్నాధం ఉపాయం చెప్పేడు.

ఆ ఉపాయం ప్రకారం ఒక డబ్బా కిరసనాయిలు కొని, యిద్దరు కూలీల్ని స్పెషల్‌గా పెట్టి అవన్నీ భోగిమంట వేయించేసింది జానకి. ఆ బుగ్గితో ఆ వీధి వాళ్ళంతా సంవత్సరంపాటు అంట్లు తోవు(కోవచ్చు. తోవు(కున్నారు కూడా.

కాగా పోగా పునాదుల్లోనే గవర్నమెంటు బిల్డింగ్స్ గ్రాంట్స్ అయిపోయినట్టు తెచ్చిన డబ్బంతా పెరట్లోనే పోసేరు. అసలు పనంతా ముందే ఉంది. పుచ్చిపోయిన ద్వారాలు, కిటికీలు మళ్ళీ చేయించాలి. వాటికి నిన్ననే ఆర్డరిచ్చేరు. వాటికి మూడు వందలు దాటుతుంది. మొన్న సిమెంటుకి డబ్బు రాజేశ్వర్రావే యిచ్చేడు.

ఇవన్నీ ఎప్పటి కవుతాయి? నేనెప్పుడు యిక్కడ్నించి కదుల్తాను? భగవాన్! అన్న భయం పట్టుకుంది జానక్కి.

ఊరంతా ఫ్రెండ్సే. అందరూ తన చేత అంతో ఇంతో చాకిరీ చేయించు కున్నవాళ్ళే. కాని ఎవర్ని అడగడం? పోనీ పాపారావు నడిగితే? ...

పాపారావు నాన్న పగలు పేపర్ బోయ్‌గా పని చేసేవాడు. రాత్రి సినీమా హాలు దగ్గర పకోడీలు అమ్మేవాడు. పకోడీలు అమ్ముతున్నప్పుడు అతను చూసిన సినీమాల్లో చాలా మంది హీరోల తండ్రులు, తల్లులు సిళ్ళు మోసి, రాళ్ళు పగలగొట్టి తిరగళ్ళు విసిరి, విస్తళ్ళు కుట్టి హీరోలని చదివించి డాక్టర్లని, కలెక్టర్లని చేసేరు. అంచేత అతను తను కూడా హీరోల తండ్రినై పోయి, తన కొడుకుని పెద్ద సైజు హీరోని చేద్దామనుకున్నాడు.

అయితే హీరోని చేద్దామ(న్నకోరిక తండ్రికే వుంది కాని, హీరో బౌదామన్న

కోరిక కొడుక్కి లవలేశం లేదు. మరంచేత పాపారావు పదోక్లాసు ఐదుసార్లు చదివేడు. ఆరోసారి స్కూలువాళ్లు చదవనివ్వలేదు. కాకపోతే చదువుకీ, బతకడానికీ ఏం సంబంధంలేదు కనుక, అతను బతకడానికేం అభ్యంతరం లేకపోయింది. తన క్లాస్‌మేట్స్ జగన్నాథం, రాజేశ్వర్రావు డాక్టర్లై వచ్చేసరికి అతనా ఊరి షావుకార్లలో ఒకడై పోయేడు. ఎలా అయ్యేడు అన్న హంశంమీద డిఫరెంట్ వెర్షన్స్‌వున్నాయి. రెండురూపాయల నోట్లు అచ్చువేస్తాడని కొందరంటే, నల్లమందు వగైరా స్మగ్లింగ్ ఉందని కొందరంటారు ఎవరేమన్నా ఫీల్ అవనంత ఎత్తు ఎదిగిపోయేడతను. ఇప్పు డతనికి రెండు వేరుశనగమిల్లులు, సిమెంటుకోటా, ఫెర్టిలైజరు వ్యాపారం, బేంకులో రెండులక్షలూ, ఇంట్లో లక్షన్నర కేషూవున్నాయి.

వచ్చే ఎలక్షన్లతో అధమం ఎమ్మే అయినా ఔతాడని అభిజ్ఞుల అంచనా.

అతనేపార్టీకీ చెందడు. డబ్బు ఎందులో వస్తే అతనిదా పార్టీ.

పాపారావు, రాజేశ్వర్రావు, జగన్నాథం కలిసి హైస్కూల్లో చదువుకునే రోజుల్లో స్కూలు దగ్గరున్న తోటల్లోంచి మావిఁడికాయలెత్తుకొచ్చి ఉప్పు, కారం అద్దుకొని తినేవారు. ఉప్పు జగన్నాథం, కారం రాజేశ్వర్రావు తెస్తే, మావిఁడికాయలు మాత్రం పాపారావు ఎత్తుకొచ్చేవాడు. అతను కాయలు కోసినట్టు తోటమాలిక్కూడు కదా, చెట్టుక్కూడా తెలీనంత లాఘవంగా కోసేవాడు.

అయితే ఉప్పు తిన్నంత మాత్రాన అప్పు యివ్వాలన్న నియమంలేదు..

అసలు పాపారావునేకాదు ఎవర్నీ అప్పు అడగడం జగన్నాథానికిష్టంలేక పోయినా పరిస్థితులు అడిగేటట్టు చేశేయి. అంచేత అతను పాపారావుదగ్గరకెళ్ళి మాటల సందర్భంతో తను ఇల్లు బాగుచేయిస్తున్నానని చెప్పేడు. ఇప్పటికైనా బాగుచేయి స్తున్నందుకు సంతోషం వెలిబుచ్చేడు పాపారావు. తన ఎస్టిమేట్‌కంటె ఖర్చు చాలా ఎక్కువయ్యేటట్టు వుందన్నాడు ఇగన్నాథం. ఎస్టిమేట్‌కీ, అయ్యే ఖర్చుకీ ఎక్కడా సంబంధం వుండదని దానికి నిదర్శనంగా తన స్వంత అనుభవాలొక రెండు చెప్పేడు పాపారావు. ఈ ఊర్లో ఎవరైనా అప్పు యిస్తారేమో అడుగుదామనుకుంటున్నాననీ, అద్దెకి అప్పు తీరేవరకు వదిలేస్తాననీ చాలా డిప్లొమేటిగ్గా చెప్పేడు జగన్నాథం. ఈ ఊర్లో అంత అప్పు యిచ్చేవాళ్లు వున్నారన్న నమ్మకం లేదన్నాడు పాపారావు అంతేకాని తను ఆదుకుంటానని మాత్రం అనలేదు.

జగన్నాథానికి కొంత జుగుప్స కలిగింది. అన్ని పాపాల్లోనూ మహాపాపం అప్పు అడగడం. అడిగి లేదనిపించుకోవడం ఆ పాపానికి శిక్ష.

కాని ప్రకృతి విచిత్రం ఏఁవిఁటోగాని మనం ఏదైతే ప్రాణంపోయినా సరే చెయ్యకూడదనుకుంటామో, అదే చేస్తాం.

ఇంక చస్తే ఎవ్వర్నీ అడగకూడదనుకున్న జగన్నాథంచేత ద్వారాలు చేసిన షరాబు పొద్దునేవచ్చి లాయరు విశ్వనాథాన్ని అడిగేటట్టు చేశేడు.

(సశేషము)




ఉదయం నాలుగింటికి ఆగింది రైలు ఆ చిన్న స్టేషన్‌లో. భోగరాజు వెంట దిగాను నేను సెకండ్‌క్లాస్ కంపార్ట్‌మెంట్ లోంచి. ఇంకా తెల్లవారక పోవటంవల్ల చీకటి దట్టంగా అలుముకునివుంది. స్టేషన్ లోని లైట్లు అన్నీ వెలగడంలేదు.

సూట్‌కేస్‌లు, బెడ్‌హోల్డాలు దింపిన కొన్నిక్షణాలుకే మళ్ళా బయలుదేరింది రైలు. అది మీటర్‌గేజ్ అవడం వలన రైలింజన్ డీసెల్‌దికాదు. ఆవిరిఇంజన్.

రైలు వెళ్ళిపోయేదాకా చూస్తూ నిలబడ్డాను. భోగరాజు దగ్గరకు వచ్చాడు ఓ పదిహేనేళ్ళ కుర్రాడు.

భక్తిగా నమస్కారంచేసి సామాను నెత్తిమీద, భుజాలమీద ఎత్తుకొని బయటకి నడిచాడు. వాడిని అనుసరించాము మేము. స్టేషన్ మాష్టరు భోగరాజుని విష్ చేశాడు ఇంగ్లీషులో.

బహుశా ఇంగ్లీషు మాట్లాడేది ఆయనొక్కడే అనుకున్నాను. బయట మట్టి రోడ్డుమీద ఆగివున్న జీప్‌లో సర్దాడు మా సామాను. ఆ పదిహేనేళ్ళ కుర్రాడు స్టీరింగ్ వీల్‌ముందు కూర్చుని జీప్‌నిస్టార్ట్ చేయటం నాకాశ్చర్యం కలిగించింది. అంత చిన్న వయలోనే జీప్ నడపడం నేర్చుకోవడం మెచ్చుకోదగింది.

జీప్‌లో ముందు సీట్లలో కూర్చున్నాం నేనూ, భోగరాజు.

"కళ్ళు తెరిచి చూస్తూండు. పులులు. నక్కలులాంటి జంతువులు అనేకంకన

బడతాయి మనం గెస్టుహౌస్ చేరేలోగా. నిద్రపోకు" చెప్పాడు భోగరాజు

జీప్‌ని సన్నటి మట్టిరోడ్డుమీద లాఘవంగా నడుపుతున్నాడు ఆ కుర్రాడు. హెడ్‌లైట్లవెలుగులో ఆరోడ్డుమీద రాలిపడ్డ ఎండుటాకులు, పువ్వులు కనబడుతూ, ఆ రోడ్డు ఎక్కువ వుపయోగంలో లేదని స్పష్టమౌతోంది.

జీప్‌కి రెండుపక్కలా అయిదారడుగుల ఎత్తు పాము పుట్టలు. చూస్తూంటే ఒళ్ళు జలదరించేటట్లుగా ఉన్నాయి.గంధం చెట్లు ఎక్కువగా వున్నాయి.

"ఇంతచిన్న వయసులో ఇతనికి డ్రయివింగ్ ఎలా అబ్బింది." అడిగాను.

"అభ్యాసం" చెప్పాడు భోగరాజు.

"లైసెన్సు లేదా?"

"అనవసరం. ఇక్కడ ఎవరు తనిఖీ చేస్తారు."

"అడవిజాతి వాడిలా వున్నాడే." అడిగాను అతని భుజాలదాక వేళ్ళాడేజుట్టు కండలు తిరిగిన నల్లటి శరీరం చూసి.

"అవును."

సిగరెట్ వెలిగించాను. భోగరాజు జేబులోంచి పొగాకుతీసి చుట్ట చుట్టసాగాడు.

"మన గెస్టుహౌస్ కేర్‌టేకర్ దగ్గర పనిచేస్తాడు వీడు. అడవిలో తిరిగివంటకి కావలసిన వంటచెరకు, దినుసులు తీసుకు రావడం, కూరలు పండించడం ఆవులకి మేత వేయడం, పాలుపిండటం, కోళ్ళని కోయటంలాంటి అనేక పనులు చేస్తాడు. వీడు. మూడుపూట్లా కడుపునిండా తిండి పెడితేచాలు. జీతం భత్యం ఇవ్వక్కర లేదు.కేర్‌టేకర్ తెచ్చుకున్నాడు వీడిని. జీప్ డ్రయివింగ్ నేనే నేర్పించాను.''

"చాకులాంటి కుర్రాడన్నమాట."

"భాష ఒక్కటేబాధ. మన తెలుగ రాదు, వీడి తెలుగు మనకి అర్థంకాదు. వీడికి మాభాష అసలర్థంకాదు."

"సౌంజ్ఞల ద్వారానేనా?"

"కేర్ టేకర్ మేనేజ్ చేయగలుగుతున్నాడు. మనకి తెలియదు "

కాసేపటికి జీప్‌లోంచి దూరంగావున్న కొండపక్కనేవున్న గెస్టుహౌస్‌ని చూపించాడు భోగరాజు. లోపల దీపాలు వెలుగుతున్నాయి.

జీప్ పెద్ద చెక్కగేటు ముందాగింది. దిగకుండా వేగం కొద్దిగాపెంచి, ముందుకి కదులుతున్న జీపుతోనే ఆగేటు తలుపులు లోపలికి నెట్టేలాచేసి, విశాలమైన కాంపౌండ్‌లో ఆపాడు జీప్‌నివాడు.

భోగరాజు వెంట దిగాను. కేవలం సున్నం కొండరాళ్ళతో కట్టిన గెస్టుహౌస్‌కి బయట ఏ రంగూలేదు. అయిదారు గదులుండవచ్చనిపిస్తోంది బయటనుంచి చూస్తే. ఎడంప్రక్క పెద్దబావి. ఖాళీ స్థలంలో వివిధరకాల కూరమొక్కలు. పూలమొక్కలు ఆ చీకటిలో చూచాయగా కనిపించాయి.

లోపలికి నడిచాము. లోపల సున్నం కొట్టివుంది గోడలకి. నాగది చూపించాడు భోగరాజు. కిటికీ రెక్క తెరవడానికి వీలులేకుండా సన్నటి మెష్ అమర్చివుంది లోపల.

"దేనికిది?" అడిగాను.

"పాములు లోపలకి రాకుండా?"

ఆ కుర్రాడు సామాను తీసుకొచ్చాడు లోపలికి. కేర్‌టేకర్ సూచనల ననుసరించి ఎవరిసామాను వాళ్ళగదుల్లో వుంచి




బయటకి వెళ్ళాడు. మళ్ళా జీప్‌స్టార్టయిన శబ్దం. ఇంటి వెనకాల జీప్‌వుంచే షెడ్ వుందనుకున్నాను శబ్దాన్నిబట్టి.

భోగరాజు హాల్లోకివెళ్ళి ఓ పెద్ద బౌండ్‌చేసిన లాన్ బుక్స్‌లో మాపేర్లు, ఎక్కడనుంచి వచ్చిందీ, సమయం, తేదీ మొదలయిన వివరాలన్నీ వ్రాసి సంతకం పెట్టాడు సిగ్నేచర్ కాలంలో.

కేర్‌టేకర్ చెప్పాడు నవ్వి.

"మీ టెలిగ్రాం నిన్ననే అందింది. జీప్ పంపాను. రైలు లేట్ అవలేదన్న మాట."

"కులాసానా!" పలకరించాడు భోగరాజు ఆప్యాయంగా అతని భుజంమీద చేత్తోతట్టి.

తలవూపాడు అతను నవ్వుతూ. ఏభై పైనే వుంటాయి.

"మీ కుటుంబంతో వుంటున్నారా?" అడిగాను.

తల అడ్డంగా వూపాడు.

నా గదిలోకి నడిచాను పడుకుందామని. పెద్ద చెక్కమంచం. నులకతాడు అల్లి వుంది. దోమ తెర.

మర్నాడు ఉదయం ఏడున్నరకి కాఫీ కప్పుతో వచ్చాడు కేర్‌టేకర్.

పదిన్నరకి బ్రేక్‌ఫాస్ట్. ఆమ్లెట్, రెండు జామ్‌వ్రాసిన బ్రెడ్‌స్లైసెస్, టీ.

మధ్యాహ్నందాకా పుస్తకం చదువు కుంటూ కూర్చున్నాను. పన్నెండున్నరకి భోజనానికి పిల్చాడు గెస్ట్‌హౌస్ కేర్ టేకర్.

భోజనంచేస్తూ అడిగాను.

"మీరొక్కరేనా ఇక్కడ వుండేది?"

"అవును."

"విజిటర్స్ ఎవరూలేకపోతే ఒంటరిగా వుండాల్సి వస్తుందికదా. భయంవేయదూ"

"ఆరేళ్ళనుంచి అలవాటు."

"ఈ నల్లమలై ఫారెస్టులో ఆరేళ్ళ నుంచి వుంటున్నారా?"

"అవును. ఆంధ్రప్రదేశ్ ఫారెస్టు డిపార్ట్‌మెంట్‌లో పధ్నాలుగేళ్ళనుంచి పని చేస్తున్నాను. మీలాగా సరదాగా వేటాడ టానికి ఇదివరలో ఎప్పుడూ ఎవరో ఒకరు వచ్చి వుంటూండేవారు. కాని వన్యమృగ సంరక్షణ పధకంకింద వేటని నిషేధించాక ఫారెస్టు ఆఫీషియల్సే వస్తూం టారు అప్పుడప్పుడు. ఒకోసారి విదేశీ యాత్రికులు వస్తూంటారు."

రాత్రి మళ్ళీ జీప్‌లో బయలుదేరాం ఆ కుర్రాడితో. భోగరాజు దగ్గర పర్మిట్ వుంది వేటాడటానికి. సరదాకోసం నేను భోగరాజువెంట వచ్చాను అతని ఆహ్వా నాన్ని అంగీకరించి. నాకు వేటరాదు. తుపాకీ పట్టడం అసలే చేతకాదు.

భోగరాజు నేర్పించాడు నాకు రైఫిల్ ఎలా ప్రేల్చాలో. కుడివైపు ఛాతీకిగట్టిగా అదిమిపెట్టి, సేఫ్టీకేచ్ తెరచి, ట్రిగర్ నొక్కాలి గురిపెట్టాక. ఫైరింగ్ పిన్ బుల్లెట్స్ ఎలా పేలుస్తుందో, గుండు ఎలా దూసుకు పోతుందో, రైఫిల్ పాయింట్‌ని బట్టి దాని శక్తి ఎలా అంచనా వేయాలో, యుద్ధంలో సైనికులు వుపయోగించే రైఫిల్స్ ఎలాంటివో మొదలయినవన్నీ వివరించాడు.

జీవితంలో మొదటిసారిగా రైఫిల్‌ని పేల్చాను నల్లమలై ఫారెస్టులో ఆ అర్ధ రాత్రి. గట్టిగా నొక్కి పట్టుకోక పోవ డంతో. రైఫిల్‌బట్ బలంగా తాకింది నా ఛాతీకి. ప్రేలుడికి అడవి అంతా ప్రతి ధ్వనించింది కొన్ని క్షణాలు.

క్రమంగా వేటలోని థ్రిల్ నాకుతెలియ సాగింది. ఎలాగయినా ఓ పులినో, చిరు తనో వేటాడాలనే ఉత్సాహంతో వున్నాడు భోగరాజు ఆరాత్రి. కారణం కేవలం ఒక రోజు వేటాడటానికే పర్మిషన్ దొరికింది భోగరాజుకి.మర్నాడు మధ్యాహ్నం తిరుగు బండిలో మళ్ళీ నంద్యాల వెళ్ళిపోవాలి మేము. ఒకవేళ అక్కడేవున్నా వేటాడ కూడదు.

నిజానికి ఓ పదిరోజులు వుందామనే ఉత్సాహంతో వచ్చాము ఆ మారుమూల ప్రదేశానికి, తగినంత సామాను, సరం జామాతో.

భోగరాజు తెల్లారేదాకా జీప్‌లో ఓ వందమైళ్ళయినా తిప్పాడు. రెండునెమళ్లు కనబడ్డాయి. ఒకదాన్ని కాల్చాడు నెమలి మాంసం కోసం. రెండు కుందేళ్ళని కాల్చాడు గెస్ట్‌హౌస్‌లో ఫ్రిజిడేర్ లేక పోయినా. తిన్నంత తిని పారేయాలిమిగతా మాంసాన్ని వృధాగా.

క్రూర జంతువులేం కనబడలేదు.

నిద్రమత్తుతో విసుగ్గా వెనక్కి తిప్ప మన్నాడు జీప్‌ని. దారి పొడుగునా ఆ కుర్రాడిని తిడుతూనే వున్నాడు.

"వీడికి తెలుసు పులులెక్కడుంటాయో వాటిజాడ చెప్పకుండా మనల్ని అడవంతా తిప్పి తీసుకెళ్తున్నాడు."

"డబ్బిస్తే చెప్పేవాడేమో?"

"వీడికి డబ్బక్కరలేదు.ఓ రమ్‌బాటిల్ ఇస్తే చెప్పేవాడు, తేవటం మరిచాను.''

ఆశ్చర్యపోయాను ఆ కుర్రాడు తాగు




తాడంటే:

మర్నాడు మధ్యాహ్నం భోజనం అయ్యాక భోగరాజు పడుకున్నాడు. ఉదయం నాకునిద్ర అలవాటు లేదుకాబట్టి పుస్తకం చదవ సాగాను.

సాయంత్రం అయేసరికి విసుగువేసి బయటకెళ్దా మనిపించింది. పైజామా విడిచి పేంట్, బూట్లు తొడుక్కొని భోగరాజు గదిలోకి నడిచాను. గాఢంగా నిద్రపోతున్నాడు.

లేప బుద్ధికాలేదు.

బయటకి నడిచాను. నూతి దగ్గర నీళ్ళు తోడుతున్న ఆ కుర్రాడు నన్ను చూసి నవ్వాడు. ఏదో సౌంజ్ఞచేసి వాడి భాషలో చెప్పాడు. గాని నాకర్థంగాలేదు.

వాడు ఆగమని సౌంజ్ఞచేసి లోపలకి వెళ్ళి భోగరాజు గదిలో గోడకు వ్రేలాడే రైఫిల్ తీసుకువచ్చి అందించాడు నాకు. నేను వేటకు వెళ్ళడంలేదని తెలియదు. తెలిస్తే బహుశ రక్షణకోసంకూడ తీసుకెళ్ళమని ఇచ్చివుంటాడు.

దాన్ని భుజాన తగిలించు కొన్నాక సంతోషంగా నవ్వి. మళ్ళీ తనపనిలో నిమగ్నమయ్యేడు వాడు.

గేటుదాటి నడిచాను అడివిలోకి. అట్టే దూరం వెళ్ళదలచుకోలేదు. దారితప్పే ప్రమాదంవుంది. అందుకే నేవెళ్ళేదారి జాగ్రత్తగా చూసుకుని గుర్తుపెట్టుకుంటూ నడవసాగాను.

దాదాపు ఓపావుగంట అలా నడిచాను.

పుట్టలు, చెట్లు, పొదలు, గుట్టలు, ముళ్ళు. అడవిలో వంటరిగా నడవటం భయం వేస్తుంది కరీంనగర్ లాంటి వూళ్ళో పుట్టి పెరిగినవాళ్ళకి.

ఎదురుగా ఏదో చప్పుడయింది.

ఆగి చూసాను.

ఏం కనిపించలేదు.

నడవసాగాను.

మళ్ళీ ఏదో చప్పుడు.

ఈసారి ఆగిచూశాను. భుజంమీద నుంచి రైఫిల్ తీసి సిద్ధంగా పట్టుకుని.

హఠాత్తుగా ఎదురుగా యాభై గజాల దూరంలో ఓ అడవి మనిషి ప్రత్యక్ష మయ్యాడు. నల్లగా పోతపోసిన విగ్రహం కోయవాళ్ళలా పెరిగిన గిరజాలజుట్టు. నుదుటిమీద పులిచర్మంతో చేసిన బెల్టులా వుపయోగపడే పీలికని జుట్టుకు కట్టు కున్నాడు మొహంమీద పడకుండా, ఎడం భుజానికి అంబులపొది, కుడిచేత్తో సంధించిన ఆరడుగుల విల్లు. వింటికి నాలుగడుగుల బాణం.

బాణం నావైపు, నాఛాతీకి గురిపెట్ట బడివుంది, ఎక్కుపెట్టి.

గుండె ఝల్లుమంది. ఏ మాత్రం ఆలోచన లేకుండా, అసంకల్పితప్రతీకార చర్యలా, రైఫిల్‌కున్న సేఫ్టీకేచ్‌ని వెనక్కి లాగాను. క్లిక్‌మంది బోల్టుదాన్ని వెనక్కి లాగగానే.

వాడి మొహంలోకి చూసాను. ఏమాత్రం దయ, దాక్షిణ్యం లేదా మొహంలో. నల్లరాతితో చెక్కిన మొహంలా వుంది, ఏ భావం తెలియ కుండా. గుబురు మీసాలు భయంకరంగా వున్నాయి. సంధించి ఎక్కుపెట్టిన విల్లుని ఇంకాస్త పైకెత్తాడు గురితప్పకూడదని.

నేను మరింత గట్టిగా పట్టుకున్నాను రైఫిల్‌ని ఛాతీకి ఆనించి.

వాడెవడు?

నేనెవరు?

నామీదకి బాణం ఎందుకెత్తాలి? నేనేం అపరాధం చేసాను? అసలీ అడవిజాతి వాళ్ళకి చంపడం ఓ ఆటా? రైఫిల్ పేలిస్తే గుండు బాణంకన్నా వేగంగా దూసుకుపోయి వాడికి తగులుతుంది. బాణం వదిలితే అంత వేగంగా వస్తుందా? పేల్చి పక్కకి తప్పుకుంటే?

బుర్రనిండా వివిధ ఆలోచనలు. లోపల చెలరేగే భయాన్ని బయట పడ నివ్వ లేదు. నే భయపడుతున్నానని గ్రహిస్తే వాడు నిజంగా బాణం వద లచ్చు.

నిశ్చలంగా నించున్నాం ఇద్దరం ఒకరి కళ్ళలోకి ఒకరు చూసుకుంటూ. సూర్యుడు అస్తమిస్తున్న గుర్తుగా చీకటి వ్యాపి స్తోంది.

ఏంచేయాలి?

కదలాలా, వద్దా?

వాడి కళ్ళలోకి, మొహంలోకి కోపం, పగ, ఉద్రేకం తన్నుకు వస్తున్నాయి ఎంత అణచుకుందామనుకున్నా. తన ప్రాణం సైతం లెక్కచేయకుండా బాణం వదిలేలావుంది వాడితీరు.

బింకంగా రైఫిల్ ట్రిగర్‌మీది కుడి వేలుని అలటకగా వ్రాసాను.

రెండు.

అయిదు.

పది.

పావుగంట దాటింది. అలానే నిల్చున్నాము ఇద్దరం చెరో మారణా యుధంతో. వాడు నించోగలడు. అలా ఎంతసేపయినా కాని నా కలవాటులేదు. అప్పటికే కళ్ళు పీకుతున్నాయి.

దూరంనుంచి గట్టిగా పిలుపు విన బడింది. నా పేరు పిలుస్తున్నాడు కేర్‌టేకర్.

ఇద్దరం విన్నాము ఆ పిలుపు.

వాడు చిన్నగా నవ్విన గుర్తుగా ఎత్తయిన మీసాల వెనుక తెల్లటిపళ్ళు కన బడ్డాయి చీకటిలో.

తల పంకించాడు ఓసారి.

నెమ్మదిగా, అతి నెమ్మదిగా ఎక్కు పెట్టిన విల్లుని మామూలు స్థితికి తీసుకు రాసాగాడు. ఒక్కొక్క అడుగే వెనక్కి వేస్తూ.

వాడి ఆలోచన నా కర్థమై, నేనూ రైఫిల్‌ని కొద్దిగా పక్కకిజరిపి ఒక్కొక్క అడుగే వెనక్కి వేయసాగాను. ఇద్దరం అయిదారడుగుల దూరం వెళ్ళాక వాడు కింద పడ్డాడు హఠాత్తుగా, ఏదో కాలికి అడ్డు తగిలి. చేతిలోని విల్లు దూరంగా పడింది.

నేను వెనక్కి తిరిగి పరుగు లంకించు కున్నాను. వాడు నావెంట పడలేదు అదృష్టవశాత్తు.

రొప్పుతూ పిలుపు వినిపించేవైపు పరిగెత్తాను. గెస్ట్‌హౌస్‌లోని లైట్లు నా కళ్ళ బడ్డాక పరిగెత్తడం ఆపి నడవ సాగాను.

"ఏంజరిగింది?" అడిగాడు కేర్‌టేకర్ నేను ఆయాసపడటం గమనించి.

రొప్పుతూ జరిగింది చెప్పాను.

"వాడు ఇక్కడికి వచ్చాడా మళ్ళీ?" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఎవడువాడు?" అడిగాను.

"ఆ కుర్రాడి తండ్రి."

కోళ్ళని వాటి గూట్లలోకి పంపిస్తున్న



ఆ పదిహేనేళ్ళ కుర్రాడిని – చూపించి చెప్పాడు.

"వాడి తండ్రి. తండ్రిని వదిలేసి నా దగ్గరకి వచ్చాడు. పనికుర్రాడిగా చేరాడు నా దగ్గర. ఆ కోపంతో వాడు నన్ను చంపడానికి నాలుగైదుసార్లు ప్రయత్నిం చాడు. గెస్ట్‌హౌస్ కెవరైనా వస్తే వాళ్ళను చంపడానికి ప్రయత్నించాడు కొత్తల్లో. కాని క్రమంగా ఆ ప్రయత్నం విరమించు కున్నాడు."

"చంపుతాడా నిజంగా?" అడిగాను.

"ఎంతో తేలిక వాడికి ప్రాణాలు తీయడం. ఇక్కడి విజిటర్స్ ఇద్దరికి వాడి బాణాలు తగిలాయి. అదృష్టవశాత్తు చావలేదు. ఆ గాయాల గుర్తులతో వెళ్ళారు ఇళ్ళకి."

ఓ గుటక వేశాను భయంగా.

"మీ దగ్గర రైఫిల్ వుండటంవల్ల బ్రతికిపోయారు."

నీరసంగా లోపలకి వెళ్లాను. భోగ రాజు గదిలో గోడకి తగిలించాను నా ప్రాణాల్ని రక్షించిన ఆ రైఫిల్‌ని.

"ఏమైంది? అడిగాడు కుర్చీలో కూర్చుని టీ తాగుతున్న భోగరాజు.

అప్పుడే లేచినట్లుగావుంది మొహం.

జరిగింది చెప్పాను.

వెంటనే స్ప్రింగ్‌లా లేచాడు భోగరాజు. టీ కప్పు నేలమీదపెట్టి గోడ దగ్గరకి వెళ్ళి రైఫిల్‌ని అందుకున్నాడు.

"పారిపోయి వుంటాడీ పాటికి" అన్నాను.

"అదృష్టవంతుడివి. ఇది కాపాడింది నిన్ను" అన్నాడు రైఫిల్‌ని ముద్దు పెట్టుకుని.

"అవును."

"నిజంగా అదృష్టవంతుడివి. నువే వెనక్కి పడివుంటే నడుస్తూ? వాడు బాణం వదిలివుంటే?"

"కాల్చేసేవాణ్ని నిర్భయంగా."

"అందుకే, ఆ భయంతోనే వాడు నిన్ను చంపలేదు. నిజంగా అదృష్ట వంతుడివి."

"వాడుకూడా."

"కాదు. కేవలం నువ్వే. రైఫిల్‌ని పుదయం క్లీన్‌చేసి గోడకి తగిలించాను. కేట్ రిడ్జెస్ నింపలేదు సూట్‌కేసులోంచి తీసి నింపడానికి బద్ధకంవేసి."

రైఫిల్ బేరల్‌ని నా ముక్కుకి ఆనించి ఆనందంగా నవ్వుతూ ట్రిగర్ గబ గబా నొక్కసాగాడు.

రైఫిల్ పేలలేదు!

క్లిక్! క్లిక్!! క్లిక్!!!

# గోధ తెచ్చిన బాధ

ఎ. శ్యామలారాణి



"శ్రీవరా!" విసుగ్గా కాలు విదుల్చుకున్నాడు నాటకాలరాయుడు రంగరాజు.

"నాన్నెగను నెగనంటే నెగను.... అంతే ...మీ ఎంట తీసుకెల్తావఁనండి.... నాటకాల్లో ఏపిస్తానన౦డి, అంతేకాని 'నెగరా నెగరా' అంటే నాన్నెగనండి!" కాళ్ళు వదలకుండానే అన్నాడు వాడు.

రంగరాజుకి చికొ్కచ్చి పడింది.

పొద్దుట్నుంచి సాగుతోందీ భాగోతం. తొలిరోజు రంగరాజు ట్రూపు వేసిన

డ్రామా చూపిన దగ్గర్నుంచి, మేనత్త దగ్గర ఆకతాయిగా పెరుగుతున్న పోలి గాడికి సడన్‌గా యాక్టర్తై పోవాలన్న బుద్ధి పుట్టింది. అంతే వచ్చిపడ్డాడు కాళ్ళమీద.

ముందులో అంతగా ఖాతరు చెయ్య లేదు రంగరాజు. కాని వాడు పట్టిన పట్టు వదిలేలా కనుపించటంలేదు.

"తిన్నగా మాట్లాడటమేనా చాత కాదు. కావి నాటకాల్లో వేస్తావా?" అన్నాడు వెక్కిరింపుగా.

"ఏందది? నిన్నటేల నాను మాటాడీ బాసలోనేగదా నాటకవాఁడినారు-నా నెందు కాడనేను!"

నవ్వుకున్నాడు రంగరాజు, నిజమే తొలిరోజు వాళ్ళు వేసిన నాటకమంతా పల్లెటూరి యాసభాషలోనే నడిచింది.

"భాష ఒక్కటే చాలదురా—నటన రావద్దూ?" అన్నాడు భయపెడుతూ.

"ఓసారి ఏపించి సూదురూ—మీకే తెలుస్తాది."

రంగరాజుకి వాడి ఉత్సాహం నిజం గానే చూడ ముచ్చటేసింది.

"నీ పేరేమన్నావ్?" అన్నాడు సాలో చనగా.

రప్పున కాళ్ళమీంచి లేచి నిలబడ్డాడు వాడు.

"పోలిసచ్చినోడా అంతాదండి మా యత్త. ఓరి పోలిగా! అంతారండి అంద రూనూ-మరేమోనండి-పోలయ్యండి నా అచలుపేరు" అన్నాడు వాడు సంబర పడుతూ.

"సరే.. ఈ వా ళ నుం డి నీపేరు పోలేష్‌గా మారుస్తున్నాను. జ్ఞాపకం ఉంచుకో. ఏదీ చెప్పు నీపేరు-పోలేష్!"

"పోలీస్."

"ఓరిబడుద్ధాయ్! పోలీసు కాదురా.... పోలేష్!"

"పో. ..లేస్!"

"ఏడ్చావులే ." అని సర్దుకున్నాడు రంగరాజు ప్రయాణ సన్నాహమవుతూ. తోవలో అక్కగారిని చూసి వెళ్ళాలని ప్రయత్నం, మేనగోడలు గురించి వీళ్ళు వాళ్ళు చెప్పిన మాటలు ఆతన్ని బాధిస్తు న్నాయి. పోలిగాడిని తీసుకుని ప్రయాణ మయ్యాడు.

"ఒసేయ్ వరం! లేవ్వే ... . .ఓసి వరంబీ! ఎంతసేపే ఆ మొద్దునిద్దర? దరి ద్రవేఁ అంత నిద్దర. ఏవేఁ వరాలూ . . ఏదీ లేచావా లేదా?"

అలా అలా స్థాయి పెరుగుతున్న సుభద్ర గొంతువింటే వరం, వరాలు, వరంబి అనే ముద్దుపేర్లతో పిలవబడే వర మహాలక్ష్మికి హడల్. తల్లిగొంతు దగ్గర దగ్గరవుతూం దనేసరికి మంచంమీంచి చంగున ఓ దూకుదూకి దొడ్డి తోవగుండా నూతిగట్టు చేరుకుంటుంది ముఖం కడగ డానికి.

కాని- ఆరోజు వరంబి అలా చంగున దూకలేదు. లేవనూలేదు, అసలు భయ పడనే లేదు.

తల్లి ఎదురుగా వచ్చాక చీదరగా అదోలాచూసి దర్జాగా కాస్త ప్రక్కకి ఒరిగి, చేతిమీద తలాన్చుకుని "నన్ను వరం, గిరం అనకు . నేను రాణీ చిత్ర లేఖా దేవిని!" అంది రాజసంగా,

సుభద్రకి ఒళ్ళు భగ్గుమంది.

"ఏమిటీ నువ్వు రాణీ చిత్రలేఖవా, నేకానూ రాణీ అప్పుల కొండయాంబిని,




పాచి ముఖందానా? మొహం కడగవే ముందు!" అంది చిరచిర లాడుతూ.

వరం బెదిరిపోలేదు.

"నేను చిత్రలేఖని!" అంది శాంతంగా.

"ఇంకా నిద్రమత్తొదలకపోతే బిందెడు నీళ్ళు తెచ్చి గుమ్మరించగలను - లేముందు" అని గదిమి. 'నా ఖర్మ ....నింట్లో చెట్టంత కూతురుండీ పిసరంత సాయంలేదు నాకు . ఈవిడగారు ఇక అత్తారింటికె ళ్తే దీన్నుండి రోజూ వాళ్ళందరిచేతా నేనెన్ని దొబ్బులు తింటూండాలో' అని సణుక్కుంటూ లోపలికి వెళ్ళిపోయింది.

అంతే ఆ రోజునుండి వరమహాలక్ష్మి ఒకేమాట అంటూంది. "నేను మీ వరాన్నికాను .. రాణీ చిత్రలేఖాదేవిని!"

ఈ మాటవిని విని ఒళ్ళుమండి సుభద్ర ఓరోజంతా కూతురికి తిండి పెట్టడం మానేసింది. వరం సొమ్మపిల్లి పడుకుందేకాని—మాట తిరగలేదు.

పూర్వం చలాకీగా ఉండే వరంబి మందకొడిగా తయారయ్యిందీ మధ్య. ఎటో చూస్తూ ఏమిటో ఆలోచిస్తుం టుంది. ఎవరికోసం చూస్తున్నావంటే "రాజా భవానీప్రసాద్ కోసం నాకోసం తప్పక వస్తాడతను" అంటుంది.

దయ్యమన్నారు - దేవరన్నారు-అదేం కాదు హిస్టీరియా అన్నారు కొందరు-తిని కూచుని పొద్దుపోక వెర్రి వేషాలని కూడా కొందరన్నారు.

అయితే వరలక్ష్మి తండ్రి అయిన వీర్రాజు మాత్రం 'ఒకవేళ ఇది పూర్వ జన్మ జ్ఞానమే అయివుండేః' అనే మీమాంసలో పడ్డాడు.

సుభద్ర ఏదీ నిశ్చయంగా అనుకోలేక పోయింది.

"నా ఖర్మ ....నా ఖర్మ!" అని మాత్రం తల కొట్టుకుంటుంది.

అసలు కథ ఎక్కడ మొదలైం

# కేవలం సానుభూతి - కన్నీళ్లేగాదు

దుఃఖాన్ని పోగొట్టుకోడానికి లక్షలాదిమందిమి పోరాడుతున్నాము
మన జీవితాలు అస్తవ్యస్తమయిపోయాయి
ఒకనాడు పచ్చని పంటచేలతో కళకళలాడిన పొలాలపై
ఈనాడు రాబందులు ఎగురుతున్నాయి
మనకున్నవన్నీ ఉప్పెన కెరటాలు వచ్చి తుడిచేశాయి
మాకు తెలుసు—మీరు దుఃఖాశ్రువులతో ఉన్నారు ...
కాని, మాకు కావలసింది మీ సహాయసంపత్తి
మీకు చేతనైనంత ముఖ్యమంత్రి తుఫాను నిధికి ఈ
దిగువ అడ్రసుకు పంపండి—

ప్రభుత్వ కార్యదర్శి, రివిన్యూశాఖ, సెక్రటేరియేట్.
హైద్రాబాద్-500 022

ముఖ్యమంత్రి తుఫాను సహాయనిధి పేరుతో
చెక్కులు పంపండి.
బహుమతులు ఈ దిగువ వారిద్వారా పంపించవచ్చు

1. జిల్లా సప్లయి అధికారి
   జిల్లా సప్లయి అధికారి కార్యాలయం, ఎ.సి. గార్డ్స్
   మాసబ్‌టాంక్, హైద్రాబాద్-500 028
2. సూపరింటెండెంట్
   మున్సిపల్ కార్పరేషన్ కార్యాలయం
   దారూషఫా, హైద్రాబాద్-500 001
3. సబ్-కలెక్టర్ - విజయవాడ - ఆంధ్రప్రదేశ్.

సమాచార, పౌరసంబంధాల డైరెక్టరు - హైద్రాబాద్,
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

29/77-78

దంటే—

ఆ ఊళ్ళో ఉన్న పదోక్లాసు వరకూ చదివేసాక, గోళ్ళు గిల్లుకుంటూ పొద్దు గడవక ఇంట్లో కూచున్న వరంబిలాంటి కుమారీ రత్నాలు కొందరు ఒకనాడు అక్కడికి ఆరుమైళ్ళదూరంలో ఉన్న లంగలూరు గెస్ట్‌హౌస్‌లో వనభోజనా లేర్పాటు చేసుకున్నారు.

ఒకప్పుడు లంగలూరు జమీందార్లు ఓ వెలుగు వెలిగారు. ప్రస్తుతం వాళ్లెవ్వరూ లేరు.

జమీందారీలు పోయి చాలా కాలమయింది. అయితే అక్కడ మిగిలిందొక్క గెస్టుహౌసు మాత్రమే. అప్పట్లో విదేశీ దొరలకోసం కట్టించిన భవనమది.

దాన్లో తరతరాలవారి చిత్రపటాలు-వారు వేటాడిన పులులు, జింకలు మొదలగు వన్యమృగాల ఆకృతులు లేదా శవాలు—వారు స్వారీచేసిన అశ్వరాజములు, ఏనుగులు, వారి పెంపుడుకుక్కల ఫోటోలతో, వారి గెడ్డపు గురువుల చిత్ర పటాలతో నిండి ఉంటుందా భవంతి.

వరలక్ష్మి ఆ ప్రదేశం చూడ్డం అదే మొదటిసారి. అలనాటి వైభవాలు ఆ పిల్లనెంతో ఆకర్షించాయి.

రాజామహేశ్వరీప్రసాద్. రాజాభువనేశ్వరీప్రసాద్ తరువాత రాజాభవానీ ప్రసాద్... అంతతో వంశం అంతరించి పోయింది.

అక్కడొక హృదయవిదారకమైన గాథ చెప్పేరక్కడివాళ్ళు. అందగాడైన రాజాభవానీప్రసాద్ చిత్రలేఖ అనబడే అందాల భరిణను రహస్యంగా వివాహమాడి తీసుకొచ్చాడట. ఆమె పొరుగూరి జమీందారుని ఏకైక పుత్రికారత్నం. తరతరాలుగా వారికీ, వీరికీ మధ్య పచ్చగడ్డేస్తే భగ్గుమంటూంది.

తర్వాత కథంతా మామూలే. భవానీ ప్రసాద్ తండ్రి ఆ వివాహాన్ని సమ్మతించలేదు. చిత్రలేఖను బంధించారు. భటు లామెను లాక్కుపోతున్నప్పుడు "చిత్రలేఖా! భయపడకు. నిన్ను, నన్నూ ఎవరూ వేరుచేయలేరు నిన్ను విడిపిస్తా, నీ కోసం వస్తా" నంటూ భటుల చేతుల్లో పెనుగులాడుతూ దర్బారుహాలు దద్దరిల్లేలా అరిచాడట భవానీప్రసాద్.

చిత్రలేఖ తర్వాత మరి కనిపించలేదట. భవానీప్రసాద్ మాత్రం మతి స్థిమితం కోల్పోయాడట "చిత్రలేఖా—చిత్రలేఖా ఎక్కడున్నా నీకోసంవస్తున్నా-వస్తున్నా" నంటూనే ఒకనాడు ప్రాణం విడిచాడట.

అంతలో వారికథే ముగిసిపోయింది. కొత్తగా కట్టించిన గెస్ట్‌హౌస్ మాత్రం మిగిలి పాత భవనాలన్నీ నేలకూలి పోయాయి.

పరమహాలక్ష్మి రెప్ప కదల్చకుండా విందా గాథ.

రాజాభవానీ ప్రసాద్, చిత్రలేఖల చిత్ర పటాలు చూస్తున్నకొలదీ ఆమె హృదయం లోంచీ దుఃఖం తన్నుకొచ్చింది. ఆపుకో లేక ఏడ్చేసింది. తోడవచ్చిన వాళ్ళు కొందరు ఆశ్చర్యపోతే కొందరు నవ్వారు.

"ఎవరికీ రాని దుఃఖం మన వరలక్ష్మి కెందుకొచ్చిందర్రా!" అందోపిల్ల అనుమానంగా.

"ఏమో! పూర్వజన్మలో ఇదే ఆ చిత్రలేఖేమో." తనకున్న పరిజ్ఞానంతో

తన సందేహం వెలిబుచ్చింది కల్యాణి.

* * *

ఆ రాత్రి వరాలుకి నిద్రరాలేదు. బుర్ర నిండా గజిబిజిగా ఆలోచనలే. కళ్ళు మూసినా తెరిచినా భవానీప్రసాద్ అందాల చిత్రమే కళ్ళముందు మెదుల్తోంది. 'ఏమో, పూర్వజన్మలో ఇదే ఆ చిత్ర లేఖేమో!' నన్న కల్యాణిమాట చెవుల్లో హోరుపెడుతోంది.

"అవునా?!" ఆశ్చర్యంగా తనలో తనే ప్రశ్నించుకుంది.

జన్మజన్మలబంధాలు ఈ జన్మకుకూడా వెంటాడుతాయన్న సత్యాన్ని నిరూపించే అనేకమైన సినిమాలు అప్పటికే చాలా చూపింది వరంబి. అదే సత్యాన్ని ఎన్నో కథల ద్వారా, నవలల ద్వారా తెలుసు కుంది. ఆ సినీమాల్లో, కథల్లో నాయికా నాయకు లిద్దరికీ ఎన్నో జన్మలనుండి తీరని కోరిక లీజన్మలో తీరిపోతాయి. ఒకరినొకరు చేరుకుంటారు. కథ కంచి కెళ్తుంది.

'ఒకవేళ నిజంగా ఆ చిత్రలేఖనే నేమో!' అనుకోవడమేమిటి ఒళ్ళంతా విద్యుత్ ప్రాకినట్టయింది వరలక్ష్మికి. తనలోనుండి వరాలు బయటికిపోయి చిత్రలేఖ ప్రవేశించినట్లు అనిపించింది. రాజా భవానీప్రసాద్ కూడా తనలాగే మరొకచోట పుట్టి తనకోసం ఎదురు చూస్తున్నాడనిపిస్తోంది.

'నేను చిత్రలేఖనే-సందేహం లేదు' అనుకుంది దన్నుగా. అంతే ఏడుపు తన్నుకొచ్చింది.

'భవానీ... రాజా ...నేను చిత్రలేఖని ఎక్కడున్నావ్?' అంటూ ఆ రాత్రి ఏకాం తంగా చాలాసేపేడ్చింది. ఆ ఏడుపులో రాజా భవానీప్రసాద్ తనకోసం వస్తాడని గట్టిగా నమ్మింది.

అంతే-పొద్దుటే లేచి తాను చిత్రలేఖ నని డిక్లేర్ చేసింది.

* * *

రంగరాజు తన నాటక సమాజం వాళ్ళందర్నీ పంపేసి పోలయ్యగాడిని మాత్రం వెంటపెట్టుకుని అక్కగారి ఊరొచ్చాడు.

"వరాలి కేమయిందే అక్కా?!" వస్తూనే అడిగాడు ఆందోళనగా.

"అదుగో—దానికోసం రాజా భవానీ ప్రసాద్ వస్తాట్ట-ఆ మామిడిచెట్టు దగ్గర పడేదుస్తూంది చూడు" అంది బాధగా సుభద్ర.

"ఒసేయ్ వరంబీ! ఏమిటే? ఏం జరి గింది? రాజా భవానీప్రసాదెవరు?" నాటక ఫక్కీలో అడుగుతూ వరలక్ష్మి దగ్గర కొచ్చేడు రంగరాజు.

'మామయ్యొచ్చా' డంటూ ఎప్పుడూ ఎదురు పరుగెత్తుకొచ్చే వరమహాలక్ష్మి చురచుర చూసింది.

"వరంబీ—సరంబీ అనకు—నేను రాణీ చిత్రలేఖని!" అంది.

ఫకాల్న నవ్వేడు రంగరాజు.

"సెభాష్! పేరెప్పుడు మార్చేసు కున్నావే? పేరు బానేవుందనుకో గాని, మీ మామ్మ వరాలమ్మ దయ్యమై తిరి గొచ్చి నిన్ను పట్టుకోగల్దు చూస్కో!" అన్నాడు అదే ధోరణిలో.

వరలక్ష్మి మాత్రం అతని ధోరణికి లొంగలేదు.

"అసలేమైందో చెప్పవే వరాలూ?




ఎందుకలా మీ అమ్మని, నాన్నని కాల్చుకు తింటావు? ఈ చిత్రలేఖ ఎవతి మధ్యన? దానిపేరు నువ్వు పెట్టుకోడవేఁవిఁటి? నీకేమైనా మతీసుతీ వుందా లేదా?" అంటూ గట్టిగా యూడించాడు.

వరమహాలక్ష్మి చెక్కు చెదరలేదు.

రంగరాజు ప్రేమగా, సౌమ్యంగా, కరినంగా అన్ని అస్త్రాలూ ప్రయోగించి చూపి తెలుసుకున్నదేమిటంటే, మే న గో డ లి సమస్య అంత సులభ సాధ్యమైనది కాదని.

"అక్కా! నా మాట విని ఓ మారు వాల్తేరు తీసుకెళ్ళి మెంటల్ హాస్పిటల్లో చూపిస్తేనో?" అన్నాడు చివరికి అక్కగారితో.

అంతే తాడెత్తున లేచాడు బావగారు వీర్రాజుగారు.

"పిచ్చంటావేఁవిటోయ్ వ రా లి కి?" అని మండిపడ్డాడు.

"అబ్బే.... నేనలా అనడంలేదు .... ఏదో?" అంటూ నసిగాడు రంగరాజు.

. "రంగా! జన్మాంతర బంధాలమీద నీకు నమ్మకముందా?" నెమ్మదిగా అడిగాడు వీర్రాజు.

"నా నమ్మకాల ఊసెందుకులెండి? మీరు నమ్ముతారా?" సూటిగా అడిగాడు రంగరాజు.

"అదేనోయ్-నేమా సరిగా చెప్పలేకపోతున్నాను. కాని మా తాతముత్తాతలు ఉంగలూరు జమీందార్ల సరసన జమీందార్లుగా మసిలారు—దివాన్ పదవులేలారు. ఆ బంధాలేవో ఇంకా వదలటం లేదేమోనని...."

రంగరాజు తలపట్టుకున్నాడు.

* * *

రంగరాజు వచ్చి అప్పటికి వారం రోజులయింది. వరలక్ష్మిలో ఏమీ మార్పు లేదు. రంగరాజుకి ఇంకా వుండటానికి చాలా ఇబ్బందిగా అన్పించసాగింది. 'ఈ వెధవాకడు దాపురించాడు కదా నా ప్రాణా

# మీ అందరికీ - మీలో ప్రతి ఒక్కరికీ

# విన్నపము

ఈ శతాబ్దంలోనే కని విని ఎరుగని తీవ్రమైన ఉప్పెన ఆంధ్ర ప్రదేశ్ కోస్తా జిల్లాలను ముంచెత్తింది. వేలాది ప్రజలు మరణించారు. జంతువులు చనిపోయాయి. ఆస్తి నాశనమైంది. పంటలు తుడిచివేయబడ్డాయి.

ఫలితంగా, వేలాది దురదృష్టవంతులైన పురుషులు, స్త్రీలు, పిల్లలు—నిరాశ్రయులయ్యారు. వారి హృదయ విదారక గాథలు వినలేము.

రాత్రింబవళ్లు తుపాను బాధితులకు సహాయ కార్యక్రమాలు పెద్ద ఎత్తున సాగుతున్నాయి. తుపాను పీడితుల కడగండ్లను బాపేందుకు యుద్ధ ప్రాతిపదికపై త్వరితగతిని సహాయమందించబడుతోంది.

హిమవన్నగ పరిమాణంలో వచ్చిన ఈ ఆపత్తును గడవడానికి కేవలం ప్రభుత్వ యంత్రాంగం మాత్రమే పనిచేస్తే సరిపోదని అందరికీ తెలుసు.

ఈ పరీక్షా సమయంలో, మీ అందరి సహాయం తక్షణం జరగాలి. మీరు ఏ స్థాయిలోని వారైనా, ఏ జీవనప్రాంగణంలో కృషి చేసేవారైనా, మీ సహాయంకూడా ఎంతగానో తోడ్పడుతుంది.

అందుచేత మీరంతా, ప్రతి ఒక్కరూ ఈ అవసరాన్ని గుర్తించి, ముఖ్యమంత్రి సహాయనిధికి విరివిగా విరాళాలందించండి.

డైరెక్టరు,

**సమాచార, పౌరసంబంధశాఖ,**

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదు.

25/77-78

నికి!' అని పోలిగాడిమీద విసుక్కున్నాడు.

ఓ ప్రక్క కూతురిగురించి, బెంగతో కుళ్ళిపోతూ అందరికీ వార్చిపోసే అక్క గారిని చూస్తే జాలేస్తూంది.

"అక్కా! నే వెళ్తానే ఇక. వరాలు గురించేమీ బెంగ పెట్టుకోకు . . అదే నెమ్మదిగా సర్దుకుంటుందిలే... నీవంట్లోనే బాగులేదు.... నాకూ, నాతోపాటు తగబడ్డ ఆ వెధవకీ ఎంతకని చేసిపెడతావు?" అన్నాడు చివరికి.

"నువ్వు కూడా వెళిపోతే నాకు మరింత పిచ్చెత్తి పోతుందిరా తమ్ముడూ! అది తిరిగి కాస్త మనలో పడేవరకూ నన్నొదిలెళిపోకురా బాబూ!" అంటూ కన్నీళ్ళు పెట్టుకుంది సుభద్ర.

రంగరాజు ఇరకాటాన పడ్డాడు. అక్కడుండి తను చెయ్యగల ఉప కారమూ లేదు. వెళతానంటే అక్క ఏడుస్తుంది___ఏంచెయ్యడం? చివరికి ఉండక తప్పదని నిశ్చయించుకున్నాడు.

అప్పుడే ఎక్కడెక్కడో తిరిగి, కులా సాగా చుట్ట పొగ గుప్పు గుప్పు మని పించుకుంటూ ఇంట్లో అడుగు పెడు తున్నాడు పోలిగాడు.

"ఒరే పోలిగా!" చిరాగ్గా ఒక్క కేకే సాడు రంగరాజు.

"నాపేరు పోలేసని మీరే చెప్పినారు గదా! మళ్ళీ పోలిగా అంతా రేటండీ?" అని సణుక్కుంటూ వచ్చాడు వాడు.

రంగరాజుకి ఓపక్క ఒళ్లు మండి పోతూంది.

"ఏడ్చావులే కాని-తేరగా మేపి చుట్ట కాల్చుకుంటూ ఊరల్లా బలాదూరు తిర గటం కాదు-ఇంట్లో పనోపాటో కాస్త చూస్తూండు-ఆ గొడ్ల పనేదో చూడ్డం__ ఆ పాక క్లీన్ చెయ్యడం- ఆ మాత్రం చెయ్యలేవురా?" అని గదిమాడు.

"నాను సెయ్యనన్నానేటండీ? ఇయ్యాలకాడ్నించి సూస్కోండి!" అంటూ హుషారుగా అప్పుడే దొడ్ల పాకలో ప్రవేశించాడు వాడు.

*   *   *

రంగరాజు దసలే నాటకాల ప్రాణ మేమో, ఇలా అక్కగారి ఊళ్ళో ఊరికే గోళ్ళు గిల్లుకుంటూ కూచుందికి చికాగ్గా ఉంది.

ఇలా మరోవారం గడిచిపోయింది.

దూరపు బంధు వొకాయన వచ్చి వరంబికొక చక్కని సంబంధం చెప్పేడు. 'కుర్రాడు స్ఫురద్రూపి, మంచి స్థితిపరులు ..ఇంజనీరు....మీ కిష్టమైతే మీ వరలక్ష్మిని చేసుకుంటామంటున్నారు వాళ్ళు-ఎప్పుడో ఇదివరకొకసారి చూసా రట' అన్నాడతను.

"దాని మొహానికంత అదృష్టమా?" రహస్యంగా తల కొట్టుకుంది సుభద్ర.

"వారం. పదిరోజుల్లో మేమే కబురు పంపుతాంలెండి!" అంటూ సర్దేసి పంపిం చేసాడు రంగరాజు వరలక్ష్మి ప్రస్తుత పరి స్థితి గురించి చెప్పకుండా.

ఆరోజు రంగరాజు, వీర్రాజు, సుభద్ర ప్రాణాలు విసిగేవరకు వరంబికి ఎంతో బోధపరిచారు. ఇంత మంచి సంబంధం తేలిపోతే చాలా కష్టమని, ఆ దిక్కు మాలిన భవానీప్రసాద్ సంగతి మరచి పోమని గడ్డం పుచ్చుకు బ్రతిమాలేరు.

"లేదు.... రాజా భవానీప్రసాద్ నా

# కృష్ణాజిల్లా తుపాను బాధితులకు సహాయం విజ్ఞప్తి

కృష్ణజిల్లా తుపాను బాధితులకు బట్టలు, దుప్పట్లు, రగ్గులు, మందులు, తినుపదార్థములు, ఇంటి సామగ్రి, ఇళ్ళు కట్టుకునేందుకు అవసరమయ్యే వస్తువులు, టార్పాలిన్లు మొదలగునవి అందించదలచిన దాతల్ను, సహాయక సేవాసంస్థలు, ఇతర సంస్థలు, తగు సూచనలు, సలహాలు పొందుటకుగాను, విజయవాడ సబ్-కలెక్టరువారి ఆఫీసులో నున్న, తుపాను బాధితుల సప్లయిల స్పెషల్ ఆఫీసరుగారిని కలుసుకోవలసినదిగా కోరుచున్నాము.

సేవాసంస్థలు, సేవాతత్పరులైన వ్యక్తులు, తామే స్వయముగా వస్తువుల నందించదలచేవారు, సేవలు చేయ నుద్యుక్తులయినవారు కూడ పంపిణీ సక్రమంగా జరిగేందుకు, అందినవారికే మరల అందకుండ ఉండేందుకు, ఒక ప్రాంతంలో సేవలను కేంద్రీకరించి కృషిసాగించేందుకు సంప్రదించవచ్చును.

ఐచ్ఛిక సేవాసంస్థలు ఒకటీ లేక కొన్ని గ్రామాలను దత్తత చేసుకొనుటకు, లేక తుపాను బాధితులకు తాత్కాలికంగా నివాసయోగ్యంగా ఉపయోగపడే సమిష్టి మందిరాలను నిర్మించేందుకు గూడ నా సలహా తీసుకోవచ్చునని మనవి.

ఈ దిగువ ఫోన్ నెంబర్లతో సంప్రదించవచ్చును.

ఉదయం గం. 8-30 నుండి రాత్రి గం. 8-30 వరకు: 62290-విజయవాడ
ఇతర కాలాలలో 61158-విజయవాడ

పి. దానం, ఐ. ఎ. ఎస్.,
స్పెషల్ ఆఫీసర్

తుపాను బాధితుల సహాయ సప్లయిలు, విజయవాడ.

28/77 - 78

కోసం వస్తాడు. చిత్రలేఖకోసం వచ్చి తీరుతాడు!" అంటూ ఎప్పటి ధోరణిలోనే వుంది వరాలు.

"పూర్వ జన్మ స్మృతి కాక దీన్నే మంటావ్ చెప్పు?" నిస్పృహాయంగా అడిగేడు వీర్రాజు రంగరాజుని.

"పిచ్చి!" అందామనుకున్నాడు రంగరాజు. కాని పులిలాంటి బావమరది, అందునా లుంగలూరు దివాన్ల వారసుడు ఏం చేసిపోతాడోనని భయపడి నోరు మెదపలేదు.

* * *

ఓ రాత్రివేళ వరమహాలక్ష్మికి మెలకువొచ్చింది. కాలుమీద ఎలక పాకినట్లయింది. కాలు విదుల్చుకొని మళ్ళీ పడుకుంది.

కిటికీలోంచి పున్నమి చంద్రుడు తొంగి చూస్తున్నాడు. "రాజా... భవానీ" అనుకుంటూ తన్మయంగా కళ్ళుమూసుకోబోయింది.

మళ్ళీ ఎలక పాకినట్లయింది. అంతే కాదు కొంచెం గోళ్ళతో బరికినట్లు కూడా ఉంది.

కెవ్వుమని కేకేసి మంచంమీంచి లేచింది.

ఎదురుగా నవ్వుతూ పోలిగాడు.

భయంతో ఒక్కసారి గడ్డగట్టుకుపోయింది వరంబి.

"ఏటి పిత్తర్లేకా ... ఏటలా సూస్తన్నవ్? నానెవరో నీ కెరికినేదా? నాను పిత్రా .... నాను .. బవానీ పెసాదుని .... రాజా బవానీ పెసాదుని....నీ బరతని.... పిత్రా ...నా రానీ!" అనుకుంటూ దగ్గరికి రాబోతున్నాడు పోలిగాడు.

బిక్కచచ్చిపోయున్న వరలక్ష్మికి ఒక్కసారి మైకం దిగినట్టుంది. 'తను చిత్రలేఖయితే ఈ వెధవ భవానీప్రసాదా!' ఆశ్చర్యంగా, కంపరంగావుంది వరాలుకి.

'ఛీ ... నేనసలు చిత్రలేఖని కాను ... వరలక్ష్మిని....వీర్రాజుగా రమ్మాయి వరమహాలక్ష్మిని....వరాన్ని! వరాల్ని! వరం బిని!' పొంగుకొస్తున్న దుఃఖాన్నాపుకుంటూ, చురుగ్గా నాల్గువైపులా చూసింది.

గదిమూలగా చాపాటి కర్ర కనిపించింది.

పోలిగాడు వరలక్ష్మిని సమీపిస్తున్నాడు.

మెరుపులా తప్పుకుని, కర్రపుచ్చుకుని వాడినోరేవు పెడుతూ కేకలెయ్యడం ప్రారంభించింది.

అర్ధరాత్రివేళ ఆ అరుపులు చెవినపడటంతో కంగారుగా లేచివచ్చారంతా.

కళ్ళు నులుముకుని చూసాడు రంగరాజు.

వరలక్ష్మి వాడిని ంకా తంతూంది. పోలిగాడు మొర్రో మొర్రో మనిపోతున్నాడు.

"వరాలూ!" బిగ్గరగా అరచి వెళ్ళి ఆ కర్రందుకున్నాడు రంగరాజు.

"మాఁవయ్యా!" అంటూ రంగరాజు మీదపడి భోరున ఏడవడం ప్రారంభించింది వరాలు.

"ఏఁవయిందే? ఈ వెధవెందుకిక్కడున్నాడు?" గాభరాగా అడిగాడు రంగరాజు.

"నేను తలుపుదగ్గర చాపేసుకుని పడుకునుంటే .... మరే.... మరే .... ఈ వెధ

వేమో ..." వెక్కలతో చెప్పలేక చెప్తూంది వరలక్ష్మి.

"ఈ వెధవటా.. .మరేమో.. రాజా భవానీప్రసాదట!" అంటూ మళ్ళీ బాంద్రు మంది.

అంతా కొయ్యబారిపోయారు. వీర్రాజే ముందు తేరుకున్నాడు.

"ఏం వెధవా! తోలొల్చేయాలేవిఁటి?" అన్నాడు మండిపడుతూ.

"మీ పిత్తం . .మీరేటి సేస్తే అది సెయ్యండి. రేత్తిరి ఉన్నపలంగా నా అసలు జలమ గాపకం ఒచ్చేసినాది.... నానూ పిత్తర్లేకా కిందటి జలమలో బార్యా బరతలం. కలిసి బతకనేక ఇడి ఇడిగా సచ్చిపోనాం....ఇప్పుడిలా మళ్లీ పుట్టినాం. నాను పిత్తర్లేక పెనివిఁటిని....పిత్తర్లేకా! నన్ను గురుతుపట్టనేదా? నారానీ! నన్నే దన్నినావా? అయ్యో దేవుడా! నా రాని సేతే నన్ను దన్నించీపినావా?!" అంటూ పోలిగాడు గోలపెట్టసాగేడు.

అందరికీ మతులు పోతున్నాయి.

"ఛస్ వెధవా! నోర్ముయ్! చుట్టపీకలా ముఖం నువ్వూను. నువ్వు రాజాభవానీ ప్రసాదువా? పోలిచచ్చిన వెధవా?" వీర్రాజు వీరావేశమెత్తిపోయి పోలిగాడిని ఎడాపెడా తగల్నిచ్చేడు.

"నాను పోలిచచ్చి నెదవని కాదు బా బో య్‌! నాను బవానీపెసాదునే తం(డ్రోయ్‌—పి త్తర్లేకా! నువ్వయినా సెప్పవా....నా రానీ! నన్ను రచ్చించవా!" ఇన్ని తన్నులు తిన్నా అరుస్తూనే ఉన్నాడు వాడు.

ఇక లాభంలేదని రంగరాజు ఒడుపుగా పోలిగాడిని పట్టుకుని పక్కగదిలోకి తోసి తలుపులు మూసేసాడు.

"ఈ పాజీ వెధవట-గోచీకి గతిలేని వెధవట-రాజాభవానీ(ప్రసాదట!" ఇంకా పళ్ళు నూరుతూనే ఉన్నాడు వీ(రాజు.

"బావా! వాడు చెప్తూన్న దొకవేళ నిజమోనేమో! ఆలోచించరాదూ! అస లిలాంటి నమ్మకాలులేని నాకుకూడా అను మాన వొ(స్తూంది!" అన్నాడు రహ స్యంగా దగ్గరకొచ్చి రంగరాజు.

"ఛీ! నీకు నోరెలా వస్తూందోయ్‌ అలా అనుకుందికి? ఈ గోచిపాత వెధవ రాజాభవానీ(ప్రసాద్‌?" కస్సుమన్నాడు వీ(రాజు.

"ఏం? రాణీ చి(త్రలేఖ మనం మరం బిగా పుట్టవచ్చును గాని భవానీ(ప్రసాదు పోలిగాడుగా పుట్టకూడదేమిటి? ఏ(వే వరాలూ! నువ్విన్నాళ్ళూ ఎదురు చూసిన రాజా...."

రంగరాజు మాట పూర్తికాకుండానే "ఛీ!" అంది వరలక్ష్మి.

"వీడుట్టి వెధవ! మా(వయ్యా. వాడి మాటలేం నమ్మకు. అయినా నేనేం చి(త్రలేఖని కాను. ..నేను.... నేను వరాల్ని ....మీ వరంబిని!" అంటూ మళ్ళీ కాం(డ్రుమంది వరమహాలక్ష్మి.

ఎలా వచ్చిన చి(త్రలేఖ అలానే పోయింది.

అందరి ముఖాలు విప్పారేయి. కాని మూసిన తలుపులు బాదుతూ "నాను బవానీ పెసాదునే బాబోయ్‌!" అంటూ బొబ్బలు పెడుతూనే ఉన్నాడు పోలిగాడు.

* * *

మర్నాడుదయం—

వరమహాలక్ష్మికి పెళ్ళివారిని తీసుకు రావడానికి వీ(రాజు బయలుదేరాడు. ఆ ఇంజనీరు కు(రాడ్ని తల్చుకుని వరాలో (ప్రక్క మురిసిపోతూంది. సుభ(ద్ర తిరపతి కొండ కొస్తానని మొక్కుకుంది.

"పి త్తర్లేకా—నారానీ!" అని ఇంకా పలవరిస్తూన్న పోలిగాడిని బలవంతాన బస్సెక్కించి తనూ ఎక్కాడు రంగరాజు.

బస్సు కదిలింది.

"సెభాష్‌రా పోలేష్‌! ఇక ఆపెయ్‌ ఆ ఏడుపు. యాక్టరువనిపించుకున్నావురా! చెప్పినట్టుగా నటించి నాటకం గొప్ప రక్తి కట్టించావురా పోలిగా!" అంటూ భుజంతట్టి అభినందించాడు రంగరాజు.

"ఒల్లకోండి బాబూ! ఒల్లు హూనవ(యి పోనాది. ముందా వరాలమ్మ-ఆ ఎనకాల్ల బాబు కల్సి నా ఎ(విక విరిసేసినారు— ఓలమ్మో-నొప్పి!" బాధగా నడుం పట్టు కున్నాడు పోలిగాడు.

* * *

(అల్లిబిల్లి ఊహా లోకాల్లో అందంగా విహరిస్తూ చిలిపి గారడీలుచేసే టీనే జర్స్‌కి చిరుకానుక.) □

"వాడికి నిన్ను గార్డియన్‌గా పెట్టినట్టు మనం ఎప్పుడూ అనుకోలేదు. కాని మా తమ్ముడు మెడిసిన్ మూడోయేడాది మూడోసారి తప్పిన యేడాది నువ్వు అక్కడికి ట్రాన్స్‌ఫర్ అవడంవల్ల నువ్వు వాణ్ణి ఒకదార్లో పెడతావని ఆశపడ్డాను;

# బాటిల్ భగవద్గీత

## భమిడిపాటి రామగోపాలం



అమాట నీకు నేను స్వయంగా మీవూరొచ్చి చెప్పానుకూడానూ. అటు తిరిగి యిటుతిరిగి నువ్వు వాణ్ణి బాగుచైదంపోయి నువ్వూ వాడితోబాటు బార్‌లకి వెళ్ళి వాడికి పెద్ద దిక్కవడం నుంచి వాడికి కంపెనీ యిచ్చేస్తున్నావని తెలిసి నేనెంత బాధపడ్డానో తెలియదానికే యీ వుత్తరం. వాడు ఎలాగా చెడిపోయాడు నువ్వుకూడా చెడిపోతున్నావని బాధపట్టు కుంది నాకీవాళ—" అని ఇంకా ఏమి టేమిటో రాసేడు సత్యనారాయణ.

సత్యనారాయణ తమ్ముడు పరమ హంస పదమూడేళ్ళబట్టి ఈ వూళ్ళో మెడిసిన్ చదువుతున్నాడు. అంటే ఎం.డి., ఎం.ఎస్. అలాంటివన్నీ చేసేసి ఏదో స్పెషలైజేషను చేస్తున్నాడని కాదు. మామూలుగా ఆరేళ్ళు చదవవలసిన ఎం.బీ బీ.యస్.నే పదమూడో యేడు చదువుతున్నాడు.

వాళ్ళన్నయ్య నా క్లాసుమేటు. పరమ హంసని అతనే చదివిస్తున్నాడు.

మొదట్లో రెండేళ్ళు బాగానే చదివాడు పరమహంస. ఆ తరువాత అతనికి మెడిసన్‌మీద అభిరుచి పోయింది. కారణం ఇదీ అని నేను చెప్పలేను. కాని అతను మంచి ఏక్టరై పోతాడని అందరికీ అతనికి కూడా ఆశ కలగడమే కారణం అని నిర్ధారణ అయిపోయింది. ఎందుకంటే మూడో యేడాదిలో వుండగా రాష్ట్రంలో వున్న మెడికల్ కాలేజీలన్నిటిమధ్య ఒక నాటకాల పోటీ జరిగింది. అందులో ఉత్తమ నటుడుగా బహుమతిని గెల్చుకున్న పరమ హంస. ఆ తరవాత మెడికల్ కాలేజీ

నాటకాల్లోనే కాక రకరకాల యితర నాటకాల్లో కూడా వేషాలువేసి, మంచి నటుడని ఖ్యాతి సంపాదించుకున్నాడు. ఈ పదేళ్ళమధ్యా అతను ఒక వంద నాటకాల్లో వేషాలువేసి డాక్టరవడంకంటె ఏక్టరవడం తనకీ జనానికీ మంచిదనే నిర్ణయాని కొచ్చేశాడు.

ఎందుకంటే, మొన్నీ మధ్య మా జిల్లాలో నటులందరూ పాల్గొన్న ఒక బ్రహ్మాండమైన నాటక మహోత్సవాల్లో ప్రముఖ పాత్ర వహించి, ఆ సందర్భంగా వెలువరించిన ప్రత్యేక సంచికలో తన్ను తాను పరిచయం చేసుకుంటూ రాసిన వాక్యాలు ఇవి——

"వైద్య వృత్తిగాని ఈ కోర్సులో చేరడంగాని నా అభిరుచి కాదు. పదమూడేళ్ళ కిందట పి. యు. సి.లో నాకు వొచ్చిన మార్కులనుబట్టి మా బంధువులు నాకు నిర్ణయించిన జీవిత మార్గం అది. మైనర్నై ఉన్నప్పుడు నా జీవిత మార్గాన్ని ఎంచి పెట్టిన మా బంధువుల అభిరుచి కన్నా; మేజరయ్యాక జీవితం అంటే అర్థం అవడం ప్రారంభించేక నాకుగా నేను ఎంచుకున్న అభిరుచి నాకు ముఖ్యం కదా. నేను మంచి నటనను స్టేజిమీద విజయవంతంగా ప్రదర్శించగలనని మొహమాటస్తులే కాక నిర్మొహమాటస్తులు కూడా వొప్పుకుంటున్నారు. ఈలోపుని మెడికల్ కాలేజీలో చదువుతూ వుండడాన్ని ఆసుపత్రికి దగ్గరగా అతుక్కుపోయి వుంటూ, వైద్య వృత్తిని శాస్త్ర దృష్ట్యానేకాక కళా దృష్టితో కూడా గమనించగలిగాను. ఎన్నాళ్ళో పరిచయం వుంటే గుణాలకంటె దోషాలే ఎక్కువ కనబడతాయన్న సూత్రం ప్రకారం, అనుభవంతో తెలుసుకున్న సత్యం ఏమిటంటే వైద్య వృత్తి మానవ సేవ కోసం ఏర్పడలేదని, ఇదో పెద్ద మనోవైజ్ఞానిక వ్యాపారమనీ. రోగుల సమస్యలు అర్థం చేసుకుని సర్వీస్ ఎబౌసెల్ఫ్ అనుకోవలసిన డాక్టర్లలో ఎంత లేసి కసాయి గుండెలవాళ్ళుంటారో నాకు అనుభవైకవేద్యం అయింది. అలా వుండలేను. అలా వుండకపోతే ఆ వృత్తిలో నిలదొక్కుకోలేనేమో. అంచేత డాక్టర్ని అవడంకంటె ఏక్టర్ని అవడం నా కిష్టం."

ధోరణి యింత ముదురు పాకాన పడినా, ప్రతిరోజూ నాకు కనబడే పరమహంసతో అతని అభిప్రాయం రైటని వొప్పుకుంటూనే జీవించడానికి వొక డిగ్రీ అవసరమని బోధపరుస్తున్నాను నేను.

అతనితో 'బార్'కి వెళుతున్నానని తెలిపి సత్యనారాయణ నేను కూడా అతనితోబాటు మందు పుచ్చుకుంటానని అభాండం వేసేడు. పరమహంసని జాగ్రత్తగా రూమ్‌కి తీసుకు రావడానికే వెళుతున్నానని నేను చెపితే మాత్రం సత్యనారాయణ నమ్ముతాడా? "బారు కెళ్ళి నీరు త్రాగిన చందాన" అయింది నా పని.

ఈ రాత్రికి తప్పకుండా అతను బార్‌కి వెళతాడు. ఎందుకంటే ఇవాళ్టికీ వారం అయింది అతను సీసా ముట్టుకుని. పైగా నరసింహారావనే ఫ్రెండు అతని దగ్గర ఎప్పుడో ఆర్నెల్లనాడు తీసుకున్న యాభై రూపాయలు ఇవాళ తిరిగి ఇచ్చేశాడు. ఈ రాత్రి అతనికి నా పరిస్థితి అతని పరిస్థితి చెప్పేసి నీకు మందు కావాలో వైద్య

వృత్తి కావాలో తేల్చుకోమని తెగేసి చెప్పెయ్యదలుచుకున్నాను.

*　　*　　*

"అంచేత, పరమహంసా-" అన్నాను కొంత పునాది వేసిన తర్వాత.

నే చెప్పబోయేది తనకి తెలుసునన్నట్టు ఓ చెయ్యి నన్ను మాట్లాడొద్దని సంజ్ఞ చెయ్యడానికీ రెండో చెయ్యి గ్లాసు ఎత్తడానికీ వాడాడు పరమహంస.

నేను వూరుకోలేదు "అంచేత పరమహంసా—మెడిసిన్ తొందరగా ఫినిష్ చెయ్యవయ్యా; ఇక్కణ్నించి వెళ్ళిపో వచ్చు!" అన్నాను.

"ఇదుగో, ఇంకొక్క రౌండు! అంతే" అన్నాడు పరమహంస.

"సర్లె. నేను మెడిసిన్ కోర్సుగురించి మాట్లాడుతూ వుంటే నువ్వు మందు గురించి మాట్లాడుతున్నావు" అని చికాకు పడ్డాను.

"మంచి పాటొస్తోంది వినండి గురూగారూ" అన్నాడు పరమహంస; కొంచెం దూరంలో వున్న లౌడ్ స్పీకర్‌ను చూపిస్తూ.

"దమ్ మారో దమ్!" అని స్టీరియోలోంచి వినవస్తోంది "రస"వత్తరంగా.

లాన్‌లో టేబుళ్ళన్నీ తనిఖీ చేసుకుంటూ వొస్తున్నాడు నూకరాజు; బార్ మేనేజర్. కొన్నాళ్ళ కిందట వొక ప్రయివేటు కంపెనీలో నేనూ అతనూ కలిసి పని చేసేం. నా దగ్గరగా రానిచ్చి. "ఏమిటి నూకరాజూ, ఎలా వుంది బిజినెస్?" అని పలకరించాను.

నా సంగతి పట్టించుకోకుండా నూకరాజూ పరమహంసా షేక్‌హాండ్లిచ్చుకుని సిగరెట్లంటించుకున్నారు

"కాస్త మంచి రికార్డులు పెట్టమనవయ్యా" అని మళ్ళీ నేనే. నూకరాజు నాకు సమాధానం చెప్పనప్పటికీ మాట్లాడాను.

"అలాగే, అలాగే—" అని వెళ్ళాడు నూకరాజు.

"మీ అన్నయ్యా వదినా, మీ అమ్మానాన్నా అందరూ కూడానూ, నువ్వు మెడిసిన్ తొందరగా పూర్తిచేసి, మంచి ప్రాక్టీసు చేసే డాక్టరువై రెండు చేతులా సంపాదించి ఈ కోర్సుకి నీ మూలంగా వాళ్ళకైన అప్పులు తీరుస్తావని వెయ్యి కళ్ళతో యెదురు చూస్తున్నారు బాబూ, మూడ్రోజులకోసారి నువ్వు బార్ని పావనం చేస్తావు. మధ్యలో రెండ్రోజులూ నిద్ర పోతావు. ఇలా అయితే ఎప్పటికి తెమిలేట్టు?" అని వుపదేశం మొదలెట్టాను.

"అదికాదూ;—" అని నా న్నే డు పరమహంస.

వాళ్ళన్నయ్య నాకు రాసిన ఉత్తరం తీసేను, జేబులోంచి.

స్టీరియోలో రికార్డు మారింది. ఘంటసాల భగవద్గీత ఎల్. పి. రికార్డు తగిలించారు. శ్లోకం అర్థం, కమ్మని కంఠం లోంచి వింటూ తన్మయం చెందుతూ ఉత్తరం అందించేను పరమహంసకి.

పరమహంస మూడోరౌండు పూర్తి చేసి, చుక్కారొట్టి ముక్కలుగా విరిచి పచ్చి బఠాణీల మసాలా కూర మీద పడ్డాడు. స్పీకర్‌వేపు చూపించి "ఇదేం ఖర్మ?" అన్నట్టొక అంగికం చేసేడు.

"నేచెప్పింది నీకేమేనా బోధపడిందా?" అన్నాను.

బేరర్ వొచ్చి బిల్లుపెట్టాడు. పరమహంస దాన్ని తీక్షణంగా పరిశీలించి, చిల్లరతోసహా డబ్బూ, కొంత టిప్పూ సాసర్లో పెట్టాడు. బేరర్ సలాంచేస్తూ సాసర్ తీసుకెళ్ళబోయాడు.

"డబ్బు తీసుకెళ్ళు. సోపుగింజలూ టూత్ పిక్సూ కాసేపు అక్కడ వదిలెయ్" అని ముద్దగా మాట్లాడుతూ సాసరుమీద అరిచెయ్యి మోపాడు పరమహంస.

"యస్సార్!" అని బేరర్ వెళ్ళాడు.

"ఏంటీ; ఏదో చెబుతున్నావు! ఇప్పుడు చెప్పు!" అని ఏకవచన ప్రయోగంతో మొదలెట్టాడు, లేస్తూ, పరమహంస. "మెడిసిన్ తొందరగా ఫినిష్ చెయ్యాలా? మా వూళ్ళో ప్రాక్టీస్ పెట్టాలా?....మా బ్రదర్ కే అనుకున్నాను, నీక్కూడా బుద్ధి లేదు గురువా!....ఎంచేతంటావా? నేను చెప్తాను విను—నేను చెప్పేది అబద్ధమూ కాదు; నువ్వది విని గాభరా పడిపోనూ అక్కర్లేదు. నే న్నిజం చెప్తున్నాను ...ఏంటీ—మా వూళ్ళో జెనాభా యెంత?—తెలుసా?—తెలీదు నీకు. మా వూళ్ళో జెనాభా యనభై వేలు. మరి డాక్టర్లెంతమందున్నారో తెలుసా? ఎంత మంది?—అదీ తెలీదు నీకు—నూట ఎనభయి ఆరుగురున్నారు. ఇంకా నే నొక్కణ్ణి తక్కువయ్యానా?"

"పోనీ గవర్నమెంట్ జాబ్ కి ట్రై చెయ్యొచ్చుగా!"

"ఏంటీ, గవర్నమెంటు జాబా? చెయ్యాలి చెయ్యాలి. ఏది జాబ్ కాదు, ట్రై చెయ్యాలి. డీఎమ్మెస్ ఆఫీసు కెప్పుడన్నా వెళ్ళావా? వెళ్ళలేదు. అక్కడెన్ని అప్లికేషన్లున్నాయో తెలుసా? తెలీదు—ఓన్లీ సిక్స్ థౌజండ్—ఆరువేల దరఖాస్తులు మాత్రము అక్కడ పెండింగున్నవి: అక్కడా నాదొక అప్లికేషన్ తక్కువగా వుంది. అదేగా, నువ్వూ మా అన్నయ్యగాడూ చెప్పేది?"

భగవద్గీత ఉచ్చైస్స్వరంలో వినవస్తోంది.

"పోనీ పరీక్షలన్నీ టకటక పాసై హౌస్సర్జెన్సీ చేసేస్తే మంచిది కదుటయ్యా! ఆడపిల్లకి కన్నెచెర వదలాలి; మొగపిల్లాడికి చదువు చెర వదలాలి!" అన్నాను.

అంతే. నేనన్నది!

అందులో తప్పేమిటో నాకు తెలీదు.

అసలు తప్పుంటుందని నేను అనుకోనేలేదు.

కాని, మాట పూర్తయ్యేసరికి గూబ గుయ్యిమనేటట్టుగా కొట్టాడు నన్ను పరమహంస.

"నా ప్రాణాలు తోడేస్తున్నార్రా బాబూ. మా అన్నయ్యొకడు. ఆడు చాలక నువ్వొకడివి, మీ రిద్దరూ చాలక—" భగవద్గీత వినిపిస్తున్న స్పీకరు వేపు చూపిస్తూ "ఆ నూకరాజుగా డొకడు!" అన్నాడు.

"బారులో తులసీదళమైనా వెయ్యొచ్చునేమో కాని బారులో భగవద్గీత వెయ్యకూడదు!"

అనుకుంటూ యివతల పడ్డాను; పరమహంసని ఆటోరిక్షావరకు నడిపించుకుని వస్తూనూ. □

# * అణికాడు

మాదిరెడ్డి సులోచన *

సమత అశాంతిగా అటు, ఇటు దొర్లు తుంది. ఆమె ఇరవై యేళ్ళ జీవితంలో ఏనాడు యెరగనంత బాధ మనసును తొలిచి వేస్తుంది.

"నాన్న ఏదో ఒకటి నిర్ణయించి, ఆచరించు, అని ఆజ్ఞాపించదేం?" అను కుంది పదే పదే.

"సమూ ..విషయమంతా విన్నావు కద. మంచి, చెడు ఆలోచించి నిర్ణయిం చుకో తల్లీ" అన్నాడు.

తన భవిష్యత్తు తాను నిర్ణయించుకో లేక పోతుంది. స్వేచ్ఛలో ఇంత మధన ముంటుందని తనకేనాడు తెలియదు. లేచి మెల్లగా బయటికి వచ్చింది. ప్రక్క గదిలో తమ్ముడు క్రాంతికుమార్ పాఠము చదువుతున్నాడు.

జగన్‌పై విపరీతమయిన కోపం వచ్చింది. మోసకాడు అనటానికి మనస్సు అంగీకరించలేదు. ఏమనాలి? ద్రోహి. . కాదు.

"సార్ అణీకాడు అంటే ఏమిటి సార్" క్రాంతికుమార్ అడిగాడు.

"అ. . .అణీకాడంటే మర్మమెరి గిన వాడు...." సార్ జవాబు విన్నది సమత.

"అవును! జగన్‌ను అణికాడు అన వచ్చు. తండ్రి బలహీనతలన్నీ యెరిగిన వాడు. అందుకే అంత సాహసం చేశాడు.

'అద్దాల మేడలో ఉండేవాడు ఇతరులపై రాళ్ళు రువ్వకూడదు' అన్న సామెత ఉండనే ఉంది. మెల్లగా క్రిందికి వచ్చింది. హాల్లో పేపర్ చదువుతున్న శ్రీపతి కూతుర్ని చూచి నవ్వాడు చిన్నగా.

"రా సమూ, కూర్చో. ఏం నిర్ణ యించుకున్నావ్?"

"ఇంకా...." నోట్లో ని మా ట నోట్లోనే ఉండిపోయింది.

"నాకేం తొందర లేదమ్మా. జగన్ తండ్రి మళ్ళీ ఫోన్ చేశాడు" అన్నాడు.

"వేరే సంబంధం చూసుకొమ్మను నాన్నా."

"సమూ!" ఆశ్చర్యంగా, ఆనందంగా, అపనమ్మకంగా చూచాడు.

"అవును నాన్నా! రేపు, రేపు ఇలాం టివే జరిగితే అల్లుడని ఊరుకుంటారు. తల యెత్తుకు తిరుగలేరు."

"హృదయ పూర్వకంగా అంటు న్నావా సమూ?"

"అవును నాన్నా! మీ పరువు ప్రతి ష్టలే పోతాయి. నా జీవితమే పణంగా పెట్టవల్సి వస్తుంది."

ఇద్దరి కళ్ళూ కలుసుకున్నాయి.

అతని కళ్ళలో అన్వేషణ!

ఆమె కళ్ళలో అచంచలమైన ఆత్మాభి మానము.

"నీ నిర్ణయాన్ని అభినందిస్తున్నాను" కూతురిని దగ్గరగా తీసుకుని నుదురు ముద్దు పెట్టుకున్నాడు శ్రీపతి.

"ఫోన్ చెయ్యండి నాన్నా!"

అన్నదే కాని అక్కడ నిలబడి సంభాషణ వినలేకపోయింది.

మూడు సంవత్సరాల అనుబంధం ఒక క్షణంలో తెగిపోబోతుంది. ఏం తోచని దానిలా పైకి వెళ్ళింది. తమ్ముడి గొంతే వెంటాడుతుంది.

"అణిఃకాడు...."

అంటే మర్మమెరిగినవాడు. అణిః కాడు... మర్మమెరిగినవాడు ... మెల్లగా లేచి పిట్టగోడ దగ్గరకు వచ్చింది. ఆమె కళ్ళముందు జగన్ రూపం మెదిలింది. యెంత అందమైన రూపం! దాని వెనుక యెంత అల్పమైన ఆలోచనలు! ఆరడుగుల యెత్తు మనిషి. నొక్కుల జుట్టు. సూదంటు రాళ్ళలా వెలిగే కళ్ళు. చిలక ముక్కులా కొనదేలి కాస్త ముందుకు వంగిన ముక్కు. చక్కని శరీరచ్ఛాయ ....ఆలోచనలు గతాన్ని స్పృశించాయి.

ఆ రోజు తను హోమ్‌వర్క్ చేసుకుంటోంది.

"అక్కయ్యా! అమ్మ అవధానిగారింటికి పేరంటానికి వెళ్ళింది. నాన్నగారు నిన్ను కాఫీ చెయ్యమంటున్నారు" క్రాంతికుమార్ హడావుడిగా వచ్చి చెప్పి వెళ్ళిపోయాడు.

సమత క్రిందికివచ్చి, కాళ్ళకు బ్రేకు లున్నట్టు టక్కున ఆగిపోయింది. అందంగా, ఆకర్షణీయంగా ఉన్న యువకుడు నిల్చున్నాడు.

"రామ్మా....నా కూతురు సమత.... జగన్‌మోహన్ అని, మనకు దూరపు బంధువు...." పరిచయం చేశాడు. నమస్కరించింది.

"నమస్తే...." అన్నాడు తల ఒక ప్రక్కకు ఊగిస్తూ. వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటుండగా సమత కాఫీ తెచ్చింది. కాఫీ త్రాగి జగన్‌మోహన్ వెళ్ళిపోయాడు.

శ్రీపతిగారు ఓ ఇండస్ట్రియల్ ఎస్టేట్‌కు డైరెక్టరు, పార్టనర్ కూడాను. అతనికి సమత క్రాంతికుమార్ ఇద్దరే సంతానం.

సమత పెరిగింది. అందరూ మా అమ్మాయికి డాక్టరు, ఇంజనీరు, కలెక్టరు కావాలని అనుకుంటే దానికి విరుద్ధంగా ఉన్నాయి శ్రీపతి అభిప్రాయాలు.

"నాకేం పెద్ద పెద్ద ఆశలు లేవండి. నాకు చేదోడు, వాదోడుగా ఉండే కుర్రాడు మా సమత అభిప్రాయాలు గౌరవించేవాడయి వుంటే చాలు. బీదవాడయినా పరవాలేదు" అనేవాడు.

ఆ జగన్‌మోహన్ .... ఊహించలేకపోయింది. తీయని ఊహలు ఆమెను వివశురాల్ని చేశాయి.

రాత్రి తండ్రికి పత్రిక ఇద్దామని వెళ్ళి టక్కున ఆగిపోయింది సమత.

"మా జయమ్మ కొడుకును పంపింది సుశీలా! కుర్రాడు అందంగా, చురుకుగా ఉన్నాడు."

"ఏం జయమ్మ భర్త అందంగా లేడూ! బుద్ధే అల్పమయింది. లంచాలకు మరిగి ఉద్యోగం పోగొట్టుకున్నాడు. అయినా మనకెందుకు?" అన్నదామె.

"అదేం మాట! అప్పచెల్లెండ్ల మన

షలు, మనవరాంధ్రం, ఆదుకోకపోతే యెలా! నా చేతి క్రిందికి ఓ మనిషి కావాలి.”

“నాకు తెలుసులెండి నచ్చితే సమ

తను....”

“ఆ....ఆ....అక్కడే ఆగు మనకు అభిప్రాయం ఉండగానేసరా! అమ్మాయి ఇష్టమేమో....”



సమతకు తండ్రికి అప్పటికప్పుడే నమస్కరించాలనిపించింది. పిల్లల అభిప్రాయాలకు విలువ నిచ్చేవారెవరు ఈ కాలంలో! పేపర్ అక్కడే వున్న స్టూల్ మీద పడేసి తన గదిలోకి వెళ్ళిపోయింది.

జగన్‌మోహన్ శ్రీపతికి కార్యదర్శి అయ్యాడు. అతని కుటుంబాన్ని ఆదుకోవటం తన బాధ్యతగా భావించి, ఊరికి దూరంగా తన పేరిటవున్న రెండువందల గజాల స్థలంలో రేకుల షెడ్డువేసి పౌల్ట్రీ ఫార్మ్ పెట్టించాడు. జగన్ తరువాత

ముగ్గురు పిల్లలను కాలేజి, బడులలో చేర్పించాడు. ఒక సంవత్సరం తిరిగేసరికి ఆర్థికంగా బాగా పుంజుకున్నాడు జగన్ తండ్రి సోమశేఖర్.

ఒకనాడు ఉదయము మేడమెట్లపై సర్ఫ్‌పొడి కాసింతచల్లి కడుగుతుంది సమత.

"జారుతుంది జాగ్రత్తమ్మా........" తండ్రి హెచ్చరించాడు.

"ఫరవాలేదు నాన్నా...." అన్నది. రెండు నిమిషాల తరువాత శ్రీపతి మాటలు తథాస్తు అన్నట్టు జారింది. కాలో, చెయ్యో విరుగుతుందని, కళ్ళు మూసుకుంది. కాని బలమైన కౌగిట్లో బందీఅయి గాలిలోకి లేచింది. అరుద్దా మన్నా నోరురాలేదు. సోఫాలో పడు కున్నాక, మందంగా, మృదువుగా విని పించి కంఠం పోల్చుకుంది.

"భయపడ్డారా సమతా!"

"ఏమయింది?" సుశీలమ్మ వచ్చింది.

"మీ అమ్మాయి సబ్బునీళ్ళచల్లి నడువ గలనా అని ప్రాక్టీసు చేసింది. పట్టు తప్పింది అంతే ..." నవ్వుతున్నాడు జగన్. కళ్ళువిప్పి లేచి కూర్చుంది. అతను అల్లరిగా నవ్వాడు. తను మూతి ముడి చింది. ఆ తరువాత ఇద్దరూ చాలా సన్ని హితులయ్యారు. సినిమాలకి, షికార్లకి తిరగటమేకాక, శ్రీపతికి శరీరంలో ఓ భాగంలా తయారయ్యాడు జగన్. పెద్దలు అంగీకరించకపోతే భయపడేవారేమో. పెద్ద లిష్టపడిన వరుడు. అందుకే మరింత చేరువయ్యాడు.

"మామయ్యా! నేను సమత సినిమా కెళ్తాం."

"అలాగే వెళ్ళండి" నవ్వుతూ అనుమ తించేవాడు.

"పెళ్ళి అయ్యాక యెటూ తిరుగుతారు. ఇప్పటినుండే అంత స్వేచ్ఛగా తిప్ప కుంటేనేం?" సుశీలమ్మ అనేది.

"జగన్, క్రాంతి ఇద్దరూ కొడుకులే నాకు. .." తన్మయత్వంలో చెప్పేవాడు.

సినిమానుండి హోటల్ కు వెళ్ళి భోజనం తక్కువా, కబుర్లు ఎక్కువా చెప్పుకుని వచ్చేవారు. అలాంటప్పుడు కొన్నిసార్లు ఆటోవాళ్ళు రారు. ఎక్కడికి అని అడిగి వదులుకుంటారు.

"జగన్! మనకో స్కూటరుంటే బావుండదూ?"

"విమానం ఉన్నా బాగానే ఉంటుంది కాని ..."

"ఛస్.... కాని అర్థజాల గురించి మాట్లాడకూడదు నా కాబోయేశ్రీవారు ..." ముద్దుగా మందలించింది.

"నా విలువే అంత...." అన్నాడు. అందుకు మూడురోజులు అలక సాగించి, స్కూటర్ కొనిపించింది.

"చూడు మామయ్యా, స్కూటర్ కొన మంటే డబ్బు లేదన్నాను, నాతో మాట్లాడ్డటం లేదు. తనొచ్చి తీసు కొమ్మనేవరకు నాకు స్కూటరే వద్దు." జగన్ ఫిర్యాదుచేశాడు. శ్రీపతి పక, పక నవ్వేశాడు.

"బాగుంది పోట్లాట. అరగంటలో మీరు రాజీపడండి. లేకపోతే స్కూటర్ క్రాంతి కిచ్చేస్తాను ..." ఆయనలేచి వెళ్ళి పోయాడు. ఇద్దరి కళ్ళుకలుసుకున్నాయి. చూపులు పెనవేసుకుని మూగగా మాట్లాడు కున్నాయి.




"సారీ జగన్ ... 'లవ్‌స్టోరీ'కి వెడదామా!" సమత అడిగింది.

"ఏం మన 'లవ్‌స్టోరీ' ఇంటరెస్టింగ్‌గా లేదా!" భుజంతో డీ ఇచ్చాడు. ఇద్దరూ తయారయ్యారు.

"అత్తయ్యా! అమ్మ వరలక్ష్మివ్రతం చేసింది. మిమ్మల్ని సాయంత్రం పసుపు కుంకుమకి రమ్మన్నది" జగన్ చెప్పాడు. అంతవరకు అయిష్టంగావున్న సుశీలమ్మ యిద్దరి జంటను చూచి మురిసిపోయింది.

సాయంత్రం పేరంటానికివెళ్ళిన సుశీలమ్మ వచ్చేసరికే సమతవచ్చి వంట చేసింది. భోజనాలవుతున్నాయి.

"మీరు ఓ ఇండస్ట్రియల్ ఎస్టేట్‌కి డైరెక్టరు. మనింట్లో వంటమనిషిని పెట్టుకోవాలంటే వెనుకంజ వేస్తున్నాము. ఆ ఖర్చులు, హోదా పౌల్ట్రీమీద యెలా మేంటేన్ చేస్తుందో మీ చెల్లెలు."

"అదీ ఒక ఆర్ట్ అంటాను సుశీ." ఆయన నవ్వుతూ మరింత కూర వేసుకున్నాడు.

"ఏమో! మళ్ళీ ఏం వ్యవహారాలు మొదలుపెట్టారోనని దిగులుగా ఉంది" అన్నది సుశీల.

"సోమశేఖరం అలాంటివాడే కాని ఇప్పుడు చెయ్యడు" అన్నాడు. ఆ తరువాత అతను ఉద్యోగా లిప్పిస్తానని, శ్రీపతి పేరుమీదుగా డబ్బు తీసుకుంటున్నాడని తెలిసినా, అందరూ అసూయతో అన్న మాటలని ఊరుకున్నాడు. జగన్ వినయవిధేయతలు చాలా నచ్చాయి.

శ్రీపతి ఆఫీసులో కూర్చుని ఫైల్స్ చూసుకుంటున్నాడు. ఆరోజు అతనికెంతో ఆనందంగా వుంది. వర్కర్స్‌కి బోనస్ ఇవ్వగా తను కారు కొనుక్కోవచ్చు. సమత వివాహము చెయ్యవచ్చు అను

కున్నాడు. అతను ఊహాలోకంలో వుండగా, అతని ఆలోచనలు భంగం చేస్తూ ఫోన్ మ్రోగింది.

"హల్లో........మురళీ........ యెప్పు డొచ్చావ్? వారం రోజులయిందా! అప్పుడే హోటల్ అప్పగించాడా మీ నాన్న.... అవుననుకో...." హోటల్ నందన ప్రొప్రయిటర్ కొడుకు మురళి. కేటరింగ్‌లో ఏదో షార్ట్‌టర్మ్ కోర్స్ అంటే అమెరికావెళ్ళి, అలాగే ప్రపంచ యాత్రచేసి వచ్చాడుట.

"నేనా!... పదివేలా! యెవరొచ్చారు? రాజారావనే కుర్రాడా!...... చిత్రంగా ఉందే.... అప్పుడప్పుడు అవసరానికి మీ నాన్నదగ్గర డబ్బు తీసుకునేమాట వాస్తవమేకాని....ఈరోజు పంపలేదు ..గంట తరువాత కేష్ వస్తుందని పంపానా? ... మంచిపని చేశావు .... వస్తున్నాను ..." అతను ఆదుర్దాగా లేచాడు.

సోమశేఖరం కాదుకదా, రాజారావు పేరుతో మోసగించేది? అతని ఒళ్ళు గగుర్పాటు చెందింది. అతను లేచి బయటికి వచ్చాడు. తన పాత జావా తీశాడు.

"నాన్నా!" సమత వచ్చింది.

"ఏమ్మా!" జావా ఆపాడు.

"ఏంలేదు నాన్నా! రాధిక పెళ్ళి. వెళ్ళడానికి మీ అనుమతి...."

"పిచ్చిపిల్లా స్నేహితురాలి పెళ్ళికి వెళ్ళటానికి అభ్యంతరం చెబుతానా!"

"మీరే వేళప్పుడు..." అనుమానంగా చూచింది. విషయము చెప్పాడు.

"ఎవరా రాజారావు? నేను చూస్తాను నాన్నా" ఇద్దరూ జావాపై హోటల్ నందనకు వెళ్లారు. ప్రొప్రయిటర్ ఏర్ కండిషన్ గదిలో కూర్చున్నారు. మురళి వాళ్ళకు కాఫీ తెప్పించాడు.

"నాన్నకు, మీకు ఉన్న డీలింగ్స్ ఇంకెవరికి తెలుసు అంకల్?"

"మా కాబోయే అల్లుడు జగన్‌కు తెలుసు."

"ఓ! అయిసీ. కంగ్రాచ్యులేషన్స్ మిస్ సమతా" అన్నాడు.

"థాంక్స్" అన్నది పమిట వేలుకు చుట్టుకుని.

"మనిషెలా ఉంటాడు మురళీ?"

"చూస్తారుగా! యెత్తు పొడవు వుంటాడు. పైజామా, లాల్చి వేసుకుని గాంధి కేప్ పెట్టుకున్నాడు."

సమత తేలికగా నిట్టూర్చింది.

"జగన్ నాన్నగార్ని గుర్తిస్తాడు .. యెవరయి ఉంటారు...." వాళ్ళ ఆలోచన పూర్తి కాక ముందే బయట బెల్ వినిపించింది. మురళి వెళ్ళి తలుపు తీశాడు. వచ్చిన వ్యక్తిని చూచి తండ్రి కూతుళ్లు కళ్ళు అప్పగించారు.

"వీరే మీరు పంపిన రాజారావు మామయ్యా...."

ఆ రాజారావు...కాదు జగన్‌మోహన్!

"జగన్ .జగన్ నువ్వా?" శ్రీపతి నోరు విప్పాడు. సమత మాటలు రానట్టు ఉండిపోయింది.

"ఆ....ఆ...." అతను స్ప్రింగ్‌డోర్ తీసుకుని పరుగెత్తినట్టే వెళ్ళిపోయాడు.

"ఓ ..మై గాడ్!. . నేను....జగన్‌కు ఏదీ తక్కువ చేయలేదు మురళీ... ఏది..."




వాళ్ళ స్థితి చూచి అతనే కాబోయే అల్లుడని గ్రహించాడు మురళి.

"అంకల్ . . జరిగింది మరచిపో... " ఏమని ఓదార్చాలో అర్థం కాలేదు.

"చాలా ప్రణాళిక వేశాడు మురళీ! నువ్వు అతడని గుర్తించవని నాన్న లేని సమయము చూచి చేశాడు. రేపు గుర్తు పట్టినా నిన్నే అబద్ధాలకోరుగా నిరూపించే వాడు."

"నాన్నా! నా తల తిరుగుతుంది" సమతకు అప్రయత్నంగా కళ్లు సజల మయ్యాయి. వాళ్ళు వద్దన్నా మురళి లిఫ్ట్ ఇచ్చాడు. వారం రోజులవరకు అందరూ అలమటించిపోయారు. జగన్ రాలేదు. శ్రీపతి అందరికి తను స్వయంగా వస్తే తప్ప డబ్బు ఇవ్వకూడదని చెప్పాడు.

ఓ రోజు జయమ్మ వచ్చింది. బుడి. బుడి దీర్ఘాలు తీసింది. ముక్కు చీదేసింది.

"అన్నయ్యా! నా కొడుకువల్ల ఏదయినా పొరపాటు జరిగితే క్షమించు. ఏం జరిగిందో అన్నం, నీళ్లు మాని పడుకున్నాడు" అన్నది.

"జయా! ఏది జరిగినా మన మంచికే జరిగింది. నువ్వు నిశ్చింతగా ఉండు. నాకు నేనుగా ఉద్యోగంలో పెట్టించలేను. ఓ అయిదువేలిస్తాను. వ్యాపారం చేసుకొమ్మను" అన్నాడు. ఆమె యెంత బ్రతిమాలినా లాభంలేకపోయింది.

సోమశేఖరం సమతను అడ్డుపెట్టుకోవాలని కొడుక్కు సలహా ఇచ్చాడు సమత అతడి బలహీనతను క్షమించాలని నిర్ణయానికి వచ్చేలోగా జగన్‌మోహన్ ఫోన్

# తుపాను బాధితులకు విరాళాలు-సేకరణ కేంద్రాలు

ఇటీవలి సంభవించిన తుపాను బాధితులకు సహాయక చర్యలు చేసేందుకుగాను నగదుగా గాని లేక ఇతరత్రా గాని విరాళాలు ఇవ్వవలసిందిగా ప్రజలకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము మనవి చేస్తున్నది. విరాళాలు దిగువ తెలియపర్చబడిన కేంద్రాలకు పంపవచ్చును. ఉతుకులు పడ్డవైనప్పటికీ బట్టలు విరాళంగా పంపవచ్చును. దాతలు వారి విరాళాలు రైలుద్వారా విజయవాడకు పంపగోరినచో, అట్టివారు ఆ విషయము ముందుగా సబ్ కలెక్టర్ విజయవాడ వారికి తెలియపర్చగోర్తాము. ముందుగా తెలియపరిచినచో ఆ సామగ్రి సకాలంలో రైల్వేస్టేషన్ నుండి డెలివరీ తీసుకోవటానికి ఏర్పాట్లు ముందుగా తీసుకొనుటకు వీలవుతుంది. నగదుగానీ, చెక్కులద్వారాగానీ విరాళాలను 'ది చీఫ్ మినిస్టర్స్ సైక్లోన్ రిలీఫ్ ఫండ్'కు పంపవచ్చును.

## విరాళాలు అందుకొనే కేంద్రాలు

ఎ) సి మునిసిపల్ కమీషనర్స్ ఆఫీసు,
దారుల్‌షఫా, హైదరాబాద్-ఆం. ప్ర. -ఫోన్ నెం. 57769

బి) ది మునిసిపల్ కార్పొరేషన్ ఆఫ్ హైద్రాబాద్,
సికింద్రాబాద్ డివిజన్, సర్దార్ పటేల్ రోడ్,
సికింద్రాబాద్-ఆం. ప్ర. -ఫోన్ నెం. 72012

సి) ది డిస్ట్రిక్టు సప్లయి ఆఫీసర్, ఎ.సి. గార్డ్స్. మసబ్ టాంక్ రోడ్,
హైదరాబాద్- ఆం. ప్ర. -ఫోన్ నెం. 220939

డి) ది సైక్లోన్ రిలీఫ్ రిసీవింగ్ సెంటర్, C/o. సబ్ కలెక్టర్,
విజయవాడ-ఆం. ప్ర. -ఫోన్ నెం. 96-76063

ఇ) ది కలెక్టర్, గుంటూరు-ఆం. ప్ర. - ఫోన్ నెం. 97-21925

రొఖ్ఖంగా లేక చెక్కులు రూపేణా విరాళాలు అందుకునే కేంద్రం
ది సెక్రటరీ టు గవర్నమెంటు, రెవిన్యూ డిపార్టుమెంటు, సెక్రటేరియట్,
హైదరాబాద్-పిన్‌కోడ్-500022.

సమాచార మరియు పౌర సంబంధాల డైరెక్టర్
హైదరాబాద్ (ఆం.ప్ర.) వారిచే జారీచేయబడినది

27/77 - 78



ఇంట్లో పెట్టమని పురమాయించి వెళ్ళేరు. రంగి వొచ్చింది. తగిన సమయం వొచ్చింది అనుకున్నాడు. దాహం దాహం!! ఆడదాహం! కామదాహంతో వొళ్ళు వేగిపోతున్నది! తనలో ఈమార్పు మంచిదికాదని తనకితెల్సు. ఈ దాహం చెడ్డదన్న సంగత్తెల్సు. కాని ఆలోచన వేరు. అవసరం వేరు! అవసరం ఎప్పుడూ అదేమిటో ఆలోచనతో కలవదు! దానితో కుస్తీపట్టేసి అయినాసరే వోడించేసి, తనే గెలుస్తుందాయె!! నిగ్రహించుకోడం చాలా కష్టం అయిపోయినదవాళ! రంగిని లోనికి రమ్మన్నాడు! మీదకి లంఘించేడు. పులితో లేడి పోరాడినా ఎంత సేపని? ఇది ఇదే! అదదే!

అవసరం తీరిపోనాది! దాహం చల్లారిపోనాది! జరిగిందేంటి?! రంగిని బ్రతిమాలుకున్నాడు. ఎవురికీ చెప్పొద్దన్నాడు. "పెళ్ళి చేస్కుంటావా?" అని అడిగింది రంగిఏడుస్తూ. చేస్కుంటానన్నాడు. 'ధూ!' అని మొఖంమీద వూసింది రంగి. నీలాంటి దరిద్రపు చచ్చినోణ్ణి పాపిష్ఠివోణ్ణి నాను చేస్కుంటానా? అని తిట్టింది బూతుల్తో! అదెంత పన్చేస్తుందో, ఎంతమందితో చెప్తుందోనని భయంతో, జలదరింపుతో, వొణుకుతో, ఇంక ఒకనిముషం వుండకుండా ఎకా ఎకిని ఆ ఇంటినించి, వీధినించి, వూర్నించే పారిపోయేడు?! రైలెక్కేసేడు. టిక్కెట్టు కొన్లేదని కొన్నాళ్ళు జెయిల్లో పడేసేరు. ఏదో వూరు! ..

అబ్బ! వొళ్ళు తూలింది ... అనుకున్నాడు బైరాగి. దాహంతో గొంతు ఎండిపోయింది. నాలికతో పెదాలు తడి

చేసుకోబోయేడు. తడేలేందే ఏం చేసుకుంటాడు? బడ్డీవోడు సోడాకాయివ్వడు! ఏ రవుడీవోడైనా ఆడి కొట్టుమీద జులుం చేసి, 'సోడా యిత్తావా? ప్రేణాలిత్తావా?' అంటే అప్పుడాడు వూరికే ప్రేణాలైనా ఇచ్చేత్తాడు. గాని వుత్తినే ఒక్క సోడా కాయివ్వడే!?

బైరాగి నింపాదిగా బైల్దేరేడక్కడి నించి ఆ చుట్టుపక్కలవున్న ఇళ్ళదగ్గరికి. వాళ్ళు తలుపులు, కిటికీలు మూసేసుకున్నారు! లోపలకి గాడ్పు కొడ్తుందని కాబోలు! ఫేనులు, పిఠిడైర్లూ వుంటాయాళ్ళకి!! వాళ్ళకేం? సౌరగంలో వున్నోళ్ళకి అనుబవాలకేం తక్కువ?

గొంతులోకి కడుపులోంచి ఓపికని లాక్కొచ్చి "అమ్మా" అని కేకేసేడు బైరాగి. ఏఁచడీలేదట్నుంచి! మళ్లా పిలిచేడు. మళ్ళా మళ్ళా.. ఓపిక నశించిపోతోంది. ప్రాణం కడంటిపోతోంది. ఇప్పుడో, ఇంకాస్సేపటికో, తను చచ్చిపోడం ఖాయం. ఈ దాహంతో, ఈ బాధతో! ముష్టి నేకపోతేపోయె. ఇన్ని నీళ్ళు పొయ్యడానికేం? ఏంటో! ఈ మడుసులు!

బైరాగి అలసటగా తన కర్ర కొట్టుకుంటూ తన పంచలోకివచ్చి చతికిలబడ్డాడు. మళ్ళా గతం బుర్రలో కదులాడింది. అదివాళ కదలాడక మానటంనేదదేవిటో!

....అప్పుడలా ఏదో వూరు పారిపోయిన బైరాగోడు యేంచేసేడు? ఆ అయ్యనీ, ఈ బాబునీ బతిమిలాడుకుని అద్దెకి రిషా పుచ్చుకుని తొక్కేవోడు. ఏదో గడిచిపోయేది. తన సంపాదన్జూసి, పక్కింటి వొంటేలు నప్లయరు ముసలయ్య ఆడికూతురు పద్దాల్నిచ్చి పెళ్ళిచేసేడు. పద్దాలు మొదట్లో పండునాగావుండేది. తర్వాత్తర్వాతది మేడి పండయిపోనాది. ఏవో రోగాలు....మంచం....మూలుగులు.ఓ కూతురు పుట్టింది తనకి. 'నచ్చిందేవి' అని పేరెట్టుకున్నాడు. నిజంగా పటంలో నచ్చిందేవినాగే వుండేది! పద్దాల్నించి తనకి సుకంనేదని బాధపడి ఉండనేక 'ఆడసుకం' కోసం వాచిపోయి ఎదుక్కునేవోడు! ఇంట్లో దొరకని దాహాన్ని వూరిమీద తీర్చుకున్నాడు.

మంచం వొదల్లేనంటూనే ప్రేణం వొదిలీసిందోనాడు పద్దాలు!

నచ్చిందేవి ఎదిగింది, యేపుగా, ఎర్రగా. దాని పెళ్ళికోసమని డబ్బు కూడేయసాగేడు. కాని నచ్చిందేవి ఓరోజు చెప్పా చెయ్యకండా పారిపోయింది! తను దానిమీద పెట్టుకున్న ఆశల్ని, కలల్ని, కోరికల్ని అన్నింటినీ నేలమట్టం చేసేసిపోయింది! పెళ్ళినేదు! పందిరినేదు! అల్లుడునేడు! ఆ ఇద్దరూ పెళ్ళి ముస్తాబులో తన్దగ్గరికొచ్చి, కాళ్ళకి నమస్కారం సెయ్యడంనేదు!!

ఇది పెద్ద దెబ్బ!! రోడ్డుమీద ప్రమాదంలో, కాలు అవుడు అయిపోయినప్పుడు....ఆ దెబ్బ ఎంత బాధ పెట్టిందో అంతకన్న ఎక్కువ బాధే కల్గిందీ దెబ్బతో!!

ఇరుగూ పొరుకూ తననే తిట్టిపోసేరు!

"తండ్రి అన్నవోడు పిల్లల్ని నాల్గు పక్కల్నించీ కాపుకాసి వుండాల! నివ్వు రిషాతో కొంతసేపూ, ముండలెంట కొంతసేపూ రోజంతా వూరిమీదే వుంటావు! నీ కూతుర్ని దాని కర్మానికి దాన్ని ఒది

చేశాడు.

"చూడు సమతా! ఏదో పొరపాటయింది. క్షమార్పణ చెబుదామన్నా మీ నాన్న అంగీకరించటంలేదు. ఒక్కమాట గుర్తుంచుకో. నన్ను కాదని మీ నాన్న నిన్ను యెవరికి ఇవ్వాలనుకున్నా నీ బ్రతుకు బజార్లో పెడతాను .."

"నోర్ ముయ్యి...." ఫోన్ పెట్టేసింది. ఆ విషయం తండ్రితో చెప్పలేదు. సోమశేఖరం ఫోన్ చేశాడు.

"మాకు వేరేసంబంధాలు వస్తున్నాయి బావా ..."

"సరే సమత అభిప్రాయం కనుక్కొని చెబుతాను" అతను ఫోన్ పెట్టాడు.

సమతకు అతనిపై చెప్పలేని అసహ్యం కల్గింది. ఒక మోసగాడని, బ్లాక్ మేల్ చేసేవాడిని వివాహం చేసుకోగలదా? తాత్కాలికంగా ఆవేశంలో ఆకర్షణను ప్రేమ అనుకున్నది. అంతమాత్రం చేత తన జీవితం నరకం చేసుకుంటుందా?

"సమూ!"

తండ్రి రావటం చూచి లేచి కూర్చుంది.

"నువ్వు ."

"నాన్నా! జగన్ విషయమూ— ఇట్స్ క్లోజ్డ్ చాప్టర్ ఫర్ మి మనమంతా కలిసి సినిమాకు వెళ్ళక చాలా రోజులయింది. క్రాంతి కూడా క్రేజీ బాయిస్ ఆఫ్ ద గేమ్స్ చూడాలన్నాడు ..." లేచి క్రాంతికుమార్ ను పిలిచింది.

అతను దీర్ఘంగా నిస్వసించాడు, కూతురిని చూచి. □

సీరియల్



# మనిషికేం కావాలి?

— కొమ్మూరి వేణుగోపాలరావు

శ్రీకాంత్ కళ్ళు విప్పి చూశాడు. అతని ముఖంలో పులకింత, పెదాలమీద చిరునవ్వు నా దృష్టి పథంనుంచి తప్పించుకోలేకపోయాయి.

"ఆ పిలుపు నీకుకాదు. ఇతరులకు."

"కాని నేనిప్పుడు యితరులలో ఒకదానినే."

సమాధానం చెప్పటానికి ఒక్కనిమిషం వ్యవధి తీసుకున్నాడు. "ఒకసారి ఒకమనిషి యింకొకరికి చేరువగా వచ్చాక, ఆ విషయంలో యిద్దరూ ఏకాభిప్రాయం లోకి వచ్చినప్పుడు, పరిస్థితులు మారినా, భౌతికంగా ఎంతో దూరమైనా, ఎన్ని విషచక్రాలలో నలిగిపోయినా ఒకరికొకరు 'యితరులు' కారని నా విశ్వాసం సునీతీ. అయితే యీ పొరలోకి వెళ్ళటానికి చాలా శ్రమించాల్సి వుంటుంది."

నేనతని పాదాలదగ్గర కుర్చీలో కూచుని వున్నాను.

"నీ పాదాలు వొత్తనా?" అని కాళ్ళమీద చేతులు వెయ్యబోయాను.

"ఒద్దు" అని కాళ్ళు దగ్గరకు లాగేసుకున్నాడు.

---

జరిగిన కథ:

తాను ప్రేమించిన శ్రీకాంత్ ద్వారా విశ్వం పరిచయమయ్యాడు సునీతికి. నారీ ద్వేషి అయిన విశ్వాన్ని సునీతి అసహ్యించుకొంది. సునీతిని రక్షించి ఆదుకొన్న రాజారావుగారు తన ఆస్థిలో విశ్వానికి వాటా ఇచ్చారు. రాజారావుగారు మరణించడంతో ఆవేదనలో విశ్వం ఓదార్పు కోరింది సునీతి. రెండు నెలలుగా ఆ ఊరిలో లేని శ్రీకాంత్ రావడంతో సునీతి సంఘర్షణకు లోనైంది. తనకు తెలియకుండానే విశ్వాన్ని కోరుకొన్న భావన, శ్రీకాంత్‌ని వదులుకోలేని స్థితిలో సతమతమైపోసాగింది. శ్రీకాంత్ పెళ్ళి ఏర్పాట్లు చేసేశాడు. కాని చివరిక్షణంలో విశ్వంతో వెళ్ళిపోయి అతన్ని చేసుకొంటుంది సునీతి. విశ్వం మధురలో హోటల్‌పెట్టి కొద్ది కాలంలోనే డబ్బూ, హోదా సంపాదిస్తాడు. అనుకోకుండా కలిసిన వినయబాబుద్వారా తన స్నేహితురాళ్ళు జ్యోతి ఉషల విశేషాలు తెలుస్తాయి సునీతికి. ఉష పిచ్చిదై ఆస్పత్రిలో వుంది. జ్యోతి ఆరోగ్యంచెడి ఇంటిదగ్గరే ఉంటోంది. వారిని చూసేందుకు హైదరాబాదు వెళ్ళింది సునీతి। జ్యోతి మరణం సునీతిని కృంగదీసింది. కాషాయవస్త్రాలలో సన్యాసిగా గడుపుతున్న శ్రీకాంత్‌ను కలుసుకొంది సునీతి.

---

"ఏమీ? పరాయిదానిని కాదన్నావుగా."

శ్రీకాంత్ నవ్వాడు. "పరాయిదానివికాదు. కాని పరాయి మొగవాడి భార్యవు."

"విశ్వం కూడా నీ మనస్సుకు చేరువగా వచ్చిన వాడేగా. అతనిప్పుడు పరాయివాడు ఎట్లా అయినాడు?"

"అతనూ కాలేదు. మీరిద్దరూ విడి విడిగా చూసినట్లయితే ఏ పరిస్థితుల్లోనూ ఎప్పటికీ దగ్గరే. కాని మీ యిద్దర్నీ కలిపి చూసినట్లయితే మీలో ఒకరు పరాయివారు."

"అర్థమయింది" అని తల వొంచుకుని మెదలకుండా కూర్చున్నాను.

చాలాసేపు మౌనంగా గడిచిపోయింది.

"సునీత్! ఈ రోజు నీకో విషయం చెప్పనా?"

తలఎత్తి అతని ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూశాను.

"గొప్ప సంఘటన కాదు. కాని చాలా అసహ్యమైన విషయం. విశ్వం నాకు స్నేహితుడు, అన్న, గురువు, దేముడు అన్న సంగతి నీకు తెలుసు. అతనికీ— నా పట్ల అంత వాత్సల్యం వుండేది. అతనికి పెళ్ళయాక కూడా అతనింట్లో నేను అంత స్వతంత్రంగా మసులుతూండేవాడ్ని. ఆ విధంగా నేను కమలకి కూడా అత్యం తాప్తుడ్నయాను. నాకు ఎవరూలేని లోటు వదినగా ఆమెదగ్గర పొందుదామని ఎంతో ప్రయత్నించాను ..

" ఒక రోజు, విశ్వం ఊళ్ళోలేడు. రాత్రి పది గంటలవేళ వాళ్ళింటికి వెళ్ళాను. అలా అంతకుముందు ఎన్నోసార్లు వెళ్ళాను. అందులో నాకు క్రొత్తేమీ లేదు.

"కాని అక్కడ ఓ దృశ్యంచూసి చలించిపోయాను. కమలకి సంగీతమంటే అభిరుచివుంది. బాగా పాడుతుంది కూడా. అందుకని విశ్వమే ఓ సంగీతం మేస్టర్ని కుదిర్చాడు. అతనేం పెద్ద అందగాడూ కాదు. ఇతర ఆకర్షణలూ ఏమీలేవు. కాని స్త్రీకీ-పురుషుడికీ మధ్య కల్పించబడే ఏకాంతం ఎంత శక్తివంతమైనదో ఆనాడు తెలుసుకున్నాను. ఆ యిద్దర్నీ చూడరాని స్థితిలో చూశాను. పిచ్చెక్కినట్టయిపోయి వెనుదిరిగి వొచ్చేశాను.

"తర్వాత వాళ్ళింటికి వెళ్ళాలంటే భయంవేసింది. కొన్నాళ్ళదాకా వెళ్ళలేక పోయాను. విశ్వం వూరినుంచి వచ్చాక ఎన్నో కబుర్లు పంపాడు. ఎంతకీ వెళ్ళక పోయేసరికి అతనేవచ్చి తీసుకువెళ్ళాడు.

"కమల నన్నుచూసి జంకూ గొంకూ లేకుండా ఎప్పటిలాగానే మాట్లాడింది. ఆమె విశ్వంపట్ల ప్రదర్శిస్తోన్న ప్రేమ చూస్తే మనుషులు ఎంత నటించగలరోనని తెల్లబోయాను. కాని ఆ సంఘర్షణ ఒక్కరోజుతో ముగిసేదికాదుగదా. రాను రాను ఆ సత్యంతెలిసీ ఆ ప్రేమాలయంలోని నటనని చూస్తూ తట్టుకోలేకపోతున్నాను. విశ్వ మెక్కడ? ఆ సంగీతం మేస్టారుగా డెక్కడ? ఇంతటి అవివేకంలో ఆమె ఎలా పడిపోయింది? నాలో నేను నలిగిపోతున్నాను. ఒకరోజు యిహ భరించలేక ఆమె నడిగేశాను.

"పిశాచిలా నవ్వింది. 'ఇరుక్కుపోయాను. తప్పించుకోలేను' అంది.

"విశ్వానికి తెలిస్తే మీ యిద్దర్నీ నరికేస్తాడన్నాను.

"నువ్వు చెబుతావా? అన్నది.




"నేను కోపంతో చెప్పేస్తానని అరిచాను.

"ఆమె నవ్వి నా దగ్గరకు వచ్చి బుగ్గగిల్లి దగ్గరకు లాక్కుంది.

"కోపంలో ఎంతో ముద్దొస్తున్నావు. రా. నన్నుతీసుకో. ఈ రహస్యం మనిద్దరిలోనే అంతం కానియ్యి అంది.

"ఛీ రాక్షసీ అని ఒక్క తోపు తోశాను. ఇందుకేనా మన పురాణాలూ, యితిహాసాలూ అన్నీ అలా వర్ణించబడి వున్నాయి! అక్కడ్నించి పారిపోయి వచ్చేశాను.

"ఏం చెయ్యాలి? ఏం చెయ్యాలి? విశ్వాన్ని ఎప్పుడూ కలుసుకుంటూ వుండాలి. ఈ నిజాన్ని ఎప్పుడూ నాలో భరిస్తూ వుండాలి. కొన్ని రోజులు నరకయాతన అనుభవించాను.

"తర్వాత . కాలమే తీర్పు యిచ్చింది. కమల అతనికి శాశ్వతంగా దూరమైంది. విశ్వం నారీద్వేషి అయినాడు."

శ్రీకాంత్ చెప్పటం అయిపోయినట్లు మాట్లాడటం ఆపేశాడు.

"మరి నీ వెందుకు నారీద్వేషివి కాలేదు?" అనడిగాను.

"దేనికి?"

"నేను నీకు చేసిన అన్యాయానికి."

"అందరికీ అన్నీ చేతకావు సునీతీ."

నేనిహ దుఃఖం ఆపుకోలేకపోయాను. అతని ప్రక్క మీద తల వాల్చి వెక్కి వెక్కి ఏడుస్తూ "నువ్వింత మంచివాడివి ఎందుకయినావు శ్రీకాంత్! ఎందుకు నన్నింకా నీ పాత సునీతిగానే గుర్తు పెట్టుకున్నావు? నా యిల్లు, నా వస్తువులు అన్నీ ... ఎందుకని పదిలపర్చుకున్నావు? ఈ పాపిష్టిదానికి ఎందుకంత స్థానం యిచ్చావు శ్రీకాంత్!" అని వాపోయాను.

మంచం మీద అతను లేచి కూర్చోవటం తెలిసింది. అతని చెయ్యి నా తల నిమురుతోంది.

"కొందరి జీవితాలు జరిగిపోవటానికే సునీతీ దుఃఖం వ్యక్తిత్వానికి కళంకం తెస్తుంది."

ఏ మనిషి సుఖ దుఃఖాల గురించి యితను తల్లడిల్లిపోయాడో ఆ మనిషే యితని భవిష్యత్తుని కాల నేల రాచి పారేశాడు. ఎంత నిర్దాక్షిణ్యం?

"నన్ను మనసారా ఏడవనీ శ్రీకాంత్! ఇంతకన్నా అవకాశం దొరకదు."

"నీ యిష్టం" అతని చెయ్యి మాత్రం నా తల నిమురుతూనే వుంది.

ఎంతసేపు అలా వుండిపోయానో, ఎన్ని ఆలోచనా తరంగాలు ఆ దుఃఖంలో పొంగి పొర్లాయో.. వర్ణించలేను.

"శ్రీకాంత్! నేను మొండితనం చేస్తే ఏం చేస్తావు?"

"ఏమని?"

"ఇక్కడ్నుంచి కదలనని."

"కదలక?"

"నీతోనే వుండిపోతాను."

"నేను సన్యాసిని. నాతో నువ్వు.... ..."

"నేనూ సన్యాసినినే. ఆ విధంగానే యిక్కడా వుంటాను. నాలో యింకేం ప్రలోభం లేదులే. ఉన్నా నువ్వు అందనంత ఎత్తులో వున్నావని తెలుసు."

అతను నవ్వటం తెలిసింది. "మనుషులు అంత గొప్పవాళ్ళేం కాదు సునీతీ! గొప్పవాళ్ళయినట్లు నటిస్తూంటారు."

"అయితే ఒప్పుకున్నట్లేనా?"

"లేదు "

"ఎందుకని?"

"నిజం చెప్పమంటావా?"

లేచి కూర్చుని అతని ముఖంలోకి చూస్తూ అన్నాను. "చెప్పు."

"నువ్వు సహజ జీవివి. అసహజమైన పరిస్థితుల్లో నిన్ను వుంచటం ఏ మానవుడివల్లా అయ్యే పని కాదు. మేమంతా దొంగ సన్యాసులం. ఎప్పటికైనా నీ అంతట నువ్వు సన్యాసినిగా మారినప్పుడు నీ ప్రభావం ముందు మేము దూదిపింజలా ఎగిరిపోతాం.




ఇంకా ఎందుకంత వున్నత స్థాన మిస్తున్నారు? అతని దైవత్వం ముందు నేను ఓ పేలికలా ఎటో ఎగిరిపోతున్నాను. కళ్ళు చీకట్లు క్రమ్ముతున్నాయి.

"శ్రీకాంత్! కళ్ళు తిరుగుతున్నాయి?".

"ఉండు సునీతీ!" అని నన్ను పట్టుకుని మృదువుగా ప్రక్కకి జరిపి మంచం మీద సాఫీగా పడుకునేలా చేశాడు.

"చాలా రాత్రయింది. పడుకో సునీతీ! చాలా అలసిపోయి వున్నావు కూడా?"

ఆ మసక తెలివిలోనే చెయ్యి జాపి అతని చేతిని పట్టుకున్నాను. "పడుకుంటాను. కాని ఇక్కడ్నుంచి కదలొద్దు."

"అలాగే."

"ఎక్కడున్నావు నువ్వు? నా ప్రక్కనే కూర్చున్నావా?"

"అవును సునీతీ! నీ దగ్గరే వున్నాను."

అతని చెయ్యి నా గుండెలమీదకు లాక్కున్నాను. "ఈ ప్రాపంచిక ధర్మాలూ, సాంఘిక బంధాలూ యివన్నీ నాకు తెలియవు. నాకు తెలిసింది ఒకే ఒక్క నిజం. నువ్వు మాత్రం నా వాడివి."

నా హృదయంమీద అతని చెయ్యి ఎంత హాయిగా వుంది!

"రేపు....అక్కడికి వెళ్ళిపోతాను. ఆ లోకంలోకి. కాని శ్రీకాంత్ ఒక్క కోరిక. ఒంటరిగా వెళ్ళలేను. తోడు రావాలి. నీ తోడు కావాలి. ఈసారి అత్తవారింట్లో నువ్వు దింపాలి."

"అలాగే సునీతీ!"

"ప్రామిస్?"

"ప్రామిస్."

## 24

మధురలో అడుగుపెట్టి టాక్సీలో శ్రీకాంత్‌తో యింటికి వెడుతోంటే నాకేం కంగారనిపించలేదు. వెనుకసీట్లో శ్రీకాంత్ ప్రక్కనే కూర్చున్నాను. అతను అదే కాషాయంబరాలలో వున్నాడు. అతని చెయ్యి నా చేతిలోకి తీసుకుని నునుపైన ఆ వ్రేళ్ళతో ఆడుకుంటున్నాను.

శ్రీకాంత్ ఏమీ మాట్లాడటంలేదు. అతని ముఖంలోకూడా తొట్రుపాటేమీ కనబడటంలేదు. గంభీరంగా వున్నాడు.

టాక్సీ యింటిముందు కొచ్చి ఆగింది. అనుకున్నట్లే తాళం పెట్టి వుంది. అతనా సమయానికి హోటల్లో వుంటాడని తెలుసు. నా దగ్గరున్న డూప్లికేట్‌తో తలుపు తెరిచాక ఇద్దరం లోపలికి వెళ్ళాం.

ఉదయం పది దాటివుంటుంది.

శ్రీకాంత్‌ని సోఫాలో కూర్చోమని చెప్పి, మేము వచ్చామని చెప్పటానికి హోటల్‌కి రింగ్‌చేశాను.

అవతలనుంచి మేనేజర్ రిసీవ్ చేసుకున్నాడు.

"విశ్వానికివ్వండి'' అన్నాను.

''అమ్మగారా?'' అతని గొంతు కంగారుగా వుంది. "అయ్యగారికి బాగా జబ్బు చేసింది. మాకేమీ తోచక హాస్పటల్‌లో చేర్చాం.''

నా గుండె దడదడ కొట్టుకుంది. "జబ్బుచేసిందా? ఎప్పుడు? ఏమిటది? ఏ హాస్పిటల్‌లో చేర్పించారు? ఇప్పుడెలా వుంది?'' అని ప్రశ్నల వర్షం కురిపించాను.

అతను ఏ హాస్పిటల్‌లో చేర్పించిందీ చెప్పటంతప్ప మిగతావాటికి సరియైన సమాధానం చెప్పలేకపోయాడు.

రిసీవర్ క్రిందపెట్టేసి శ్రీకాంత్‌వైపు తిరిగాను. అతను నేను చెప్పకుండానే జరిగింది అర్థం చేసుకున్నాడు.

''విశ్వాన్ని హాస్పటల్లో చేర్చారా? పద వెళ్ళి చూద్దాం '' అని లేచి నిలబడ్డాడు.

అతను దగ్గరగా వెళ్ళి చెయ్యి పట్టుకుని "శ్రీకాంత్!" అన్నాను వొణికే గొంతుతో.

ధైర్యం చెబుతున్నట్టుగా నన్ను దగ్గరకు తీసుకుని, రెండోచేత్తో బుజంమీద చెయ్యివేసి నిమిరాడు.

"నువ్వెవరివి? సునీతివి. పద పోదాం."

* * *

ఇదిగో సుబ్బారావ్! అరుదయిపోయింది... ఇంక వే!



విశ్వం ఒక స్పెషల్ రూంలో పడుకుని వున్నాడు. గదిలో సపర్యలు చేయ టాని కన్నట్లు ఓ హోటల్ బాయ్ వున్నాడు.

లోపలికి అడుగు పెట్టగానే నన్ను చూసి అతని ముఖంలో కాంతి కని పించింది.

చాలా కృశించిపోయి నీరసంగా వున్నాడు. కొద్దిరోజుల్లో ఎంత మార్పు!

"విశ్వం! ఏమిటిది?" అంటూ దగ్గరకు వెళ్ళాను.

"తెలియటంలేదు" నవ్వటానికి ప్రయత్నించాడు.

"చూడు! నాతో ఎవరొచ్చారో!" నా వెనక నిలబడివున్న శ్రీకాంత్ సరిగ్గా కనబడటాని కన్నట్లు ప్రక్కకి జరిగాను.

విశ్వం ముఖంలో ఆశ్చర్యం, అంతకుమించిన ఆనందం.

"శ్రీకాంత్! నా ప్రాణం. ఇలారా తమ్ముడూ" చేతులుజాచి ఆహ్వానిస్తున్న ట్లుగా అన్నాడు.

శ్రీకాంత్ దగ్గఱకువెళ్ళి ప్రక్కనున్న కుర్చీని మంచానికి చేరువగా లాక్కుని కూర్చున్నాడు.

శ్రీకాంత్ చేతిని విశ్వం తన చేతుల్లోకి తీసుకుని ఆప్యాయంగా నిమురుతూ అన్నాడు.

"ఎంత సంతోషంగావుందో తెలుసా యివేళ? ఈ జన్మలో నిన్ను చూడ గలనో లేదో అనుకున్నాను" విశ్వం కళ్ళనుండి నీళ్ళు చెంపలమీదుగా జలజలమని రాలిపోతున్నాయి.

"నువ్వు... ఏడవటం చూడలేను విశ్వం!" శ్రీకాంత్ కంఠం గాద్గదికంగా

వుంది. అతని చేతిలోంచి తన చేతిని విడిపించుకుని కళ్ళు తుడవటానికి ప్రయత్నిస్తూ "విశ్వం!" అంటూ ఒక్కసారిగా బావురుమని ఏడ్చేశాడు.

"ఊరుకో శ్రీకాంత్. ప్లీజ్!"

ఇద్దరూ ఒకరి నొకరు ఓదార్చుకుంటున్నారుగాని, యిద్దరూ వెక్కి వెక్కి ఏడ్చేస్తున్నారు.

ఆ దృశ్యం చూస్తోంటే నా శరీరం చిత్రంగా జలదరించిపోయింది.

డాక్టరు వచ్చేదాకా అలా వుండిపోయాం. డాక్టరుగారు ఎగ్జామిన్ చేసి, రెండు మూడు ప్రశ్నలడిగి బయటకు వెడుతోంటే ఆయనవెంట అనుసరించాను.

"డాక్టర్! ఆయన పరిస్థితి ఏమిటి?"

ఒక్కక్షణం నా ముఖంలోకి పట్టి పట్టి చూశాడు. నే నెవర్నో అర్థం చేసుకున్నట్లున్నాడు.

"సీ ర్రోసిస్ ఆఫ్ లివర్. మనం పెద్దగా చేయగలిగింది ఏమీలేదు— ఉపశాంతికి మందులు వాడటం తప్ప."

అర్థం చేసుకున్నాను. చాదస్తంగా ఆయన్ని ప్రశ్నలడిగి ప్రయోజనం లేదను కుని తిరిగి గదిలోకి వెళ్ళాను.

*　　　*　　　*

మధ్యాహ్నం శ్రీకాంత్ మా యిద్దర్నీ ఒంటరిగా వొదిలి బయటకు వెళ్ళాడు. నా కుర్చీని విశ్వం తలవైపు దగ్గరగా లాక్కుని "విశ్వం! యిలా ఎందుకు జరిగింది?" అన్నాను దుఃఖం ఆపుకుంటూ.

"ఎలా?"

"నీ ఆరోగ్యం"

"కొన్నాళ్ళుగా అనుమానంగా వుంది. ఏమోలే అని తోసేసుకుని తిరిగాను. లేక... " అని నవ్వుతూ "నీదగ్గర సంజీవనిలాంటి ప్రభావంవుంటే దాని మహిమ వల్ల నా శక్తి క్షీణించలేదో. నువ్వు దగ్గర లేకపోయేటప్పటికి మూలపడిపోయాను" అన్నాడు.

"మళ్ళీ వచ్చేశానుగా. నా సంజీవనీ ప్రభావం నీ వ్యాధి తగ్గించలేదేం?"

"నిన్ను చూడగానే మానసికంగా చాలా బలం వచ్చేసింది!"

"అది చాలదు. నీకు పూర్తిగా తగ్గిపోవాలి!"

"అదెలా సాధ్యం? ఎప్పుడో అప్పుడు జరగాలిగా."

"ఏమిటి?"

"వెళ్ళిపోవటం."

"విశ్వం! విశ్వం!!" అతని గుండెలమీద తలపెట్టి రోదించాను.

"వీల్లేదు. నువ్వు వెళ్ళటానికి వీల్లేదు. లేకపోతే పద. నీతోపాటు నేను కూడా వస్తాను."



"సునీతీ! నువ్వింకా చిన్నదానివి."

"చెప్పొచ్చావులే. ఇప్పుడు నేనే అందరికంటే పెద్దదాన్ని."

రెండు చేతుల్తో నా ముఖాన్ని పైకెత్తి సూటిగా చూశాడు. "అవును సుమా! చాలా పెద్దదానివై పోయావు. ఎలా సాధించావు?"

"విశ్వం! అలా మాట్లాడకు. నేను భరించలేకపోతున్నాను. నాకు భయంగా వుంది. విశ్వం! ఐ వాంట్ యు."

"ఐ టూ. కాని ..."

ఏదో చెప్పాలనుకున్నాను. మాట పూర్తిచెయ్యలేకపోయాడు. ఒక విషాదపు తెర ముఖమంతా క్రమ్మివేసింది.

జీవితమంతా విషాదాల మయం కావచ్చు. కాని ఎప్పటికప్పుడు కొత్త సంఘట నేదో తరుముకువచ్చి గుండెను పరపరకోస్తోంటే అది ఎంతటి విలయం!

ఆ సాయంత్రం విశ్వం నిద్ర పోతోంటే ఏం చెయ్యటానికీ తోచక, హాస్పటల్ ఆవరణలో చెట్ల మధ్య చీకటి పడేదాకా తిరిగాను. మెదడంతా బండబారి పోతోంది. మనుషులు ఎంత అసమర్థులో తెలిసివస్తోంది.

శ్రీకాంత్ మధ్యాహ్నమనగా బయటకు వెళ్ళాడు. ఎక్కడికి వెళ్ళాడో తెలీదు.

కాసేపయినాక విశ్వం లేచాడేమో చూద్దామని లోపలకు వెళ్ళాను.

గదిలో ఏవో మాటలు వినిపిస్తోంటే గుమ్మం దగ్గరే ఆగిపోయాను.

"శ్రీకాంత్! నన్నింకా యింత ప్రేమగా ఎలా చూడగలుగుతున్నావు? నన్ను చూస్తే నీలో ద్వేషం ఎందుకు రగలటం లేదు?"

"ఎందుకనో తెలీదు. మనుషుల్ని ప్రేమించటంలోనే జీవిత పరమార్థం యిమిడి

వున్నదనీ, ద్వేషించటమనేది చిన్న పిల్లల చేష్ట అనీ మాత్రం అర్థం చేసుకున్నాను."

"శ్రీకాంత్! ఇంతగా ఎలా ఎదగగలిగావు?"

కాసేపు ఏమీ మాటలు వినిపించలేదు.

"శ్రీకాంత్! నే చెప్పేది విను నా వ్యాధి గురించి నాకు తెలుసు. కొద్ది రోజుల్లో నాకు కోమా వస్తుంది. తర్వాత చచ్చిపోతాను. అప్పుడు....అప్పుడు సునీతికి నువ్వు సంరక్షకుడివి కావాలి."

" ... . . . "

"మాట్లాడవేం?"

"విశ్వం! నువ్వు చనిపోవు."

"అసంభవం."

"అసంభవాన్ని సంభవం చేస్తాను."

"ఎలా?"

"వివరించలేను. నిన్ను మాత్రం బ్రతికించుకుంటాను."

"... నీ వెర్రి శ్రీకాంత్. పోనీ బ్రతికితే సరేలే. అలా కాకపోతే మాత్రం నేను చెప్పినట్లు చెయ్యాలి."

"చూద్దాం."

"అలా అంటే కాదు. మాటివ్వు."

"సరే."

* * *

రెండు మూడురోజులు గడిచిపోయాయి. ఈ స్వల్ప వ్యవధిలోనూ శ్రీకాంత్‌లో ఏదో మార్పు గోచరిస్తోంది. ఏమీ తినటంలేదు. కళ్ళు చాలా తీక్షణంగా వుంటున్నాయి. ఎక్కువగా మాట్లాడటంలేదు.

ఓ రోజు ఉదయం హాస్పటల్‌లోనే రాత్రంతా గడిపాను. స్నానం అదీ చేద్దామని యింటికి వచ్చినప్పుడు శ్రీకాంత్ పద్మాసనంలో వుండి గదంతా వెలిగిపోతున్నట్లు గోచరించాడు.

వెనకనుండి వెళ్ళి 'శ్రీకాంత్!' అని పిలిచాను.

అతన్నుంచి జవాబులేదు.

"మళ్ళీ పిలిచాను."

అతన్లో చలనంలేదు.

చుట్టూ తిరిగివచ్చి ఎదురుగా నిలిచి అతని ముఖంలోకి చూశాను. చాలా డీప్ మెడిటేషన్‌లో వున్నాడు. ముఖం ఎంతో వర్చస్సుతో వెలిగిపోతోంది. శరీరమంతా గొప్ప తేజస్సు వెదజల్లుతోంది. అలా అతనివంక చూస్తోంటే తనివి తీరలేదు. ఎదురుగానే అలా నిలబడి, కళ్ళప్పగించి వుండిపోయాను.

ఎంతసేపు గడిచిందో తెలీదు.

"సునీతీ!" అన్న పిలుపు విని యీ లోకంలోకి వచ్చాను.

"ఎంతసేపయింది వచ్చి?"

అతని ప్రశ్నకు జవాబు చెప్పకుండా "ఎంత గొప్ప ధ్యానం నీది! భావాతీత స్థితిలో వున్నావా? నీ విశ్వరూపం యివేళ సందర్శించాను."

అతను నవ్వాడు. ఏమీ మాట్లాడలేదు.

"చెప్పు. దేనినిగురించి నీ ధ్యానం?"

"విశ్వం ఆరోగ్యంగురించి. నాకింకా అంత శక్తిరాలేదు గాని, నాకే చేతనైతే అతని వ్యాధిని నేను తీసుకుని నా ఆయుర్దాయాన్ని అతనికిచ్చేవాడ్ని. కాని అంత శక్తిమంతుడ్ని కాదు సునీతీ!" అని కొంచం ఆలోచించి "నాకు ఒక్కటే తోస్తోంది. విజయవాడకు నలభై ఏభై మైళ్ళ దూరంలో ద్వారక అనే చిన్న పల్లెటూరుంది. అక్కడ ప్రకృతి వైద్యంలో అపూర్వానుభవం గడించిన స్వామీ యతీంద్రుని ఆశ్రమంవుంది. ఆయన్నిగురించి విన్నానుగానీ, ఎప్పుడూ దర్శనం చేసుకోలేదు స్వామీ యతీంద్రునికి అట్టహాసంగానీ, ప్రచారంగానీ లేదు. కాని ప్రకృతి వైద్యంలో ఆయన ప్రవేశం మాత్రం తిరుగులేనిదని విన్నాను. విశ్వాన్ని అక్కడికి తీసుకెళ్ళటానికి సంకల్పించాను."

"ఏ ఊరది? ద్వారకా?"

"అవును. దివి తాలూకాలో వుంది." (సశేషము)

# పలురంగాలలో ఆంధ్ర ప్రముఖులు



డా॥ పి. ముద్దుకృష్ణారెడ్డి

అలోపతీ వైద్యంలో పండితుడై ప్రకృతి వైద్యాన్ని గౌరవిస్తూ 'మందులు చాల అవసరమైతే తప్ప వాడకూడదు' అన్న అభిప్రాయం కలిగిన చిత్రమైన వ్యక్తి డా॥ పి. ముద్దుకృష్ణారెడ్డి. నెల్లూరు జిల్లాలో ఒక మధ్యతరగతి కుటుంబంలో జన్మించిన శ్రీ రెడ్డి యం. బి. బి. ఎస్ తర్వాత ఇంగ్లండ్, అమెరికాలలో F.R.C.S; F.I.C.S; F.I.C.A పట్టాలు కూడా స్వీకరించి మద్రాసులోని హాల్ స్టెడ్ సర్జికల్ క్లినిక్ స్థాపించారు. స్టాన్లీ మెడికల్ కాలేజిలో సర్జరీలో గౌరవాచార్యులుగా ఉన్నారీయన. తీరిక దొరకని డాక్టరు వృత్తిలో ఉండికూడా కళాభిమానం చంపుకోలేక సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహించడంలో ప్రముఖ పాత్ర వహిస్తున్నారీయన మద్రాసులోని సాంస్కృతిక సంస్థ 'కళాసాగర్'కు అధ్యక్షులు శ్రీ రెడ్డి. రోగాలూ వాటికి కారణాలు చర్చిస్తూ పద్ధతి ప్రకారం ఆహారం తీసుకోవడం, వ్యాయామం చెయ్యడంవల్ల చాలావరకు జబ్బులు రాకుండానే నివారించవచ్చని వివరించారీయన. పుష్టిగల ఆహారం తీసుకోక పోవడమేకాదు, అధికంగా ఆహారం తీసుకోవడం కూడా అనారోగ్య కారణమే అంటారీయన.

ఎన్నో సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించిన కళాసాగర్ స్థాపకాధ్యక్షులుగా 'సాంస్కృతిక పరమైన విలువలు రోజు రోజుకీ తగ్గిపోతున్నాయి. చాలా వరకు సినిమా గ్లామర్, తర్వాత సరైన ప్రోత్సాహం లభించని కారణంగా కళలకు సంబంధించిన వృత్తి అంటే ప్రతిభ వున్న కళాకారులు కూడా ఉత్సాహం చూపక పోవడంవల్ల ఇలా జరుగుతోంది' అని బాధపడ్డారు శ్రీ రెడ్డి.

తను విదేశాలలో ఉండి రావడంవల్ల చక్కని క్రమశిక్షణను అలవరుచుకోగలిగానంటారు శ్రీ రెడ్డి. యువకులకు తన సలహాగా 'నీవు చేపట్టిన ఏ కార్యాన్నయినా సిన్సియర్‌గా చెయ్యి. విజయానికి అడ్డుదారులు లేవు. కృషించి కృషి చేయడమే రాచబాట. మాటలతో కాక చేతలలోకి దిగి. అప్పుడు నీ ప్రయత్నానికి ఎవరి సహకారాన్నయినా ఆశించు విన్ను ఇతరులు ఎలా చూడాలని నువ్వు కోరుకొంటున్నావో, నువ్వూ ఇతరులను అలానే చూడటం నేర్చుకో' అన్నారు డా॥ రెడ్డి.

సాంస్కృతిక కార్యక్రమాల నిర్వహణలో వైద్యవృత్తికి దూరంగా, వైద్య వృత్తిలో ఉండగా ఇతర కార్యక్రమాలకు దూరంగా ఉంటారేమోగాని...ఎల్లప్పుడూ 'చిరునవ్వు'ను మాత్రం తనదగ్గర ఉంచుకొంటా డీ ఫారిన్ రిటర్న్డ్ డాక్టర్!

—పి. సరళాసూర్యారావు

# చేరువ

* విరాజి రామమోహనరావు

చిన్న సందులా. సన్నటి రేఖలా....

బెత్తెడు వెడల్పుబద్దలా కనబడింది ఆకాశం సత్యానికి, కిటికీరెక్క నెమ్మదిగా తీస్తుంటే. ఆకాశం మీంచి చూపులు దింపి నెమ్మదిగా కిందకి చూశాడు.

పచ్చటి. ఎర్రటి బాదంచెట్టు ఆకులు. యింకా కింద గాజు పెంకులు పాతిన పాత గోడ ...గోడ అంచుల దగ్గర నాచు... రేకుతలుపు....నాలుగడుగుల చదరంలా వున్న ఆ చోటు అక్కడికి మేడమీంచి సఖమే కనిపిస్తోంది,

'రాలేదు....యింకా రాలేదు' ...అనుకున్నాడు.

కిటికీ పక్కగానే వుంది మంచం. మంచంమీద మోకాళ్ళపైన కూచున్నాడు సత్యం. అలా కూచుంటేనే కానీ కిటికీ పై రెక్కలదాకా మెడ చాపలేడు.

మెడ కొంచెం లాగుతుంటే దిగిపోదామా అనుకున్నాడు. కానీ మనసొప్ప లేదు. ఓసారి మెడని అటూయిటూ తిప్పి సర్దుకుని మళ్ళీ చూశాడు. యిందాకా చూపినవన్నీ అలాగే వున్నాయి.

* * *

నిద్రలేచి అప్పటికే రెండు గంటలు దాటింది. ఆనాటి సూర్యుణ్ణి చూసి గంట పైనే అయింది. వంట వార్పు పూర్తి చేసి అరగంట అయింది. అయినా సరోజకి బద్ధకంగా వుంది. వొళ్ళూ మనసు చీదరగా చిరాకుగా వున్నాయి.

నులకమంచం పట్టీమీద కూచుని, కిటికీలోంచి మొండిగోడమీద గాజుపెంకుల్లోని ఎండరంగుల్ని చూస్తూ, గ్లాసులో కాఫీని యాంత్రికంగా తాగుతోంది. కాఫీ తాగుతున్నానని తెలుస్తోంది తప్ప, తాగుతున్నట్టనిపించటం లేదు.

కాఫీ తాగటమే కాదు. చూట్టం ... మాట్లాట్టం .... వుద్యోగం చెయ్యటం ... బయటకి వెళ్ళటం ...ఆ యింటికి రావటం యిలాంటి చాలాపనులు యీ మధ్య యిలాగే వుంటున్నాయి.

కాఫీ తాగటం అయ్యాక లేచి మంచం పక్కనేవున్న గుమ్మందాకా నడిచి బైటికి తొంగిచూసింది. పొడుగ్గా చచ్చిపోయిన మట్టివాంటితోటి సందు ఎప్పటిలాగే వుంది. సందు చివరి తలుపు వేసేసేవుంది.

ఆ తలుపు యింటివాళ్ళు తీస్తేనే కానీ దొడ్డివేపు వెళ్ళటానికి ఆస్కారంలేదు. కాస్సేపు అలా చూసి తిరిగి వెనక్కి మంచందగ్గర కొచ్చింది సరోజ.

గది నాలుగువేపులా సామాను ... సామానుమధ్య చీకటి. .దానిమీద అధికారం సంపాయించినట్టు ఆ నులక మంచం... అన్నీ చూస్తుంటే ఆ గది చిన్న అడివిలా భయంకరమైన జంతువులు కనపడకుండా కాపలా కాస్తున్న యిరుకు

జైలులా కనిపించింది.

ఈ గది గురించి, యీ ఇంటి తాలూకు యిబ్బందుల గురించి ఎన్నోసార్లు తల్లికి రాసింది. అన్నింటికీ యించుమించు తల్లి దగ్గర్నించి ఒకటే సమాధానం.

"వూరుకాని వూళ్ళో ఆడపిల్ల వొంటరిగా వుండాల్సి వచ్చినప్పుడు ఈ మాత్రం యిబ్బందులు తప్పవు. ఇలాంటి చిన్న చిన్న యిబ్బందులు సర్దుకుపోవాలి.... అంతేకాని అయినవాళ్ళ నీడపట్టు వొదులుకో కూడదు" అని.

ఎన్ని రకాలుగా తనబాధ రాసినా యిదే సమాధానం. చివరికి విసుగెత్తి వోసారి ఘాటుగా రాసింది తల్లికి. "ఆ యింట్లో వుండలేకపోతే వచ్చేయి ...కానీ వేరే గది చూసుకోవటం మాత్రం నా కిష్టం లేదు....'అంటూ నిష్ఠూరంగా సమాధానం రాసింది తల్లి.

ఆ యింటిని, చేస్తున్న ఉద్యోగాన్ని వొదులుకుని వెళ్ళిపోవచ్చు. కానీ వెళ్ళాక అంతా మామూలే....ఏ ఆదాయం లేని సంసారం .. తమ్ముడి చదువు ఆగిపోటం, మళ్ళీ అప్పులు ..తల్లి అందరిళ్ళల్లో చాకిరీ చేస్తాననటం ...ఏ దారీ తెన్నూ లేకుండా సంసారం తయారవటం ...అది భరించ లేకే యిక్కడ యిలా సర్దుకుపోయే ప్రయత్నం.

అన్నింటికీ అలవాటు పడింది. ఇంటి వాళ్ళు యింట్లోంచి కాక సందులోంచే నడవమంటే ..'అలాగే పిన్నీ. ' అని వొప్పుకుంది. సందంతా రోజూ వూడ్చి ముగ్గెయ్యాలంటే దానికీ సరే అంది. ఇలాగే యింకా చాలా ఆంక్షలన్నీ వొప్పుకుంది. కారణం అల్లా ఒక్కటే. దూరపు బంధువులైనా వాళ్ళింట్లో వుంటే వొంటరిగా వుంటున్న ఆడపిల్లమీద అపవాదులు రావన్న సరోజ తల్లి చాదస్థం....దాన్ని కాదనలేని బలహీనత.

అన్నింటికీ సర్దుకుంటూ వచ్చినా యీ యిబ్బంది నెలా తప్పించుకోవాలో తోచ లేదు సరోజకి. ఎన్ని రకాలుగా ఆలోచించినా పరిష్కారం తోచలేదు.

తనంతట తను 'పిన్నీ....బాబాయి' అని యింటి వాళ్ళని పూసుకు తిరిగినా, వాళ్ళు దూరంగానే చూస్తున్నారు. వాళ్ళు చెప్పినట్టు వింటం తప్ప మరో దారేం కనపట్టం లేదు.

"నేను పొద్దున్నే లేవలేను. నేను లేచిం తర్వాతే సందు తలుపు తీస్తాను. అంతే తప్ప చీకటితోటే నువ్వులేచి తలుపు బాత్తే నావల్ల కాదు" అని నిక్కచ్చిగా చెప్పేసింది యింటావిడ సరోజ తోటి. "అది కాదు పిన్నీ...." అంటూ ఏదో చెప్పి బతిమాలబోయిన సరోజకి ఆ అవకాశం కూడా యివ్వలేదు.

సొంతింటితో పాటు ఏ వేళకి వెళ్ళినా పరవాలేని భర్తవ్యాపారం, పిల్లాజెల్లా లేకపోవటం, ఆవిడకి బాగా పొద్దెక్కే వరకు నిద్రపోవటం అలవాటు చేశాయి.

'స్నానం చేసి వంట చేసుకునే బదులు వంటా అది చేసుకుని స్నానం చేస్తే సరి ..' అనుకుంది ఘుందు సరోజ. చాలా రోజులు అలాగే చేసింది. కానీ సమస్య అంతటితో తీరలేదు.

చివరికి నీళ్ళంటేనే, స్నానం అంటేనే చిరాగ్గా తయారైంది. రెండు మూడు రోజులు స్నానం మానేసింది. ఓ రెండు రోజులు రాత్రిళ్ళు చేసి చూసింది....

రోజంతా వొళ్ళు అసహ్యంగా వుండి. మనసు కూడా చిరాగ్గా వుండేది....ఏదో తప్పనిసరి బతుకు బతుకుతున్నట్టు తయారయింది పరిస్థితి.

ఎంతగా ఆలోచించినా ఏం చెయ్యాలో తోచలేదు సరోజకి. పైకి పెద్ద సమస్యలా కనిపించని ఈ ఇబ్బంది రోజురోజుకి చికాకు పెంచటం తప్ప, మనసుని హింసించటం తప్ప పరిష్కారం తోచ లేదు.

బాగా ఎండెక్కాక....దొడ్లో ఆ నాలు గడుగుల స్నానాల గదిలో బాదం చెట్టు కింద తప్పనిసరై స్నానం చేస్తుంటే.... మొండి గోడ మీది ఆ గాజు పెంకుల్లోని వెలుగు....తన వొళ్ళంతా పాకి... రక్కి, భయంకరంగా చీరుతున్నట్టనిపిస్తోంది. ఆ బాధ నుంచి తట్టుకోటానికి వొంటి నిండా చీర చుట్టుకున్నా, వొళ్ళు తడిశాక ..ఆ వెలుగు చీలుస్తున్నట్టే వుంది....ఆ బాధకి



వాళ్ళు. మనసు పచ్చిపోతున్నట్టే వుంది.

* * *

కిటికీ దాకా మెడ చాపి అలా చూస్తూ వుంటే కొత్తలో వాళ్ళంతా వాణికేది సత్యానికి. నిముషాల మీద తెగలొచ్చి శరీరం వేడెక్కేది. అలా వేడెక్కిన వొంటికి చెమటలు పట్టి మరింత ఆవి రొచ్చినట్టుండేది.

ముందు కొన్నాళ్ళు అలా చూట్టం తప్పని మనసు బాధ పెట్టింది సత్యాన్ని. ఆడ అనుభవం లేని యిరవై ఎనిమి దేళ్ళ వయసు...స్నేహితుల ద్వారా... దొంగచాటు సినిమాలు, పుస్తకాల ద్వారా తెలిసిన కోరిక సత్యం మనసుని జయిం చాయి.

"ఎవరినీ కష్టపెట్టకుండా, నా అంతట నేను యీ మాత్రం ఆనందపట్టంలో తప్పేం లేదు...." అని చివరికి తన మన సుకి తనే నచ్చచెప్పుకున్నాడు.

ఓ చేత్తో పట్టుకున్న కిటికీ రెక్క నుదుటికి గట్టిగా వొరుసుకుంటోంది. బాదం చెట్టు కింద గాజు పెంకుల గోడ కింద ఎప్పుడు తెరుచుకుంటుందా ఆ రేకు తలుపన్నట్టు అలాగే చూస్తూ కూచున్నాడు సత్యం.

అలా చూట్టం సంతోషమూ కాదు.... పూర్తి తృప్తీ కాదు....చిత్రమైన ఓ యిష్టం. 'నేను చేస్తున్న దేమిటి' అని చాలాసార్లు ఆలోచ నొచ్చింది సత్యానికి. 'ఆఫ్టార్ల్ కొంచంసేపు.. కొంతవరకు ఆడశరీరాన్ని నగ్నంగా చూట్టం... యింతేనా...యిలా కక్కుర్తి పట్టం ఎందుకు?....సరైన వుద్యోగం, జీవితం లేనందుకేనా....ఎవర్తోటి జీవితం యింత వరకు పంచుకోలేకపోయినందుకేనా.... కానీ కాస్సేపు ఏదో వొంటిని ఎక్కడో అక్కడ కొనుక్కోవచ్చు....' ఆవేశం తగ్గాక తిరిగి భయం వేసేది సత్యానికి. 'అలా కొనుక్కున్న అనుభవం, చెడి పోయిన ఆ ఆడాళ్ళ అనారోగ్యం, వాళ్ళ రోగాలు తన కొచ్చేస్తే ...' తిరిగి పిరికి తనం.

తృప్తో, అసంతృప్తో తెలుసుకోలేని అనుభవం. మెడ అంత ఎత్తుకి చాచి.... కిటికీకి అంత ఎత్తు ఎదిగి చూస్తున్నా తనలోకి తను కుంచించుకు పోతున్నట్టే వుండేది....అలా చూస్తున్నంత సేపూ పిరికిగా, దరిద్రంగానే వుండేది సత్యానికి. అయినా రోజూ పొద్దున్నే కొన్ని గంటలు శ్రమపడి కొన్ని క్షణాలు అలా చూస్తూనే వున్నాడు. తనని తను చంపుకుంటూనే వున్నాడు.

పక్క దొడ్డి స్నానాల గది రేకు తలుపు సత్యం చూపుని కొంచం వెనక్కి తోసింది. వులిక్కిపడి కిటికీ సందులోకి జరిగిపోయి సర్దుకూచున్నాడు.

రేకు తలుపు దాటుకుని లోపలికొచ్చింది సరోజ. చేతిలో చీరని, తువ్వాల్ని మొండి గోడ మీద వేసింది. చేతిలో మిగిలిన వాటిని వొంగుని కింద పెట్టింది. పైకి లేచిన సరోజ కిటికీ వేపు పరీక్షగా చూస్తున్నట్టనిపిస్తే కిటికీ తలుపు కాస్త ఖాళీనీ మూసేశాడు సత్యం. మరో నిముషం ఆగి తిరిగి కొద్దిగా తీశాడు.

'పచ్చగా వడ్డాణంలా నడుం కనిపిస్తోంది సత్యానికి. ఆ పచ్చదనం వొణికినట్టనిపిస్తే వోసారి గట్టిగా కళ్ళు మూసు




కుని, తెరిచి చూపుకి పదును పెట్టాడు సత్యం. సరోజ జాకెట్టు తీసేసింది.... బ్రా తీసేసింది ...అంతవరకు అటువేపు వున్నదల్లా యిటు తిరిగింది.

సత్యం చూపులు కంగారు పడ్డాయి. వొక్క క్షణం భగ్గుమన్న వొళ్ళు వేడెక్కి వొణుకు తగ్గింది.

"ఎంత స్వచ్ఛంగా, నిర్మలంగా వుంది యీ అందం" అనుకున్నాడు.... అనుకుంటూ....'అదేమిటి ...' అనుకున్నాడు సత్యం.

సరోజ సూటిగా కిటికీవేపు చూస్తోంది. అంత దూరంలో వున్నా సరోజ కళ్ళు స్పష్టంగా కనిపించాయి సత్యానికి. ఒక్క నిముషం అదిరిన సరోజ బుగ్గలు....కదలిన సరోజ పెదాలు ...కనీ కనిపించని సన్నటి కన్నీటి తెర కనిపించాయి. వీటన్నిటి కన్నా స్పష్టంగా సరోజ రెండు చేతులు గుండెల కడ్డుగా పెట్టుకుని పెట్టిన దణ్ణం కనపడింది ... అర్థింపు కనపడింది.

కిటికీ మూసేస్తూ కిందకి జారిపోయాడు సత్యం. చాలా సేపు సిగ్గేసింది....తర్వాత అసహ్యం వేసింది. సాయంత్రానికల్లా, వేసేసిన కిటికీ తలుపుకి అడ్డంగా పెద్ద చెక్క పెట్టి, అది రాకుండా మేకులు దిగ్గొట్టాడు.

* * *

తన బలహీనతని మేకులతో అణగ్గొట్టిన మూడోనాడు సత్యానికి సరోజ రోడ్డు మీద ఎదురు పడింది.

నాలుగు రోజుల క్రితంవరకు ఎదురు పడితే శత్రువుల్లా చూసుకునే వాళ్ళిద్దరూ ఓ క్షణం వొకరివేపు మరొకళ్ళు చూసుకున్నారు.

ముందు సరోజే నెమ్మదిగా, పలకరింపుగా నవ్వింది.

నోరు విప్పి మాట్లాడకపోయినా, ఏం చెప్పకపోయినా ఆ నవ్వుతో సరోజ ఎన్నో విషయాలు చెప్పినట్టనిపించింది సత్యానికి, యిద్దరు మనుష్యుల మధ్య వుండాల్సిన చేరువ వున్నట్టు తోచింది.

అంతవరకు తన వెనక పడి దిగలాగుతున్నట్టున్న పెద్ద బరువు తొలిగిపోయినట్టనిపించి, సరోజ వేపు చూస్తూ నెమ్మదిగా పలకరింపుగా, స్నేహంగా తనూ నవ్వాడు సత్యం. □

# పుణ్యము నరకం

సత్యం మందపాటి · విమలాగౌతం

"విరాకు పోయినసారే చెప్పాను—కానీ నా మాట పెడచెవినపెట్టారు" అన్నది డాక్టర్ అనసూయ.

ప్రభాకరం మాట్లాడలేదు. అనసూయను కొంచెం కోపంగా చూసి, తల ప్రక్కకు తిప్పుకున్నాడు.

శ్యామల వంచిన తల పైకెత్తలేక పోయింది.

రెండు నిముషాలు ఎవరూ మాట్లాడ లేదు.

డాక్టర్ అనసూయ దీర్ఘంగా, నిట్టూర్పు వదలి "ఓ.కె. ఈ సారికి యిక మనం చేసేదేమీలేదు. కనీసం యిక ముందయినా జాగ్రత్తపడితే చాల మంచిది!" అన్నది.

ఈ సారికూడా ప్రభాకరం ఏమీ మాట్లాడలేదు. లేచి నుంచున్నాడు. జేబులో నుంచి అయిదురూపాయల నోటుతీసి, డాక్టర్ అనసూయచేతికి అందించాడు.

"పద" అన్నాడు శ్యామలతో. తను బయటకు నడుస్తూ.

"ఆగండి!" అన్నది అనసూయ. ఆమె అన్నతీరులో అతని అమర్యాద ఆమెకు కష్టం కలిగిందని అర్థమవుతున్నది.

ప్రభాకరం వెనక్కి తిరిగాడు.

"ఇప్పుడు శ్యామలకు ఎనిమిదో నెల. ఆరవకాన్పు. ఈ బ్లడ్ టెస్ట్ రిపోర్టు చూడండి — హెమోగ్లోబిన్ ముప్పయి శాతంమాత్రమే వుంది. ఆవిడ చాలా వీక్ గా కూడా వుంది. ఆమెకీసారి కాన్పు చాల కష్టమవుతుంది—"

ప్రభాకరం అప్పటికే బయటకు వెళ్ళిపోయాడు—

అనసూయ ఒక క్షణం మాట్లాడలేదు.

వంచిన తలఎత్తి నెమ్మదిగా అన్నది శ్యామల "క్షమించండి డాక్టర్—ఆయన ప్రవర్తనకి నేను చాలా బాధపడుతున్నాను"

"శ్యామలా—నాకు అన్నీ తెలుసమ్మా ఈసారి నా శాయశక్తులా నీకు సుఖంగా ప్రసవం అవటానికే ప్రయత్నిస్తాను—కానీ యిలాంటి మనుషులను మార్చటం ఎలాగా అనే ఆలోచిస్తున్నాను—"

"శ్యామలా—ఇంకా లోపలేం చేస్తున్నావ్" బయటి నుండి ప్రభాకరం గొంతు వినపడిరిది.

"వస్తాను డాక్టర్" సూటిగా డాక్టర్ అనసూయ కళ్ళలోకి చూసి తలవంచుకుని చకచకా బయటకు వెళ్ళిపోయింది శ్యామల.

శ్యామల కనుకొలకుల్లో నిలిచిన నీటి బిందువులు అనసూయను కదల్చివేసినయి.

శ్యామల — ప్రభాకరంతో వివాహం అయిననాటి నుంచీ అనసూయకు పరిచయమే....

శ్యామలకు యిప్పుడు అయిదుగురు ఆడపిల్లలు. తను యిద్దరు పిల్లలు పుట్ట

గానే చెప్పింది, శ్యామల ఆరోగ్యం దృష్ట్యా, ప్రభాకరం ఆర్థికపరిస్థితి దృష్ట్యా ఇక అంతటితో ఆపితే మంచిదని—

శ్యామల అంగీకరించినా, ప్రభాకరం ససేమిరా అన్నాడు.

"పున్నామనరకం నుంచి మనల్ని తప్పించే మగపిల్లవాడు లేకపోతే ఎలా—మగపిల్లవాడు పుట్టేదాకా అలాటివేం కుదరవు" అన్నాడు.

ప్రభాకరం తల్లీ, తండ్రీ కూడా సలహా యిచ్చిన డాక్టర్ అనసూయను మొహమాటం కూడా లేకుండా, అనాల్సిన మాటలన్నీ అన్నారు—

శ్యామల మీదవున్న సదభిప్రాయం, ఆప్యాయతలవల్ల-డాక్టర్ అనసూయ, ఇక ఏమీ అనలేక వూరుకుంది.

ప్రభాకరం దురదృష్టమో, శ్యామల ఖర్మో కానీ-వాళ్ళకు వరుసగా అయిదుగురూ ఆడపిల్లలే కలిగారు. డాక్టర్ అనసూయ ప్రతిసారీ వద్దని చెబుతున్నదేకాని, ప్రభాకరం ఆమె మాట పాటించలేదు.

"మగపిల్లవాడికి తండ్రి కాకపోతే ఎలా? రేపు నేను పోయిన తర్వాత. నా తలకు కొరివి పెట్టేవాడు వుండద్దూ—నన్ను పున్నామనరకం నుండి తప్పించేవాడు లేకపోతే ఎలా?"

"కానీ ఆవిడ ఆరోగ్యం ఏమీ బాగా లేదు—కాన్పు ఈసారి చాలా కష్టమవు



తుంది—ఆమె ప్రాణానికి కూడా...."

"ఎంత డబ్బు ఖర్చయినా సరే భరిస్తాను— బ్రహ్మాండంగా పని చేసే టానిక్స్ ఎన్ని రాపిచ్చినా వాడటానికి సిద్ధంగా వున్నాను. మీకు ఈ కేసు టేకప్ చేయటానికి భయంగా వుంటే, యిప్పుడే చెప్పండి. ఇంకో డాక్టర్‌కు చూపిస్తాను. అంతేకానీ నా దగ్గర యిక అలాటి విషయాలు ఎత్తవద్దు" ఖచ్చితంగా అన్నాడు ప్రభాకరం.

శ్యామల కూడా దీనంగా చూసింది అనసూయను.

ఆయన మన మాట వినడు. ఆయనతో యింక వాదించటం అనవసరం. నా ఖర్మ ఎలా జరగాలో అలా జరుగుతుంది" అన్న భావం ఆమె కళ్ళల్లో స్పష్టంగా కనపడింది అనసూయకు.

ఈసారి ఏదో చేయాలి. ఈ మూఢ నమ్మకాన్ని అతనిలో నుంచి పోగొట్టాలి. కానీ ఎలా? అదే అర్థం కావటం లేదు డాక్టర్ అనసూయకు. కాన్పు కష్టమయిందని చెప్పి శ్యామలకు ఆపరేషన్ చేసేసి, యిక పిల్లలు పుట్టకుండా చేసేయవచ్చు. కానీ .... తర్వాత మగపిల్ల వాడికోసం అంత పట్టుదలతో, మూర్ఖంగా వున్న ప్రభాకరం, శ్యామలను సరిగ్గా చూస్తాడా? చూడకపోగా, వేరే పెళ్ళి చేసుకుని ఈవిడ్ని వదిలేసినా ఆశ్చర్యపోనక్కర లేదు. "పున్నామనరకం" అనే అభిప్రాయం అంత మూఢంగా పాతుకుపోయిందతనిలో. దానికి తోడు సనాతనులయిన అతని తల్లి దండ్రులు అతని సెంటిమెంట్లకు పూర్తి సపోర్టు యిస్తున్నారు. అదొక్కటే కాక శ్యామల అంత నీరసంగా, అనారోగ్యంగా వున్న కారణంగా ఆమెకు ఆపరేషన్ చేయటం కూడా అంత మంచిది కాదు-ఈ సమస్యకి పరిష్కారం ఒక్కటే కనపడుతున్నది డాక్టర్ అనసూయకు. ప్రభాకరం ఈ విషయంలో అంగీకరించి, తనే ఆపరేషన్ చేయించుకోవటం. కానీ ఇది జరిగే పనా? తను ఆ విషయం ఎత్తితేనే ఎగిరి పడుతున్నాడు-పైగా తన మీద అతనికి గౌరవం కూడా పోతున్నది.

డాక్టర్ అనసూయ, ఆ రోజే కాదు, ఈ సమస్య నెలా పరిష్కరించాలా అని ప్రతి రోజూ ఆలోచిస్తూనే వున్నది.

ఆ రోజు సాయంత్రం డిస్పెన్సరీలో నాలుగు గంటలకు, రోగులను చూస్తున్న డాక్టర్ అనసూయ దగ్గరకు హడావిడిగా పరుగెత్తుకు వచ్చాడు ప్రభాకరం.

"డాక్టర్ శ్యామలకు నొప్పులు వస్తున్నాయి-రక్తస్రావం అవుతోంది-తీసుకు వచ్చాను" అన్నాడు రొప్పుతూ.

అనసూయ సూటిగా చూసింది ప్రభాకరాన్ని.

ప్రభాకరం గాభరా పడుతున్నాడు.

"నర్స్" కేకేసింది అనసూయ.

"లేబర్ రూంకు తీసుకు రండి." అంటూనే అటుకేసి నడచింది డాక్టర్ అనసూయ.

లేబర్ రూంలో, పక్క మీద పడుకున్న శ్యామల నొప్పులతో మెలికలు తిరిగిపోతున్నది. డాక్టర్ అనసూయ వచ్చి పరీక్ష చేసింది.

"రక్తస్రావం అవుతున్నది" అన్నది. నర్స్‌ని పిలిచి ఏదో చెప్పింది.

నర్స్ బయటకు వెళ్ళి, ఒక క్షణం

తర్వాత ప్రభాకరంతో లోపలకు వచ్చింది. ప్రభాకరం వెంటనే వస్తున్న ప్రభాకరం తల్లి. అతని పెద్దమ్మాయిని చూడగానే వాళ్ళను బయటకు వెళ్ళమని సంజ్ఞచేసింది అనసూయ. నర్స్ వాళ్ళను బయటకు పంపించి తలుపు వేసేసింది.

ప్రభాకరం వచ్చాడు.

దిక్కు తోచక అలానే నుంచున్నాడు.

"మిస్టర్ ప్రభాకరం! శ్యామల పరిస్థితి ఏమీ బాగా లేదు. రక్తస్రావం బాగా అవుతోంది-రక్తం అవసరం కావచ్చు-నా శాయశక్తులా సుఖ ప్రసవం అవటానికి ప్రయత్నం చేస్తాను. కానీ ఒక రిక్వెస్టు."

ఏమిటి? ఆ పరిస్థితిలో కూడా ప్రభాకరం కోపంగానే కనపడ్డాడు.

చిన్నగా నవ్వింది అనసూయ.

"కోపం తెచ్చుకోకండి నేనేమీ ఫామిలీ ప్లానింగ్ గురించి ఉపన్యాసం యివ్వను— శ్యామల పరిస్థితి బాగాలేదు. ఆమెకు కాన్పు అయేదాకా మీరూ యిక్కడే వుంటే ఆమెకు ధైర్యంగా వుంటుంది. నా ఈ ఒక్క కోరికా మీరు కాదనకండి—"

వింతగా చూశాడు ప్రభాకర్.

"అదేమిటి—నేను యిక్కడ వుండడమేమిటి? భార్య కాన్పుకు భర్త పక్కనే వుండటం నేనెక్కడా వినలేదు — మీరేదో విచిత్రంగా మాట్లాడుతున్నారు."

"నో-మిస్టర్ ప్రభాకరం-ప్లీజ్ డోంట్ ఆర్గ్యూ ఎనీథింగ్ మోర్—ఒకసారి మీ శ్యామల ముఖంలోకి చూపి అనండా మాట-మీరు యిక్కడ వున్నందువల్ల లాభమే కానీ, నష్టంలేదు కదా-ప్లీజ్ బి

హియర్-నర్స్-గివ్‌మి దట్ సిరంజ్"—
నర్స్ యిచ్చిన సిరెంజ్ తీసుకుని, నొప్పులు ఎక్కువ అవటానికి యింజక్షన్ చేసింది అనసూయ.

ఇంజక్షన్ చేసిన తర్వాత, శ్యామల బాధ యింకా ఎక్కువ అయింది. మనిషి వంకర్లు తిరిగిపోతున్నది.

ప్రభాకరం, శ్యామలనే చూస్తున్నాడు.

శ్యామల, ప్రభాకరంని చూసి దగ్గరకు పిలిచింది.

ప్రభాకరం వచ్చి ఆమె తలదగ్గరకు నుంచున్నాడు.

ఆమె ప్రభాకరం రెండు చేతులూ పట్టుకుంది.

గట్టిగా పట్టుకుంది.

పళ్ళు బిగపట్టి, నొప్పులను భరిస్తున్నది.

"మీరిలా తలవెనక నిలబడండి—" అన్నది అనసూయ—నర్సుతో ఏదో చెప్పిన తర్వాత.

ప్రభాకరం, మంచం తలకట్టున, శ్యామల తలవెనక నిలబడ్డాడు. శ్యామల ఒకచేత్తో అతని పట్టుకుని, రెండో చేత్తో పొత్తికడుపు మీద వత్తుకుంటోంది. నొప్పులు భరించలేక, మధ్యమధ్య భళ్ళుమని ఏడుస్తూంది.

నర్స్ వచ్చింది. ఒక సీసారక్తం తీసుకుని—

బ్లడ్ బాగా తక్కువగావుంది. కనీసం ఒక సీసా అయినా ఎక్కించాలి" అంటూ అనసూయ రక్తంసీసాను తలక్రిందులుగా స్టాండుకు వేలాడకట్టి శ్యామల ముంచేతి దగ్గర సూదిద్వారా ఎక్కించటానికి ప్రయత్నంచేస్తున్నది—

నర్స్‌వచ్చి సహాయం చేసింది.

ప్రభాకరం శ్యామల తలదగ్గరే నిరాదుగా నిలబడ్డాడు.

శ్యామలలోకి రక్తం ఎక్కుతున్నది.

ఆమెకు రక్తస్రావం అవుతున్నది.

నర్స్‌వచ్చి ప్రభాకరంచేత ఒక కాగితం మీద సంతకం పెట్టించుకున్నది. ఆపరేషన్ అవసరం అయితే, తనకేమీ అభ్యంతరం లేదని.

అనసూయ బ్లడ్‌ప్రషర్ చూస్తూ మధ్య మధ్యలో రక్తంతీసి పరీక్ష చేస్తున్నది. రక్తం గడ్డకడుతున్నదేమోనని.

శ్యామల ముఖంనిండా చమటలు కారుతున్నాయి. బట్టలు తడిసిపోయాయి-ముఖం బాగా ఎర్రబడింది.

కళ్ళు పైకెత్తి ప్రభాకరాన్ని చూసింది. అతన్ని చూస్తుంటే ఆమెకేదో కొండంత ధైర్యం కలుగుతున్నది.

ప్రభాకరం, జేబులోంచి కర్చీఫ్ తీసి, ఆమె ముఖంమీద చెమటలు అంతా తుడిచాడు.

"బాధగా వుందా—" అన్నాడు చాలా నెమ్మదిగా.

ఆమె కళ్ళతోనే లేదని అబద్ధం చెప్పింది.

"కొంచెంఓర్చుకో-ఎవ్విరిథింగ్ విల్ బి ఆల్‌రైట్" అన్నాడు.

అన్నాడు కానీ అతనిలో ఏదో అనుమానం తొంగిచూపింది. ఆ అనుమానాన్ని దాచుకుంటూనే ఆమె చేయి పట్టుకున్నాడు.

బ్లడ్ యివ్వటం పూర్తయింది. నర్స్ ఆ సీసాలు తీసి ప్రక్కన పెడుతున్నది.

అనసూయ ఎర్రబడ్డ గ్లొవ్స్‌ని, సరి చేసుకుంటూ "ఆపరేషన్" అవసరం




రాకపోవచ్చు కానీ—కొన్ని కుట్లు వేయవలసి వస్తుందేమో" అన్నది.

ఆమె గ్లొవ్స్ చూసిన ప్రభాకారం కళ్ళు మూసుకుని "మీ యిష్టం డాక్టర్" అన్నాడు—

శ్యామలతో అనసూయ అంటున్నది- "శ్యామలా, నువ్వు కొంచెం ప్రెషర్ అప్లయి చెయ్యాలి—కొంచెం అలా—అలా— ఊఁ! . అలా అన్నావంటే చక్కటి పిల్లవాడు పుడతాడు. ఏదీ—ఇంకా ప్రయత్నం చేయాలి. ఈసారి పండంటి పిల్లవాడు. మళ్ళీ అలా.... అలా...అనాలిమరి....మిమ్మల్ని పున్నామ నరకంనుంచి తప్పించే మగపిల్లవాడు . ఏదీ....అలా... అలా... "

శ్యామల చాలా అలసటగా, ఇబ్బందిగా బాధగా కళ్ళు మూస్తూ, తెరుస్తూ. మంచం మీద మెలికలు తిరిగిపోతూ, అనసూయ చెప్పినట్టల్లా చేస్తున్నది.

"గుడ్ గాల్! అలా కోఆపరేట్ చేయాలి. ఏదీ మళ్ళీ. ఊఁ ...వెరీగుడ్-ఎగైన్...."

. ప్రభాకరం ఊపిరి పీల్చటం ఆపి, అటే చూస్తున్నాడు.

అతని నుదుటి మీద చెమటలు పట్టి, మెడ మీదుగా షర్టును తడిపేస్తున్నాయి.

అతని కనురెప్పలు కదలటం లేదు.

శ్యామల అతని చేతులు గట్టిగా తన రెండు చేతులతోనూ పట్టుకున్నది. ఆమె పట్టుకున్న పట్టు క్షణ క్షణానికీ బిగుసుకు పోతున్నది. ఆమె అరిచేతుల్లోని చెమట, అతని చేతుల మీదుగా కారిపోతున్నది.

శ్యామలకు నొప్పులు రాను రాను అధికం అయ్యాయి. అనసూయ ఏదో చిన్న ఆయుధం తీసి, చర్మాన్ని కత్తిరిస్తున్నది-మధ్య మధ్యలో శ్యామలతో "అయిపోయింది.... అలా.... కొంచెం ఓపిక పట్టు. ప్లీజ్ .. వెరీ గుడ్....మీ వంశోద్ధారకుడు త్వరలో రాబోతున్నాడు. అలా.. "

శ్యామల అంత బాధలోనూ కళ్ళెత్తి ప్రభాకరం వేపు చూసింది. ప్రభాకరం ఆమె ముఖాన్ని తన చేతులతో ఆప్యాయంగా నిమిరాడు. ఆమె ప్రభాకరంను దీక్షగా చూస్తూ-తన బాధ అంతా మరచి పోవటానికి ప్రయత్నం చేస్తున్నది.

డాక్టర్ అనసూయ ఏదేదో చేస్తున్నది. నర్స్ ఏవేవో అందిస్తున్నది.

ప్రభాకరం కళ్ళ ముందు ఎర్రటి చక్రాలు ఏవో తిరుగుతున్నాయి.

శ్యామల బాధ యింకా ఎక్కువైంది. ఉన్నట్టుండి పెద్దగా అరచింది.

అనసూయ బిడ్డను బయటకు తీసే ప్రయత్నం చేస్తున్నది.

శ్యామల బాధగా అరుస్తున్నది.

అరుస్తూనే తల ప్రక్కకు వేలేసింది.

ప్రభాకరం కళ్ళ ముందు ఏవేవో చక్రాలు, ఎన్నో రంగులతో తిరుగుతున్నాయి.

వళ్ళంతా చెమట పట్టేసింది—

అక్కడ వున్న వస్తువులన్నీ అతని చుట్టూ తిరుగుతున్నట్టనిపించింది. తర్వాత ఏమయిందో అతనికే తెలియదు.

కళ్ళు తెరిచి చూసేసరికి కారిడార్‌లో బల్లమీద పడుకుని వున్నాడు. ప్రక్కనే నర్స్ ఏదో మందు రాసి దూదిని అతనికి వాసన చూపిస్తున్నది. చటుక్కున లేచి కూర్చున్నాడు ప్రభాకరం.

ప్రక్కనే ఆదుర్దాగా, తల్లీ తండ్రీ, పిల్లలూ కనపడ్డారు.

"శ్యామల ...శ్యామల ఏదీ?" నీరసంగా అడిగాడు ప్రభాకరం.

టవల్‌తో చేతులు తుడుచుకుంటూ బయటకు వచ్చిన అనసూయను చూసి, ఆదుర్దాగా అడిగా డామెను మళ్ళీ ప్రభాకరం.

"ఆమె డెలివరీ కాగానే, పెయింట్ అయిపోయింది, ఇప్పుడు బాగానే వుంది లేండి-మీరేమిటి అలా కళ్ళు తిరిగి పడి పోయారు?" అన్నది అనసూయ.

"శ్యామలకేమీ పరవాలేదు కదూ డాక్టర్‌గారూ!" అతని గొంతులో వణుకు కనబడుతున్నది.

"రండి చూద్దురుగాని..." అతన్ని లోపలికు తీసుకువెళ్ళింది అనసూయ.

పెద్ద వాన వెలిసిన తర్వాత ఆకాశంలా హాయిగా వుంది శ్యామల.

యుద్ధం అయిపోయిన తర్వాత ప్రకృతిలా నిశ్శబ్దంగా వుంది శ్యామల.

"శ్యామలా...." నెమ్మదిగా పిలిచాడు ప్రభాకరం.

కళ్ళెత్తి చూసింది శ్యామల.

విశాలమైన ఆమె కళ్ళల్లో ఏదో తృప్తి-ఏదో ఆనందం—

ప్రభాకరం ఆమె దగ్గరగా వెళ్ళాడు.

ఆమె కళ్ళు మూసుకుంది-కనురెప్పలకు అడ్డం వచ్చిన కన్నీటి బిందువులు క్రిందకు జారాయి.

"శ్యామలా...." ఆందోళనగా అన్నాడు ప్రభాకరం.

"సారీ మిస్టర్ ప్రభాకరం-ఈసారి కూడా మీకు ఆడపిల్లే పుట్టింది. మీరు అనుకున్న 'పున్నామ నరకం' మిమ్మల్ని వదిలేట్టుగా లేదు...." డాక్టర్ అనసూయ.

ప్రభాకరం సూటిగా డాక్టర్ అనసూయ వేపు చూశాడు. కొంచెం ఆగి శ్యామల ప్రక్కనే వున్న పసికందును చూశాడు.

తర్వాత శ్యామల వేపు తిరిగాడు.

అతను ఏమంటాడో అని భయ పడుతూ చూస్తున్నది శ్యామల.

ప్రభాకరం శ్యామలనూ, పసికందునూ మార్చి మార్చి చూశాడు. హఠాత్తుగా అనసూయ వేపు తిరిగాడు

"ఎక్స్‌క్యూజ్‌మి డాక్టర్-నన్ను క్షమించండి. ఇంత చదువూ చదివి నేను ఎందుకింత అజ్ఞానంగా ప్రవర్తించానో తలుచుకుంటే నాకే సిగ్గుగా వుంది. వున్నదో, లేదో తెలియని పున్నామనరకం గురించి ఆలోచించానే కానీ, అంతకన్నా ఎక్కువ నరకం అనుభవించిన శ్యామల గురించి ఆలోచించలేదు. నా కళ్ళారా నరకమేదో చూశాను — కాదు మీదే చూపించి, నా కళ్ళు తెరిపించారు. ఈ కాలంలో ఆడపిల్ల అయినా ఒకటే, మగవాడయినా ఒకటే. తల్లీ పిల్లలూ ఆరోగ్యంగా వుంటే చాలు."

శ్యామల ప్రభాకరంని వింతగా చూస్తున్నది.

శ్యామల దగ్గరకు వెళ్ళి ఆమె చెంపలు నిమిరాడు ప్రభాకరం.

"మళ్ళీ నిన్నా నరక బాధ పడనివ్వను శ్యామలా-పడనివ్వను" అన్నాడు ప్రభాకరం తృప్తిగా చూస్తున్న ఆమె కళ్ళల్లోకి ప్రేమగా చూస్తూ. □

---

## యాజమాన్యం తదితర వివరాలు జ్యోతి

### ఫారం 4 (8వ నిబంధన ప్రకారం)


| | | |
|---|---|---|
| ప్రచురణ స్థలం | : | మద్రాసు |
| ఎంతకాలానికొకసారి | : | మాసపత్రిక |
| ముద్రాపకుని పేరు | : | శ్రీ డి. హనుమంతరావు |
| జాతి | : | భారతీయుడు |
| విలాసం | : | 12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-600 001. |
| ప్రకాశకుని పేరు | : | శ్రీమతి వి. లీలావతి |
| జాతి | : | భారతీయురాలు |
| విలాసం | : | 17-B, రాజారాం కాలనీ, మద్రాసు-600 024. |
| సంపాదకుని పేరు, జాతి, విలాసం | : | డిటో |
| పత్రిక యజమానురాలు | : | డిటో |

పై విషయాలు నాకు తెలిసినంతవరకూ వాస్తవమైనవని తెలియజేయుచున్నాను.

మద్రాసు - 600 024

(సం) వి. లీలావతి

# జ్ఞాని

## ఎ. యస్. వి. ప్రసాద్

గుళ్ళో గీతాపారాయణం జోరుగా సాగు తోంది.

"యే యథామాం ప్రపద్యన్తే
తాం స్తథైవభజామ్యహమ్
మమ వర్త్మాను వర్తన్తే
మనుష్యాః పార్థసర్వశః"

"చేసుకున్నవారికి చేసుకున్నంత మహాదేవ అన్నట్లు ఎవరెవరు ఏయే విధముగా ఎంతెంత భక్తితో ఏయే రూపముతో తన్ను అర్చించుదురో లేక సేవించుదురో, వారిని ఆయా విధముగానే అనుగ్రహించెదనని భగవంతుడు చెప్పు చున్నాడు.

పరమాత్మ కల్పవృక్షము వంటివాడు. అతని చెంతకుఃబోయి ఏది వాంఛిం చిన దాని నొసంగును.

ఉత్తమ ఫలితములు ఎవ్వారికైన కల్గ కున్నచో దోషము వారిదేగాని భగవంతు విది కాదు.

తృప్పుపట్టిన యినుమును సూదంటు రాయి ఆకర్షించదు. అట్లే మనస్సునందు విషయ మాలిన్యము, దృశ్య దోషములు వున్నచో భగవంతుడు ఆకర్షింపబడడు.

కాబట్టి వారి వారి భక్తి ప్రపత్తుల తీవ్రతనుబట్టి సత్ఫలములను భగవానుడు వారికి కల్గజేయును."

శ్లోకానికి వ్యాఖ్య చదివి ఆ రోజుకి గీతా పారాయణకి వుద్వాసన చెప్పాడు గణాచారి.

హారతి వెలిగించి పళ్ళెం పట్టాడు.

భక్తులు పారవశ్యంతో కనక వర్షం కురిపించారు.

పళ్ళెంలో డబ్బును ఆశగా చూసుకు న్నాడు గణాచారి.

* * *

ఆ రోజు సాయంత్రం ఆరు గంటలకే స్వామివారి పూజా పునస్కారాలు పూర్తి చేసి గుడికి తాళం వేశాడు గణాచారి.

"స్వామీః ఈ రోజు పవ్వళింపు సేవ వేగిరం చెయ్యవల్సి వచ్చింది క్షమించు" లెంపలు వేసుకుంటూ మంటపంలోకి వచ్చాడు.

పోలిగాడు టెంకాయతో ప్రత్యక్ష మయ్యాడు. తాళం పెట్టివున్న గర్భగుడిని చూసి ఆశ్చర్యపోయాడు.

"ఏంటి సామీః ఈరోజు చుక్క పొడవకుండానే మూశారు" అడిగాడు.

"ప్రతివాడు ప్రశ్నలడిగేవాడే. ప్రజా స్వామ్యం మరిః ఆఖరికి పోలిగాడికి కూడా తాను సంజాయిషీ యిచ్చుకోవాలిః మూఢుడు. మూఢుడుః విసుక్కున్నాడు గణాచారి.

"స్వామివారి పవ్వళింపు సేవకూడా అయిపోయింది. రేపొచ్చి ఆ టెంకాయ కొట్టు. మరేం కొంప ములగదు" అన్నాడు.

పోలిగాడు హతాశు డై పోయాడు.

"కాదు సామి. ఈరోజు శానాముఖ్యం. కొత్త గుడి తలుపులు తెరవండి. దేవుడికి మొక్కుకోవాలి" ప్రాధేయపడ్డాడు.

"ఏంటంత అర్జెంటు?" అడిగాడు గణాచారి.

"మా అబ్బాయికి పట్నంలో రేపు ఉద్యోగంకి సెలక్షన్. దేవుడికి దణ్ణం పెట్టాలి. టెంకాయ కొట్టి మొక్కు కట్టాలి" అన్నాడు పోలిగాడు.

"సరి సరి. స్వామివారు వుదయం నుంచి రోగాలు తగ్గటానికి - వుద్యోగాలు రావటానికి- సంతానం కల్గటానికి- పరీక్షలు ప్యాసవ్వటానికి- యింకా ఎన్నో వివరాలు యిచ్చేసి యిప్పుడే కొత్త విశ్రమించారు. వెళ్ళు వెళ్ళు' అన్నాడు గణాచారి వ్యంగ్యంగా.

పోలిగాడు అచేతనంగా నిలబడిపోయాడు.

"అంత భక్తేవుంటే ఆ టెంకాయ అక్కడే



కొట్టెయ్. దేముడు ఎక్కడ మాత్రం లేడు? ఈ మాత్రానికి వేసిన తలుపులు తీయడం దేనికి? నా కవతల పనుంది" అంటూ వడివడిగా యింటివైపు నడిచాడు గణాచారి.

రెండు మెతుకులు తిని బట్టలు చేతి సంచిలో సర్దుకున్నాడు.

ఎందుకైనా మంచిదని ఒక ఐదు వందలు రొఖ్ఖం విడిగా ఒక కవర్లో పెట్టి సంచి అడుగున దాచాడు.

ఈ రోజుల్లో మరి డబ్బుతోటిదే కదా ఏ పనైనా!

ఆ రోజు ప్రెసిడెంట్‌గారు హైదరాబాద్ వెళ్ళబోతున్నారు. ప్రెసిడెంటు ఆలయానికి ధర్మకర్తలు: బోర్డు పలుకుబడి వున్న మనిషి.

ఆయనతో చదువుతూ ఒకే కంచంలో తిని ఎమ్. ఎల్. ఏలు, ఒకే మంచం మీద పడుకున్న మినిష్టర్లు వున్నారుట పట్నంలో.

అందుకే గణాచారి ఆయన్ని ఆశ్రయించాడు.

ప్రెసిడెంటుగారు అభయ హస్తం యిచ్చేశారు.

అసలు సంగతి!

గణాచారి కొడుక్కి హైదరాబాదులో ఒక వుద్యోగానికి యింటర్‌వ్యూ వచ్చింది,

కొడుకు తనలా పూజారి కాకూడదని తండ్రి ఆశయం. ఏదైనా మంచి సర్కారు వుద్యోగం చెయ్యాలని వాంఛ.

ఆ రాత్రికే ప్రెసిడెంట్‌గారితో హైదరాబాద్ వెళ్ళే బస్సెక్కేశాడు గణాచారి.

* * *

పది రోజులు యిట్టే గడిచాయి.

గణాచారి యాంత్రికంగా తన విధులు నిర్వహిస్తున్నాడు. మనస్సు మాత్రం కొడుక్కి రాబోయే వుద్యోగం మీదే వుంది.

గణాచారి కొడుకు ఆ రోజే పట్నం నుంచి తిరిగి వచ్చాడు.

ఉద్యోగం రాలేదు. కొడుకు చెప్పిన వార్త విని ఖిన్నుడైపోయాడు గణాచారి.

ప్రెసిడెంట్‌గారి కంచంలో తిన్న ఎం. ఎల్. ఏ. మంచంలో పడుకున్న మినిస్టరూ ఎవ్వరూ ఏం చెయ్యలేకపోయారా?

'అంతా మన తల రాత. ఈశ్వరేచ్ఛ మరోలా వుంది' అనుకున్నాడు.

చివరి మాట అంటూ గతుక్కుమన్నాడు గణాచారి.

ఎంత పొరపాటు చేశాడు?

వడి వడిగా గుడి వైపు నడిచాడు.

అక్కడ కనబడ్డ దృశ్యం చూసి ఒక క్షణం ఆశ్చర్యంగా నిలబడిపోయాడు.

పోలిగాడు, వాడి కొడుకూ, మోచేతులు-మోకాళ్ళ మీద ప్రాకుతూ గుడి చుట్టూ ప్రదక్షిణం చేస్తున్నారు.

"పోలిగా, ఏంటి సంగతి?" కుతూహలంగా అడిగాడు.

"ఏం లేదు సామి, దేముడు మా మొరిన్నాడు. అబ్బాయికి వుద్యోగం వచ్చింది, అందుకే మొక్కుబడి తీర్చుకుంటున్నాం" అన్నాడు.

బాగా మాట్లాడుతాడు
కదూ- నా సిన్మాకి
మాటలు రాసిందాయనే!





గణాచారి క్షణం సిగ్గుపడ్డాడు.

ప్రతి నిత్యం స్వామి వారి సేవలో వుంటూ, కోర్కెలు కోర వచ్చిన భక్తులకు తీర్థ ప్రసాదా లిస్తూ, భగవంతుడి మహిమలు కథలుగా, గానాలుగా వినిపించే తాను ఏం చేశాడు? స్వామి వారిని నమ్మలేక మానవమాత్రుల వెంటపడ్డాడు.

"నా భక్తుల బాగోగులు చూసే బాధ్యత నాది" అని గీతలో భగవంతుడే చెప్పాడు.

"స్వామీ! క్షమించు. అత్యంత సన్నిహితుడవి, సమర్థుడవి అయిన నిన్ను ఉపేక్షించి ఎండమావుల వెంట పడిపోయా. మూర్ఖుడని" లెంపలు వేసుకున్నాడు.

పోలిగాడూ, కొడుకూ ప్రదక్షిణలు పూర్తి చేసి నిలబడ్డారు.

"రా పోలి! గుడి తలుపులు తెరుస్తా. దేవుడిని దర్శించుకుని పోదుగాని" అన్నాడు గణాచారి.

"వద్దులే సామి. ఆ రోజు మీరు చెప్పిందే నిజం. దేవుడెక్కడ మాత్రం లేడు? కావల్సింది భక్తి. నమ్మకం. అవి వుంటే గుడి తలుపులు అడ్డు రావ్" అంటూ టెంకాయ మండపంలోనే కొట్టి వెళ్ళిపోయాడు పోలిగాడు.

దూరమవుతున్న మూఢుడనుకున్న పోలిగాడు ఒక పెద్ద జ్ఞానిలా కనబడ్డాడు గణాచారికి. □

పన్నెండేళ్ళ ఆ మూగ కుర్రాడు నా మనసు నింతగా కదిలించగలడని



# మూగ సూర్యం

## విన్ధ్యవాసిని

మేట్రన్ అని.

ఆవిడకి యాభై ఏళ్ళకి పైనేవుంటాయి. మల్లెపూవులాంటి తెల్లటి చీరా, చిన్నముడీ స్వచ్ఛమయిన ఆ చిరునవ్వూ—నన్నెంతో ఆకర్షించాయి.

నాకు తెలీకుండానే, నా కాళ్ళు ఆమె వయిపుకి

నే నెప్పుడూ అనుకోలేదు. మొదటగా వాణ్ణి నే చూడటం చాలా చిత్రంగా జరిగింది.

ఆ వేళ సాయంత్రం ఏమీ తోచక పాపని చంకనేసుకుని, అయిదేళ్ళ బాబుని చేత్తోపట్టి, పార్కు వయిపుకు దారి తీసాను.

పార్కులో మామూలుకంటే ఎక్కువమంది పిల్లలు కన్పించారు. "ఏమిటా విశేషం?" అనుకున్నాను. ఇంతలో నా దృష్టి పిల్లలకి దగ్గరగావున్న బెంచీమీద కూచునివున్న ఒక ముసలావిడ మీదపడింది. కారణం అర్థమయింది. ఎవరో చెప్పగా విన్నాను—ఆవిడ శ్రీమహాలక్ష్మి అనాధ శరణాలయం

లాగేయి. బాబు చెయ్యి వదిలేసాను. పిట్టలా ఎగిరిపోయి పిల్లల్లో దూరాడు వాడు.

మెల్లిగా ఆవిడ పక్కనే కూచుని పాపని వళ్ళో కూచోబెట్టుకున్నాను. ఆవిడ

చిరునవ్వుతో నా వయిపు చూపింది. మెల్లిగా మాటలు కలిపాను.

"ఈవాళ పిల్లలతో పార్క్ భలే నిండుగా వుందండి" అన్నాను నవ్వుతూ.

"అవునమ్మా...సూర్యకాంతి పువ్వుల్లా వున్న ఆ ముఖాల్ని చూస్తూ నన్ను నేను మరిచిపోతుంటాను....ఎంత సంతోషంగా ఆడుకుంటున్నారో ..."

ఆవిడ భావుకతకి నాకు ఆశ్చర్యం వేసింది.

"ఇద్దరు పిల్లలతోటే ఒకోరోజు తల నొప్పి వచ్చేస్తుంది నాకు. ఇంత మంది అల్లరినెలా భరిస్తారండీ మీరు?"

"అల్లరి....అవును... అల్లరి పిల్లలు కాక మనం చేయమన్నా చేస్తామటమ్మా. అమాయకమయిన వాళ్ళ ముఖాలు చూస్తే నాకెప్పుడూ విసుక్కోవాలనిపించదు.. అమ్మా నాన్నా లేని వాళ్ళ దురదృష్టాన్ని చూసి ఎంతో బాధగా వుంటుంది నాకు... " సీరియస్‌గా అంటున్నదల్లా మాట మార్చేసి "అయినా మా పిల్లలంతా చాలా బుద్ధి మంతులుగా, నేచెప్పినట్లు వింటారు" అంది తేలిగ్గా నవ్వుతూ.

తర్వాతేం మాటలు సాగలేదు. ఆడు తున్న పిల్లల వయిపు చూస్తూ కూచు న్నాను. ఇంతలో మా బాబు ఆడుతూ కిందపడ్డాడు. పన్నెండేళ్ళ కుర్రాడొకడు, ఏడుస్తున్న బాబుని మా దగ్గరికి తీసు కొచ్చాడు.

ఆ కుర్రాడి ముఖం నన్నెంతో ఆకర్షిం చింది. పచ్చటి ఆ ముఖంలో అల్లరిగా నవ్వుతున్న పెదవులూ, బూరెల్లా వున్న బుగ్గలూ—ముఖంమీద పడుతున్న జుట్టుని తోసుకుంటూ మా దగ్గరికొచ్చి నిలబడ్డాడు.

ఆత్రుతగా బాబుని దగ్గరికి తీసు కున్నాను. దెబ్బేమయినా తగిలిందేమోనని చూశాను. ఆ కుర్రాడు ఏమీలేదన్నట్లు చేతిని తిప్పి చూపాడు.

"అరె! అంత మాత్రానికే అంత ఏడ వచ్చా. ఆటల్లో పడిపోతే ఏడవకూడదని నాన్నారు చెప్పలే. పోమ్మా వెళ్ళి ఆడుకో పో." అని పంపేశాను బాబుని.

ఆ కుర్రాడు మాత్రం అక్కడే నిల చుని నా వళ్ళోవున్న పాపని చూస్తున్నాడు చిత్రంగా. మాట్లాడించకుండా ఉండలేక పోయాను.

"నీ పేరేమిటి బాబూ?" అన్నాను.

మాట్లాడకుండా కళ్ళు చిట్లిస్తూ, అస్తమిస్తున్న సూర్యుడివైపు చూపాడు. నేను అయోమయంలోంచి తేరుకునేసరికి మేట్రన్‌గారు చెప్పింది. "వాడికి మాటలు రావమ్మా!" అని.

"ఓహ్! ఇంత చక్కని అబ్బాయి మూగవాడా?" అనుకున్నాను.

"నీ పేరు రవా బాబూ?" అన్నాను. కాదన్నట్లు తల అడ్డంగా తిప్పాడు.

"సూర్యమా? అన్నాను. అవునన్నట్లు నవ్వుతూ తలవూపేడు.

దీక్షగా పాపని చూస్తున్నవాణ్ణి. "పాప నెత్తుకుంటావా?" అని అడిగాను.

"ఊహూ" అన్నట్లు తల అడ్డంగా తిప్పి, చేత్తో పాప చెంపతాకి ముద్దుపెట్టు కుని పరిగెత్తి వెళ్ళిపోయాడు.

వెళ్ళిపోతున్న—ఆ కుర్రాడినించి, నా దృష్టి మేట్రన్‌గారివయిపు తిప్పాను. నవ్వుతూవున్న ఆవిడ ముఖంలో దిగులు కనిపించింది. నేనేమీ మాట్లాడకుండా

ఆవిడే అంది. "వాడికి మాటలు రావు. చెవులూ వినిపించవ్. వాడి భవిష్యత్తు ఆలోచిస్తే భయమేస్తుంది నాకు."

ఆశ్చర్యమేసింది. "మరి ..." నేను పూర్తిచేయక మునుపే ఆవిడే అంది. "మనం మాట్లాడితే పెదవుల కదలికను బట్టి.ముఖంలో భావాన్ని బట్టి అర్థం చేసుకుంటాడు ...నాలుగేళ్ళ వయసులో మా శరణాలయంలో చేర్చారు ఎవరో. అప్పట్నుంచీ ఆ మాత్రం అర్థంచేసుకోవడం నేనే నేర్పాను. మిగతా పిల్లలంతా రోజూ స్కూల్ కెళతారు. అందరికీ ఏదో ఒక స్కాలర్‌షిప్ వుంది. వీడొక్కడే శరణాలయం సర్వెంట్‌లా అయిపోయాడు. ఆ పనీ ఈ పనీ చేసి రోజంతా పొద్దుపుచ్చుతాడు. సాయంత్రం మిగతా పిల్లలు రాగానే. అంతా వీడికి కబుర్లు చెప్పాలి. చాలా తెలివయిన వాడు."

మాట్లాడుతుండగానే చీకటి పడుతూ వుంది. వెళ్ళొస్తానని చెప్పి, పిల్లల్ని తీసుకుని ఇంటికి దారిపట్టేను.

* * *

అంతదూరంలో వుండగానే ఇంటి ముందు స్కూటర్ కన్పించింది.నాన్నొచ్చారని గోలచేస్తూ, గెంతుతూ నాకంటే ముందుగానే వెళ్ళిపోయాడు బాబు. వరండాలో పిట్టగోడమీద కూచుని సిగరెట్ కాలుస్తూ, కుమారరత్నంతో కబుర్లు చెబుతున్నారు శ్రీవారు నే చేరుకునేసరికి.

"సారీ సార్! మీరు ఆలస్యంగా వస్తారన్నారని పిల్లల్ని అలా పార్కుకి తీసికెళ్ళా. కాస్త ఆలస్యం అయిపోయింది" అడక్కుండానే సంజాయిషీ ఇస్తూ తలుపు తాళం తీసాను.

పాపను ఎత్తుకుని ఇంట్లోకి అడుగు పెట్టారు ఆయన.

వంటింట్లో దూరి కాఫీకి ఎసరు పెట్టాను. ఎంత ఆలస్యంగా వచ్చినా ఫ్రెష్‌గా చేసేదాకా ఓపిగ్గా కూచుంటారు కానీ ఫ్లాస్క్‌లో పోస్తే నచ్చదాయనకి.

పదే పదే ఆ మూగ పిల్లడి ముఖమే గుర్తొస్తోంది. ఎంత అమాయకత్వం? దేవుడు కొంత మందికెందుకిలా అన్యాయం చేస్తోడో! పైగా దిక్కు లేనివాడు....

శ్రీవారి పిలుపుతో ఆలోచల్నించీ తేరుకున్నాను.

ఏఁవిటీ అంత ఆలోచన? నీళ్ళు ఇగిరిపోతాయి నువ్వు కాఫీపొడి చేసేలోగా." అని నవ్వుతూ నిలబడున్నారు పాపనెత్తుకుని.

గబా గబా కాఫీ కలిపి ఆయన కిచ్చాను. అదే చేత్తో మరి కాసిన్ని నీళ్ల కాచి పాపకి పాలు కలిపేను.

పాలు ఫీడర్‌లో పోసి, పాపని వళ్ళోకి తీసుకున్నాను. బాగా ఆకలిగా వుందేమో గబ గబా పాలన్నీ తాగేసి నిద్రలో పడిపోయింది పాప.

మళ్ళీ ఆలోచనలు చుట్టు ముట్టేయి నన్ను. మేం ఈ వూరొచ్చి నెల రోజుల వాస్తోంది. వచ్చినప్పట్నుంచీ పని కుర్రాడ్ని చూసుకోవాలని అనుకుంటున్నాం, దొరకటం లేదు. పోనీ. ఈ సూర్యాన్ని మా ఇంట్లో వుంచేసుకుంటే—అనిపించింది. మళ్ళీ అనుమానం, ఆయనొప్పుకుంటారా అని. ఒప్పుకున్నా నేనే వాడితో డీల్ చేయగలనా అనీ భయం.

ఎప్పుడొచ్చారో ఆయన, పక్కనే చాప మీద కూచొని, భుజం మీద చేయి




వేసి, "ఏమిటోయ్ అదోలా వున్నావివాళ? పాప నిద్రపోయి ఎంత సేపయిందో! దాన్ని పడుకోబెట్టి నీళ్ల తోడతావేమోనని చూస్తున్నా" అన్నారు.

"ఓ సారీ! పదండి స్నానం చేద్దురు గానీ" అని పయికి లేచాను.

నా ఆలోచనల్లో నేనుండగానే భోజనాలు అయిపోయినయ్. బాబుకీ, ఆయనకీ పక్కలు సరిజేసి, పాప పక్కన సర్దుకుని పడుకున్నాను. ఆయనేదో చదువుకుంటున్నారు.

ఎంతకీ నిద్ర పట్టేలా లేదు. ఆయన్తో విషయం చెప్పేయందే నాకు తోచదు. మెల్లిగా లేచి వెళ్ళి ఆయన కెదురుగా టేబుల్ మీద కూచున్నాను. అలా వచ్చానంటే ఏదో చెప్పటానికేనని తనకి తెలుసు.

"చెప్పు" అన్నట్లు నవ్వుతూ చూశారు.

"మరేనండి, ఇవాళ పార్కులో శరణాలయం పిల్లలొస్తే, వాళ్ళ మేట్రన్ గారితో పరిచయం అయింది. వాళ్ళలో ఒక మూగ కుర్రాడున్నాడు. పన్నెండేళ్ళ వయసు వుండొచ్చు. పేరు సూర్యం. చక్కగా, ఆరోగ్యంగా ఉన్నాడు. అన్ని పనులూ చేస్తాడుట. మన మెలాగా సర్వెంట్ కోసం వెతుకుతున్నాంగా? వాడ్ని పెట్టుకుంటే బాగుంటుందేమోనని ఆలోచిస్తున్నా."

నేను మొదలు పెట్టానంటే, చివరంటా చెప్పందే వదల్నని ఆయనకి తెలుసు. అందుకనే పెదవి కదపకుండా అంతా విని, అంతేనా అన్నట్లు చూశారు. "అబ్బ ఇంట్లో కూడా ఆఫీసర్ పోజేనా?" అనుకుని నవ్వుకున్నాను.

తను మాత్రం ఒక్క నిమిషం ఆలోచించి అన్నారు. "నువ్వు ఈ విషయాన్ని

గురించి సాయంత్రం నించీ ఆలోచిస్తున్నావంటే, వాణ్ని చూసి బాగా మూవ్ అయినట్లు కనిపిస్తూంది. దాంతో ఏదో ఒకటి చేసి వాడికి సహాయం చేయాలని ఆరాటం. సరే చూద్దాం....నే రేపెళ్ళి మాట్లాడతా ఆ మేట్రన్‌గారితో. ఒక నెల రోజులు ట్రయల్ వేసి చూసుకో. సరిపోకపోతే పంపించేద్దాం.. సరే పద పద. ఆలస్యం అయిపోయింది. పడుకుందాం" అని, విషయాన్ని ఒక ముక్కలో తేల్చేసి, పక్క దగ్గరికి లాక్కెళ్ళారు.

ఇంతకీ ఇలా అటో ఇటో తేల్చి నిర్ణయించే భర్తే లేకపోతే, ఆడదాని జీవితమంతా డైలమాలకే సరిపోతుందేమో నవ్వించింది.

* * *

సాయంత్రం అయింది. శ్రీవారి కోసం ఆత్రుతగా ఎదురు చూస్తున్నా. ఇంతలో పాప, బాబు తగవు మొదలు పెట్టారు. పాప భలే మొండిది. ఇంత చిన్నదానికే అంతెత్తు ఏడుపు లంకించుకుంటుంది.

బాబుకో రెండు అంటించి, పాపని సముదాయించేసరికి స్కూటర్ చప్పుడు విన్పించింది.

గబ గబా వెళ్ళి తలుపు తీసాను. స్కూటర్ మీంచి దిగుతున్నా రాయన. ముందే దిగి ఇంటి వయిపూ, బయటికొచ్చిన నా వైపూ చూస్తూ నిలుచున్నాడు సూర్యం. ఆయన స్కూటర్‌ని పైకి తెస్తూండగానే, ఆత్రుతగా అడిగేను—

"ఏకంగా తీసుకొచ్చేసేరే? మేట్రన్‌గారేమిటన్నారు?" ఇంకా ఎన్ని ప్రశ్నలు వేసుందునోగానీ, "అవన్నీ నీకెందుకు లెద్దూ! నువ్వు చెప్పింది చేశానుగా. నిన్ను గుర్తుచేసి, నీ ఇంటికి అని చెప్పగానే ఎగిరిగంతేసి పరిగెత్తుకొచ్చేడువాడు. ఇంకేం అని తీసుకొచ్చేశాను" అని ఆయన నవ్వుతూ అనేసరికి, మారు మాట్లాడకుండా కాఫీ తెద్దామని వెళ్ళేను.

నా వెనకే ఇంట్లో అడుగు పెట్టిన సూర్యం వయిపు స్నేహపూర్వకంగా చూసేడు బాబు. నిన్న పార్కులో చూపిన గుర్తు ఇంకా ఉందల్లే వుంది వాడికి. సూర్యం మట్టుకు గబగబా వచ్చి, కింద కూచుని వున్న పాపని ఎత్తి చంకనేసుకున్నాడు. వాడి ఇష్టం చూస్తే, వాడు పాప కోసమే మా ఇంటికి వచ్చేడా అనిపించింది నాకు.

పిల్లలదీ, వాళ్ళ నాన్నగారిదీ భోజనం అయేక, సూర్యం నేనూ, భోంచేశాం. ఒక చాప, దుప్పటి ఇచ్చాను పడుకొమ్మని చెప్పి వాడికి.

రాత్రి మెల్లిగా అసలు విషయం బయట పెట్టారాయన.

"మీ రడగంగానే వప్పేసుకున్నారా? మేట్రన్ గారింకేం అనలేదాండీ?" అనడిగాను. "ఆఁ! అంత త్వరగా వప్పుకుంటుందా? చాలా గట్టి ఆవిడల్లే వుంది. అయినా ఆ మాత్రం గట్టితనం వుండాల్లే. 'వాడి కిక్కడ చదు వెలాగూ లేదు. మీ దగ్గరే కాస్త మంచి భవిష్యత్తు వుండవచ్చునేమోగానీ-మీరు బాగా ఆలోచించి నిర్ణయించుకున్నారా లేదా అని నా అనుమానం. వాడా మూగవాడు. చెబితే వినటఁవే కాని నోరు విప్పలేడు. చిన్నవాడు కదా మామూలుగా మెత్తగానే




వున్నా. ఎప్పుడో అప్పుడు కాస్త మొండి తనమూ వుంటుంది. పోనీ ఒక నెల రోజులు ట్రయల్‌గా తీసుకెళ్ళండి. నెల రోజుల తర్వాత కూడా వుంచుకోవాలని పిస్తే చెప్పండి, వాడి పేరు శరణాలయం లోంచి తీసేస్తాము. లేదా మీరు డీల్ చేయలేమనిపిస్తే, తిరిగి నాకు అప్పగిం చేయండి. నేనేమీ అనుకోను' అని చెప్పిగానీ పిల్లడ్ని పంపింది కాదు. మొదటి పరిచయంలోనే నిన్ను చూసి ఇంప్రెస్ అయిందిలా వుంది. అందుకే పంపింది. లేకపోతే అసలు సంపేసే కాదేమో!" అని ముగించారు.

'ఆవిడ ఆదుర్దాకి అర్థం లేదనిపిం చింది నాకు. పిల్లడు మంచివాడు. మాట్లాడ లేక పోతేనేం, చెప్పింది తెలుసుకు పని చేస్తాడు చాలదూ?' అన్పించింది నాకు.

కానీ ఆ అభిప్రాయాన్ని మేట్రన్‌గారి చ్చిన గడువు తీరేలోగా మార్చుకోక తప్ప లేదు. నా వయిపు నించే ఆలోచించి తీసుకున్న నిర్ణయానికి బలం ఎక్కడిది? ఆ కుర్రాడి వయిపు నేనేం ఆలోచించాను?

సూర్యం మెత్తనివాడే? చెప్పింది చెప్పినట్లు చక్కగానే చేసేవాడు. మాట రానివాడే అయినా, నా మూడ్స్ అర్థం చేసుకుని ప్రవర్తించేవాడు. అంత చిన్న వాడికి అంతమాత్రం సెన్స్ వుండటం గొప్పే. వాడున్న నెల రోజుల్లో జరిగిన మూడు ముఖ్యమయిన సంఘటనలవల్ల వాడు మా ఇంట్లో ఇమడలేడని అర్థమై పోయింది.

* * *

ఆ. వేళ మధ్యాహ్నం బాబునీ, సూర్యాన్నీ ఇంట్లో వుంచి, కాస్త పనుండి ఎదురింటికి వెళ్లాను. తిరిగొచ్చి నేను ఇంట్లో అడుగు పెట్టేసరికి, ఏం జరిగిందో గానీ, సూర్యం గట్టిగా బాబు వీపు మీదో దెబ్బ వేయటం, వెంటనే ఆ ధాటికి వాడు

కింద పడటమూ నా కళ్ళ బడింది. వెనకా ముందూ ఆలోచించలేకపోయాను. చెప్ప లేనంత కోపం వచ్చేసింది.

పట్టుమని సూర్యం చంపమీదో దెబ్బ వేసి, "వెధవా! చిన్నవాణ్ణి అంత దెబ్బ కొడతావా?" అని కళ్ళెరజేశాను. వాడు వద్దన్నట్లు చేతిని అడ్డుపెట్టుకుంటూ, వేలిని బాబువైపు చూపిస్తూ, చేత్తో తన చంప మీద కొట్టుకుంటూ ఏదో చెప్పాలని ప్రయ త్నిస్తున్నా నేను గమనించకుండా, వెంట వెంటనే వీపుమీదో నాలుగు అంటించాను. ఇటు దిరిగి ఏడుస్తున్న బాబుని తీసుకుని లోపలికెళ్ళాను.

నిదానంగా బుజ్జగించి అడిగితే అసలు విషయం బయటపెట్టాడు బాబు. తనేదో బొమ్మల పుస్తకం చూస్తుంటే, సూర్యం చూస్తానిమ్మని అడిగేడట. (ఈ పాటికే మా బాబుకి సూర్యంబాష అర్థమవు తూంది.) పీడివ్వలేదు. వాడు లాక్కు న్నాడు. కోపంవచ్చి వీశో దెబ్బవేశాడు. దాంతో వాడోటి వేశాడు. ఇదీ జరిగిన సంగతి, ఇద్దరూ పిల్లలే కొట్టుకోవటం సహజమేనని నాకూ తెలుసు. కానీ ఇద్దర్నీ సమంగా చూట్టానికి నా మనసు వప్పలేదు. సూర్యం స్థానం ఈ ఇంట్లో సర్వెంట్‌గా మాత్రమే. చిన్నవాడు బాబు కొట్టినంత మాత్రాన వాడూ చేయి చేసు కోవడమేనా అన్పించింది.

సూర్యం ఏడుస్తున్న శబ్దం వినిపిస్తే బయటికి తొంగిచూసాను. వాడి ఒళ్ళో పాప కూచుని, తన భాషలో తానేదో చెబుతూ, వాడికళ్ళు తుడుస్తూంది.

ఆ వేళ భోంచేయలేదు సూర్యం, నేనూ పిలవలేదు. సామానుగదిలో ఒక మూల తన చాపమీద కూర్చుండిపోయాడు. ఆయన వెళ్ళి పిలుస్తానంటే నేనే వద్ద న్నాను. "వాడికే అంత కోపం అయితే మనకెంత వుండాలి? ఒకపూట తినక పోతేనే, పుట్టి మునిగిపోయేదేం లేదు. వుండనీయండి. రేపు పొద్దున్న వాడేలేచి వస్తాడు" అన్నాను.

"ఏమో బాబూ నీ ఇష్టం వాడిష్టం. ఏమైనా చేసుకోండి" అని వూరుకున్నా రాయన.

నేనన్నట్లుగానే, ఉదయం వాడే లేచి వచ్చి తన పనులు తాను చేసుకుపోయాడు రాత్రి అన్నం లేక ఆకలిగా వున్నాడేమో. కాఫీయిచ్చి, రాత్రిది వాడిభాగం అన్నం పెడితే ఆవురావురుమని తిన్నాడు.

మరో రోజు .... ఆవేళ దీపావళి పండుగ, ముందురోజే బజారు వెళ్ళి పిల్లలిద్దరికీ కొత్తబట్టలు తెచ్చాను. ఆయ నేమో టపాకాయలు పట్టుకొచ్చేరు.

సాయం కొత్తలేశాను పాపకీ, బాబుకీ, వరండాలో నాన్నగారి దగ్గర కూచుని టపాకాయలు కాలుస్తున్నారిద్దరూ. దీపాలు అన్నీ చక్కగా అలంకరించటం, పిల్లల ముచ్చటని గమనించడం, మధ్య మధ్య గాలికి ఆరుతున్న దీపాల్ని వెలి గించటం—ఈ గొడవలో పడి, సూర్యం ఏం చేస్తున్నాడో గమనించలేదు నేను.

ఉన్నట్టుండి ఆయనే అడిగేరు— "సూర్యం ఏడీ కన్పించడేం?" అని.

అప్పుడు గుర్తొచ్చి, వాడికీ కొన్ని టపాకాయలిద్దామని ఇంట్లోకి వెళ్ళాను. ఇల్లంతా వెతికితే, స్టోర్‌రూంలో ముఖం దిగేసుకు కూచుని కన్పించాడు. "ఏమిట్రా

ఇక్కడున్నావ్? టపాకాయలు కొలుద్దురా?" అని పిలిచాను. తల ఎత్తి నా ముఖాన్నోసారి చూసి మళ్ళీ దించుకున్నాడు. "వీడొకడు! మనసులో ఏమంటుందో చెప్పలేడు. పోనీ! వీడ్నెవడు బ్రతిమాలుతూ కూచుంటాడు" అని విసుక్కుని వచ్చేశాను.

ఆ వేళకిక బయటికి రాడనీ, భోంచేయడని తెలుసు. వెళ్ళి చెప్పానాయనికి. "వాడి మనసులో ఏముందో తెలీదు. ముఖం ముడుచుకుని మూల కూచునున్నాడు ఎందుకనో" అన్నాను!

ఒక్క నిమిషం నా వైపు సాలోచనగా చూసి అన్నారాయన. "నే చెప్పనా ఎందుకో. వీళ్ళిద్దరికీ బట్టలు తెచ్చావ్. వాడికో జత చీప్‌వయినా తేవలసింది. అందుకే బాధ పడుంటాడు."

"సరిపోయింది! అన్నిట్లో వీళ్ళతో సమంగా కావాలంటే ఎలా కుదుర్తుంది? ఒకసారి చూస్తే వాడికే తన స్థానం అర్థమవుతుంది లెండి" అన్నాడు.

* * *

సూర్యానికి పుస్తకాలంటే తగని పిచ్చి. పనేదీ లేనప్పుడు, ఏదైనా పుస్తకం పుచ్చుకుని, చదువుతున్నవాడిలా అక్షరాల వయిపే చూస్తూ కూచునేవాడు.

ఒకరోజు పొద్దుటే—శ్రీవారు ఆఫీస్‌కి బాబు స్కూల్‌కి వెళ్ళిపోయాడు. పాప ఊయెలలో నిద్రపోతూంది. అదే గదిలోనే ఓ మూలగా కూచుని ఏదో పుస్తకంలో బొమ్మలు చూసుకుంటున్న సూర్యాన్ని భుజంతట్టి చెప్పాను. పాపని చూడమని, స్నానానికి బయల్దేరుతూ.

స్నానం చేస్తుండగానే పాప ఏడుపు విన్పించింది. సూర్యం ఉన్నాడుగా చూసుకుంటాడని తాపీగా ముగించాను. బట్టలు విడిచినవి బకెట్‌లో నానబెట్టబోతుండగా, దభీమని శబ్దం. వెంటనే పాప మరింత గట్టిగా ఏడవటం విన్పించింది. చేతిలో పని వదిలేసి, ఒకపరుగున ఇంట్లోకి వచ్చాను. పాప ఊయెల ప్రక్కన కింద పడిపోయి ఏడుస్తూంది. సూర్యమేమో ఇటు వయిపయినా చూడకుండా తన పుస్తకంలో నిమగ్నమయి వున్నాడు. ఈ పరిస్థితి చూసేసరికి నాకు కోపంతో వళ్ళు తెలిసింది కాదు. పాపనెత్తి చంకనేసుకుని, సూర్యందగ్గర కెళ్ళి, చేతిలోవున్న పుస్తకాన్ని లాగి, చెంపమీదో పెట్టుపెట్టాను—"వెధవా! ఏమిట్రా అంత మునిగిపోయే చదువు? పిల్లని చూస్తుండమని చెబితే, అది కింద పడిపోయి ఏడుస్తున్నా అటు వయిపయినా చూడకుండా చదువు వెలిగిస్తున్నాడు. అక్షరం ముక్క రాదుగానీ, అంతా జోరే ఈ దిక్కుమాలిన వాడికి" అని నేనేం మాట్లాడుతున్నానో కూడా ఆలోచించకుండా అనేశాను.

వాడు బిత్తరపోయి నా వయిపు చూసాడు. చంకలో ఏడుస్తున్న పాపని చూసి బిక్కమొహం వేశాడు. వాడి ముఖం చూస్తే నేవేసిన దెబ్బలే కానీ, నేనన్న మాటలు ఒక్కటీ అర్థం అవలేదని తెలుస్తూంది. అప్పటిగ్గానీ గుర్తు రాలేదు నాకు-వాడు మూగవాడే కాకుండా చెవిటివాడు కూడా అని. మాట్లాడేటప్పుడు (అదైనా) నిదానంగా మన పెదాలవయిపు చూస్తేతప్ప ఏం చెబుతున్నదీ తెలుసుకోలేడు. అలాంటప్పుడు ఈ వయిపయినా

తలతిప్పని వాడికి పాపకింద పడటం ఏం తెలుస్తుంది? ఇంత ఆలోచనా వచ్చేక అనిపించింది, వాడ్ని అనవసరంగా కొట్టేనని.

నేను తేరుకుని చూసేసరికి, పాప ఏడుపు మానేసి మళ్ళీ నిద్రపోతోంది. సూర్యం ఎదురుగా కనిపించలేదు. ఎక్కడున్నాడని ఇల్లంతా వెతికాను. కన్పించ లేదు, గుండె గుభేలుమంది, ఇంతకు ముందు తనకు కోపం వస్తే గదిలో ముడుచుకు కూచోవటం, ఒక పూట భోజనం మానెయ్యడమే కానీ ఇలా ఇంట్లోంచి పారిపోలేదు. గాభరాగా వరం రాలో కాంపౌండ్‌లో అంతా వెతికాను.

శరణాలయానిగ్గానీ వెళ్ళిపోయాడేమో వెళ్ళి కనుక్కుందామా అన్పించింది, కానీ ధైర్యం చాల్లేదు. తీరా వెళ్ళేక వాడక్కడ లేకపోతే, మేట్రన్ గారికేం చెప్పను? అయినా అక్కడి కెళ్ళుంటాడని నాకంత అన్పించటం లేదు కూడా. మా ఇంటి నుంచి అక్కడికి చాలా దూరం. ఒకటి రెండుసార్లు పార్కుకి రాగా చూచిన దారే కానీ, వాడి కంత బాగా గుర్తుండదు. ఎవరి నయినా అడిగి తెలుసుకుందుకు మాటరాని వాడు. అక్కడికే వెళ్లుండ దేమో అన్పించేసరికి మరింత భయం వేసింది నాకు. ఏమయిపోయుంటాడోనని. రోజంతా భోజనం లేకుండా ఆలోచనల్తో సతమతమవుతూ గడిపాను.

సాయంత్రం ఆయన రాగానే, భయ పడుతూ నేచెప్పాను జరిగింది. నిర్లిప్తంగా విని "అయితే అదీ అయిందన్న మాట. పోనీ కాస్త కాఫీ ఇవ్వు. వెతికొస్తాను నాలుగు వీధులూ తిరిగి" అన్నారు.

రాత్రిదాకా వెతికారు ఆయన. కానీ ప్రయోజనం లేకపోయింది. భోజనం చేశాక—"నే నో మాట చెబుతాను చూడు. నువ్వనవసరంగా బెంగ పడుతు న్నావ్, వాడెక్కడున్నా పొద్దుటికి వచ్చే స్తాడు. నా మాట నమ్ము. ఎంత కోపం వున్నా, నీ కోసం, చివరికి పాప కోస మయినా రాకుండా వుండలేడు. నువ్వంటే వాడి కెంత అభిమానమో నీకు తెలీదు" అన్నారు నింపాదిగా.

నన్ను ఊరడించడానికే అట్లా అంటు న్నారనుకున్నానుగానీ, ఆయన అన్నట్లు నిజంగానే, వుదయం ముందు తలుపు తెరిచేసరికి వరండాలో తల వంచుకుని కూచుని ఉన్నాడు సూర్యం. ప్రాణం లేచొచ్చింది నాకు. చంకలో వున్న పాప గబుక్కున కిందికి దిగి, సూర్యం దగ్గరి కెళ్ళి, వళ్ళో కూర్చుండిపోయింది.

పై సంఘటన జరిగిన రెండు రోజులకి కాబోలు మేట్రన్ గారిచ్చిన గడువు అయి పోయింది. చివరి రోజుని అడిగారాయన "ఊఁ! రేపెళ్ళి మేట్రన్‌గారికి చెప్పాలి. మరేమని నిర్ణయించుకున్నావ్?" అని నవ్వుతూ.

నాకు ఏం చెప్పాలో తోచలేదు. శరణాలయంలో సూర్యానికి ఉన్న ఆశ్ర యాన్ని శాశ్వతంగా పొగొట్టి, ఇంట్లోనే ఎప్పటికీ భరించగలనా అని అనుమానం. అట్లాగని వాడ్ని వదులుకోవటం అసలే ఇష్టం కాదు. అయోమయంగా ఆలోచిస్తూ వుండిపోయాను.

మెల్లిగా తనేం అనుకుంటున్నారో బయట పెట్టారు శ్రీవారు. "చూడయ్యేవ్! నువ్వు బాధ పడనంటే నేనో మాట



చెబుతాను...." అని నా సమాధానం కోసం చూడకుండానే సాగించారు: "సూర్యం మన ఫేమిలీనుంచీ, ముఖ్యంగా నీనించే కోరుకుంటున్నది వేరు; మనం వాడి కీయగలుగుతున్నది వేరు. వాడు పెరిగింది అనాధ శరణాలయంలో, వాడి కర్థమయ్యే భాష చాలా పరిమితం. ఆ వయస్సుకి సర్వెంట్ కీ, మామూలు పిల్లలకీ వున్న భేదం వాడికి తెలీదు. శరణాలయం నించీ, నీ దగ్గరికీ, మనింటికీ అనగానే వాడు పరుగెత్తి వచ్చింది, మనం చెప్పింది పూర్తిగా అర్థమయి కాదు. మన ఫేమిలీలో ఒక మెంబరుగా రావటమేనని వాడికి తోచి వుంటుంది. ఈ నెల్లాళ్ళ వాడి ప్రవర్తనలో నాకు అర్థమయిందేమిటంటే వాడు నీకు పెద్ద కొడుకుగా అయితే మాత్రమే ఈ ఇంట్లో ఎడ్జస్టు అవగలడు. కానీ వేరే విధంగా మాత్రం కాదు. అందుకనే మన బాబు ముందు తనని తక్కువ చేస్తే చాలా బాధ పడ్డాడు. తనని ప్రేమించే అమ్మా, నాన్న, తమ్ముడూ, చెల్లాయి ఇదీ వాడు కోరుకున్న జీవితం....నా మనసుకితోస్తున్న దిది. ఎట్లు నిర్ణయించుకున్నా నాకేం అభ్యంతరం లేదు. ఎందుకంటే సర్దుకు పోవలసిందానివి నువ్వు" అని చెప్పి తను చెప్పాల్సిందయిపోయినట్లు తలగడా సర్దుకుని, పడుకున్నారు.

*　　*　　*

మరుసటు రోజే సూర్యాన్ని శరణాలయంలో వదిలెయ్యమని వారితో పంపించేశాను. వాణ్ని మా ఇంటికి తీసుకురావటం ద్వారా, వాడికో అర్థం లేని ఆశ కల్పించానని, ఆఖరికి వాడి చిన్న మనసుని గాయం చేశాననీ నాకు తెలుసు, కానీ....కానీ....ఆ మూగ సూర్యాన్ని-దిక్కు మొక్కు లేనివాణ్ని నా కొడుకుగా స్వీకరించేంత, త్యాగాన్ని చేయగల శక్తి నాకు లేదు. అందుకనే వాడిపై కాస్త అభిమానమయితే వున్నా, వదులుకోక తప్పలేదు. □

# తెరచాటు

సునీత అరగంట నుంచి అద్దంముందు నిలబడి బ్లౌజు సర్దుకుంటోంది. ముందుకు లాగినా, వెనక్కి తోసినా కిందకి సర్దినా, ఏం చేసినా పల్చగా, అందంగా సూటిగా బయటకి చూస్తూనే వుంది. మోకాళ్ళ వరకు వున్న పింక్ స్కర్టుమీద లేతగులాబీ రంగు విదేశ బట్టతో కుట్టిన అధునాతనమైన ఆ జాకెట్ ఎలా అమర్చుకోవాలో తెలీడంలేదు. లోపల బాడీ బిగించినా పొంగివస్తున్న యవ్వనం పోటీ పడుతూనేవుంది.

సునీత అవస్తపడుతోంది. ఆమె పెద్దమనిషై రెండేళ్ళు దాటుతోంది. సీనియర్ యింటర్ పరీక్షలు వ్రాసింది. ఆమె యింతవరకు మినీస్కర్టులే వేస్తోంది. అణచలేని అందాన్ని వెన్నె లారబోస్తూ వుంది.

వసుంధరకి కూతురు పరికిణీ, ఓణీలు వేసుకోవడం యిష్టం వుండదు. తన కూతురు పెద్దగా, ఆరిందాలా కనిపిస్తే ఆమెకి బాధగా వుంటుంది. అందులో ఆమెకి తన వయసు కనిపిస్తుందేమో! ఆ తల్లి దృష్టిలో సునీత ఎప్పుడూ పధ్నాలుగేళ్ళ బాలిక- అంతే—

సునీతకి ఈ విషయంలో యిదీ అని ఒక అభిప్రాయం లేదు. కొన్ని విషయాల్లో అమ్మమాట వినకపోయినా, డ్రస్సు విషయంలో మాత్రం తు.చ. తప్పకుండా వింటుంది! తను గంతు లేసినా, పరుగులు పెట్టినా ఎవరితోఎలా షికార్లు కొట్టినా అమ్మ అడ్డుచెప్పదు. తనొక చిన్నపిల్ల అన్నట్లు వ్యవహరిస్తుంది. తనతోటిదే రాజలక్ష్మి. అమ్మో! వాళ్ళమ్మ ప్రతీదాన్ని సాగలాగి దుంపతెంచుతుంది. ఎప్పుడూ పరికిణీ మీద ఓణీ వేసుకోవల్సిందే. ముచ్చటకైనా మరోమాట మాట్లాడితే వూరుకోదు. తనకా విషయంలో హాయి—, నెలకి మూడు రోజులు కాస్త జాగ్రత్తగా డ్రస్ చేసుకుంటే చాలు—, అయినా అప్పటికి కావలసిన సలహాలు, సరంజామా అమ్మ ఎప్పుడూ సిద్ధంగా వుంచుతుంది—ఇదీ సునీత ఆలోచన. అందుకే ఆమె తల్లి చెప్పినట్లే డ్రస్ చేసుకుంటుంది—

అయితే అనుకోకుండా సునీతలో చిత్రమైన మార్పు వచ్చింది—, అదీ, నాలుగురోజుల క్రితం—

* * *

ఆ రోజు సునీత, రాజ్యం కలిసి సినిమా ప్రోగ్రాం వేసుకున్నారు. వసుంధర ఎప్పుడూ పెద్దగా అభ్యంతరం పెట్టదు. కారణం ఆమెకి రాజ్యలక్ష్మి అంటే యిష్టమే.

ఆ అమ్మాయి ఫస్టుక్లాసు స్టూడెంట్. అందుకే అప్పుడప్పుడు

"పల్లెటూరి వాలకమైనా బుర్ర పదునైనదే" అంటూ కామెంట్ చేస్తూ వుంటుంది.

సునీత సినిమా టైముకి కారు పంపమని వాళ్ళ డాడీకి చెప్పింది. ఆయనలాగే పంపారు.

సునీత "అమ్మా నువ్వూ రావే" అంది.

నిజానికి సునీత తల్లి రావాలని అడగలేదు. తనూ, రాజ్యం కనిపించిన ప్రతీ

పరికిణీలు తీసి ముందు మంచం మీద పడేసి "సునీ, ప్లీజ్, ఏది కట్టుకోనో చెప్పు. క్విక్, ఒన్ మినిట్‌లో చెప్పాలి" అంది జాకెట్ గుండీలు టప టప లాగేస్తూ.

ఎర్రటి ఎరుపు మీద ఆకు పచ్చ జరీ అంచు—తెల్లటి తెలుపు, ఎర్రటి జరీ-ముదురాకుపచ్చ మీద జరీ బుటా-పసుపు పచ్చ నల్లటి జరీ.—

ఎర్రటి పరికిణీ తీసి రాజ్యాని కిస్తూ

కుర్రాడినీ ఏడిపించటానికి, ఉడికించటానికి వీలుండదు తల్లివుంటే.—, అయినా వూరికే అడిగింది.

వసుంధర కూడ చిన్నపిల్లలతో బయలుదేరదు. అందుకే రానంది.

సునీత హుషారుగా కారెక్కింది. అయిదు నిముషాల్లో కారు రాజ్యం ఇంటి ముందు ఆగింది. రాజ్యలక్ష్మి చక్కగా ముస్తాబై వుంది. వొదులుగా జడ, మెరుస్తున్న ఎర్రరాళ్ళ దుద్దులు, కళ్ళకు సన్నగా కాటుక, తీర్చిన బొట్టు. బట్టలు మాత్రం మార్చుకోలేదు. సునీతని చూపి ఎగిరి గంతేసింది.

"అబ్బ! ఇంత ఆలస్యమా! నీ కోసం చూసి, చూసి, యింక రావేమో అనుకుంటున్నా" అంది గారంగా.

"ఎంత సేపూ నా మీదే నీ ఏడుపు. నువ్వెంత రెడీగా వున్నావో చూడు! ఆ బట్టలూ, ను వ్వా నూ" అంటూ దబాయించింది సునీత.

"ఎంత ఒక్క క్షణం" అంటూ పరుగెట్టబోయి సునీత చెయ్యి పట్టుకుంది.

"ఓ మై గాడ్! అప్పుడే ఆరై పోతోంది" అంటూ రాజ్యలక్ష్మిని అనుసరించింది సునీత.

మేడమీద గదిలోకి లాక్కుపోయింది రాజ్యం. బీరువా తీసి అందులోంచి నాలుగు పట్టు



# నవజీవన పథంలో

గత సంవత్సరం నవంబరులో శనివారం కాళరాత్రి మున్నెన్నడూ కనీ వినీ ఎరుగని విధంగా తుఫాను బీభత్సానికి గురైన దక్షిణాది ధాన్యాగారం ఆ విధ్వంసకాండనుంచి ఇప్పుడిప్పుడే తేరుకుంటున్నది. తుఫాను బాధిత జిల్లాలలో సుమారు 36.04 లక్షల ఎకరాలలో పంటలు పాడయ్యాయి.

సహాయ కార్యక్రమాల అమలులో వ్యవసాయదారులకు అత్యధిక ప్రాధాన్యం ఇచ్చి దాదాపు 7.75 కోట్ల రూపాయలు కేటాయించారు. దెబ్బతిన్న ప్రతి పొగాకు బ్యారెన్‌కు 500 రూపాయల వంతున సబ్సిడి ఇస్తారు. తుఫాను బాధిత ప్రాంతాలలో సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థ తరహాలో కోళ్లు, పందులు ఇవ్వడంతోపాటు సేద్యానికి ఉపయోగపడే పశువులు, పాడి పశువులు కూడా సరఫరా చేస్తారు.

ఉప్పెన దెబ్బతిన్న ప్రాంతాలలోని విద్యార్థులు ప్రత్యేక ఫీజు, పరీక్ష ఫీజులు చెల్లించనవసరం లేకుండా చేశారు. పాఠ్యపుస్తకాలను ఉచితంగా సరఫరా చేయడానికి ఏర్పాట్లు చేశారు.

తుఫానువల్ల మత్స్య పారిశ్రామికులు కోల్పోయిన పడవలకుబదులు కొత్తవాటి కొనుగోలు, దెబ్బతిన్న వాటి మరమ్మత్తుల నిమిత్తం కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి, నెల్లూరు, ప్రకాశం, విశాఖపట్నం జిల్లాల కలక్టర్ల అధీనంలో 1.28 కోట్ల రూపాయలు ఉంచారు.

చేనేత పనివారికి సహాయంలో భాగంగా 1.62 కోట్ల రూపాయలు మంజూరు చేశారు. తుఫానుకు గురైన చేనేత కార్మికులు ఒక్కొక్కరికి 100 రూపాయల ఖరీదుచేసే నూలుతోపాటు మగ్గాల మరమ్మత్తు నిమిత్తం 150 రూపాయల వంతున సహాయం అందజేస్తారు.

---

డైరెక్టరు: సమాచార, పౌరసంబంధ శాఖ, హైదరాబాద్.

36/77-78




"యిదిగో త్వరగా" అంటు తొందర చేసి, పక్కనే వున్న తెల్లటి పట్టు పరికిణి చేత్తో సున్నితంగా తాకుతూ "ఇది చాలా బాగుంది రాజీ" అంది. ఆ అనడంలో ఎంతో ఆడతనం, ఎంతో నాజూకుతనం వుంది. అటు తిరిగి జాకెట్ మార్చుకుంటున్న రాజ్యం చటుక్కున భుజాల మీదుగా వెనక్కి తిరిగి చూసింది. జాకెట్ చివరి హుక్ పెట్టేసి సునీత వైపు తిరిగి ఆమె భుజాల మీద చేతులు వేసి "డియర్ సునీ—ఈవేళ నే చెప్పినట్లు వినాలి—అంటే నువ్వీ లంగా ఓణి వేసుకో- ప్లీజ్, నీకెంతో బాగుంటుంది. ఇద్దరంకలిసే ఒకేలా వెళ్దాం, ఏం? సునీ యూజ్ఎ గుడ్ గరల్" అంటూ తొందరచేసింది.

సునీతికి మనసులో వేసుకోవాలని వుంది. ఎప్పటి నుంచో మనసులో వున్న కోరిక, ఆ అనుభవం తనకి కొత్త. ఒక్కసారి వేసుకుందామనే వుంది. అయితే అది రాజ్యంది. అయినా రాజ్యం పరాయిది కాదు. తన ప్రాణ స్నేహితురాలు. ఇద్దరి మధ్యా అసలు తేడా లేదు. దాని బట్టలు తను వేసుకుంటే తప్పేమి లేదని పించింది. సునీత ఆలోచన తెగకుండానే- - "క్విక్ సునీ, టైము చూడు" అంటూ కంగారు పెట్టేసింది రాజ్యం.

సునీత బట్టలు మార్చుకుంది. మెత్తగా అందంగా ఓణి గుండెల్ని కప్పుతుంటే సునీతకు కొత్తగా, చిత్రంగా అనిపించింది. తన గుండెలు పల్చటి వల్లెవాటులోంచి చూస్తే అందంగా హుందాగా వున్నట్లనిపించింది. వక్షస్థలం మీద సుతారంగా కదిలిన ఓణి గిలిగింతలు పెట్టింది. ఆ గిలిగింతలు గుండెలో కూడ కలవర పెట్టాయి. చేత్తో రెండు మూడు సార్లు ఓణి సర్దుకుంది. మేలి ముసుగులోంచి ముగ్ధమోహనకాంత ధైర్యంగా కళ్ళెత్తి చూసినట్లు సునీతలోని యవ్వనం ధైర్యంగా పొంగింది, ఆమె బరువుగా వూపిరి తీసుకుంది.

ఎంతో ఎత్తుగా, పొడుగ్గా, దిద్దిన బొమ్మలా వుండే సునీత ఆ దుస్తుల్లో అప్సరసలా వుంది. రాజ్యం అదే అంటూ బుగ్గ మీద చిటికె వేసింది.

ఇద్దరూ సినిమాహాలు చేరారు. సుధీర్, చంద్ర టిక్కెట్లు తీసుకుని రెడీగా వున్నారు. "మిమ్మల్ని ఎవరు టిక్కెట్లు కొనమన్నారు?" అంటూ దెబ్బలాడటం మొదలెట్టింది రాజలక్ష్మి. సుధీర్ ఆమెకి ఎలాగో సర్ది చెప్తున్నాడు—

"నో—ఐ డోంట్ ఎగ్రీ" అంటోం దామె. చంద్రం మాత్రం మాటలు మర్చి పోయినవాడిలా నిలబడిపోయాడు.

సుధీర్ చిట్ట చివరికి "పోనీ డబ్బు లిచ్చేయ్" అన్నాడు విసిగి. అంతా నవ్వు కున్నారు. అంతవరకు సునీతని రెప్ప వెయ్యకుండా చూస్తున్న చంద్రం వులిక్కి పడి వాళ్ళ నవ్వులతో శ్రుతి కలిపాడు.

చంద్ర తననే పరీక్షగా చూడటం సునీత గ్రహించినా, అతనెందుకలా చూశాడో అర్థం కాలేదు.

కాని అతనలా తనలోకి చూస్తుంటే తనకెందుకో గర్వంగా అనిపించింది. రోజూ దాపరికం లేకుండా వుండే తను యీ రోజు ఈ తెరచాటుతో ఎంతో కొత్తగా అయిపోయింది. మనసూ తనువూ నిండుగా వున్నట్లనిపించింది! సునీతకి ఆ రోజంతా కొత్తగా మరో ప్రపంచం లోకి అడుగు పెట్టినట్లుగా అనుభూతి పొందింది. తల్లి తనని ఎంతో అధునాత నంగా వుంచినా తనలో నరనరాల్లో జీర్ణించుకుపోయిన ఆచారాన్ని తుడిచి వెయ్యలేక పోయింది—ఇలా కాకుండా మరోలా తనుండలేదనిపించింది.

అమ్మ శాంతాఆంటికి ఫోన్‌చేసి తనకి కారుడ్రైవింగ్ నేర్పటానికి చంద్రని రమ్మంది. చంద్ర గంటలో వస్తాడు మళ్ళీ యీ మినీస్కర్టుతో అతనిముందు కెళ్ళా లంటే ఎంతో సిగ్గుగావుంది—

అమ్మతో తనకి పరికిణీలు కొనమని గొడవచేసింది.

"చాల్లే ఆరిందాలా, ఇప్పుడేం కంగారు వెధవ ముసలిడ్రస్సులూ నువ్వూ-నీ కెప్పు డేది కొనాలో నాకు తెలుసు. నువ్వేమీ చెప్పకు" అని కసిరి—ఒక్క క్షణం ఆగి.

"ఏం ఎవరేనా అన్నారా" అంది.

ఆ మాటకి సునీతకి చర్రున కోప మొచ్చింది.

"ఎవరూ చెప్పకపోతే నాకే అనిపించ కూడదా" అంది విసురుగా—

వసుంధర తేలిగ్గా శ్వాసవదిలి "మరేం మించుకుపోలేదులే—నే చెప్పినట్లు విను" అని తోసిపారేసింది.

* * *

చంద్ర పదినిముషాల్లో వచ్చేస్తాడు. తను అతనిముందుకెలా వెళ్తుంది—

అద్దం ముందు సునీత అలాగే కూర్చుంది. తెల్లని ముత్యాలదండ గుండెల మీదకి జారి, రెండూ, ఒకటిగా గుండెల మధ్యకి మెలికపడి మెరుస్తున్నాయి. పల్చటి బ్లౌజు గాలికి రెపరెపలాడుతోంది.

"హల్లో! రెడీయేనా" అంటూ చంద్ర రానే వచ్చేశాడు—

సునీత తత్తరపడింది సిగ్గుతో మనసు కుంచించుకుపోయింది. అనుకోకుండా సునీత రెండు చేతులు 'యింటూ'లా భుజంమీద చేర్చి గుండెలు కప్పుకుని అతని వైపు తిరిగింది. □



# అందరూ శత్రువులేనా?

"శ్రీదేవిగారూ.... మీరిలా రోజూ ఆల

శ్యంగా వస్తే ఎలా చెప్పండి? ఎప్పు డైనా ఆఫీసరుగారి కళ్ళల్లో పడితే మీతో పాటు నాకూ ముప్పే, సరిగ్గా చెకింగ్ చేయటంలేదని." హెడ్‌క్లార్కు విసుక్కుంటూ అటెండన్స్ రిజిష్టరు ముందుకు తోశాడు.

"సారీ సర్...." గొణుక్కున్నట్టుగా అని సంతకం పెట్టింది శ్రీదేవి.

"ఎన్ని తప్పులున్నా ఒక్క సారీతో సరి. సాయంత్రం అయిందంటే ఒక్క నిముషం సీట్లలో ఉండరు కదా. మరి ఆ తొందర పొద్దున్న రావటానికి ఎందుకుండదు?"

"పొద్దున లేచిన దగ్గరనుండి తొందర పడి పరుగులిడుతూ వుంటేనే ఇప్పటికి తెమిలింది. తొందరెందుకుండదు సార్....?" అందామనుకుంది కాని అన లేకపోయింది. 'అతనికింకా కోపం వస్తే రేపటినుండి ఈ మాత్రం ప్రివిలేజ్ కూడ ఉండదు. రిజిష్టరు ఆఫీసరుగారి దగ్గరకు పంపించేస్తాడు' అనుకుంటూ ఉస్సురని సీట్లో కూర్చుంది.

నాలుగు కాగితాలు చూచేసరికి విపరీతమైన తలనొప్పి. అప్పుడు జ్ఞాపకం వచ్చింది, ఉదయం సరిగ్గా కాఫీ త్రాగ లేదని. మిల్క్‌బూత్‌నుంచి పాలు తేవటానికి పిల్లను పెట్టింది. రోజూ సీలులేని సీసాలే వచ్చాయంటూ అక్కడ పెట్టేసి పోతుంది. అవి వట్టినీళ్ళు. కాఫీ కలవదు, పెరుగు పెట్టిగా తోడుకోదు. ఫ్యాన్ కని పిస్తాడేమోనని యిటూ అటూ చూచి కాంటీన్‌కు బయలుదేరింది కాఫీ త్రాగటానికి.

"ఏమిటండీ శ్రీదేవిగారూ, వస్తూనే కాంటీన్‌కు వెళ్ళిపోతే ఎలాగ? బోలెడు పేపర్సు పెండింగ్ ఉండిపోయేయి" సెక్షన్ హెడ్ హెచ్చరిక.

అతను అరగంటకోసారి సిగరెట్ కాల్చుకోవాలంటూ లేచి పావుగంట వరండాలో హస్కు వేసినప్పుడు లేదు. మారు మాట్లాడకుండా పనిలో మునిగి పోయింది.

* * *

"ఏమిటోయ్ మన హెడ్డుగారు పొద్దున్నే సణుగుతున్నాడు?" లలిత అడి గింది.

"ఏముందీ....ఆలస్యం అయిపోయిందని" శ్రీదేవి జవాబు.

"ఈ రోజు మా పనిమనిషి రాలేదు. ఒకటీ ఒకటీ వస్తువులు కడుక్కుని ఉరుకులతో పరుగులతో వంట పూర్తి చేసేసరికి....తింటానికి టైమ్‌లేదు. ఈ కాంటీన్ గడ్డితిని సాయింత్రం వరకు ఏడవాలి...." లలిత కళ్ళల్లో నిజంగా నీళ్ళు.

"ఈ రోజు లేస్తూనే మా తోడికోడలికి తలనొప్పి, నడుంనొప్పి అన్నీ వచ్చేశాయి. వాళ్ళ పిల్లల్ని, మా పిల్లల్ని బడికి పంపించి అన్నీ తెముల్చుకుని వచ్చేసరికి బస్సు మిస్సయింది. చచ్చినట్టు రెండు రూపాయలు పెట్టి రిక్షాలో వచ్చేను."

సమిష్ఠి కుటుంబంలోని లక్ష్మి బాధ అది.

"ఏమిటో మన ఉద్యోగాలూ మనము. ఇటు యింట్లోను సరిగ్గా చూసుకోలేము. అటు ఆఫీసులో పనికి న్యాయం చేకూర్చలేము." నిట్టూర్చింది శ్రీదేవి.

"ఏమిటోయ్. చీర చిరిగిపోయినది కట్టుకుని వచ్చేశావు" అప్పుడే ప్రవేశించిన కౌముదిని చూచి అడిగింది లలిత.

"ఏమి చెయ్యటం? ఆదివారం ఒంట్లో బాగాలేదని బట్టలరేవు పెట్టలేదు. చాకలికి వేసిన రెండు చీరలలో ఒకచీర గతియిది. అసలు తొందరలో చూసుకోకుండా కట్టుకుని వచ్చేశాను" కౌముది జవాబిచ్చింది.

"ఇంకా నాయమే. అదైనా తీసుకుని వచ్చేడు. మా చాకలి బట్టలు పట్టుకెళ్తే మళ్ళీ నెలనాడే దర్శనం. ఆదివారం పూర్తిగా యిదే పనయిపోతూంది. ఓ సినిమాలేదు. షికారులేదు" శ్రీదేవి ఉవాచ.

"ఈ గొడవలెప్పుడూ ఉండేవే. టైమయిపోయింది. పదండి" లక్ష్మి అనేసరికి అందరూ లేచారు.

* * *

పిటీ సర్వీసులో ఒంటికాలు తపస్సు చేసి, రాపిడి, తోపుళ్ళతో వళ్ళంతా ముద్ద చేసుకుని, ఇంటి మొగలోన్న కొట్లో కూరలు తీసుకుని యిల్లు చేరుకుంది శ్రీదేవి.

కరకర ఆకలివేస్తూంది.

వంటంతా అయి, పిల్లలు, పెద్దలు తినేసరికి ఆకలి చచ్చిపోతుంది. ఇంటికి వెళ్ళగానే ఎవరైనా కాస్త టిఫిను, కాఫీ యిస్తే బాగుండును అనుకుంటూ యిల్లు చేరుకుంది.

"వచ్చేవా తల్లీ. నీకోసమే చూస్తున్నాను. పక్కింటి కామాక్షమ్మ శంకర మఠానికి వెళ్తూంది. ఈ ముసలికాలంలో కాస్త కృష్ణారామా అనుకో బుద్ధివేస్తూంది. నే వెళ్ళొస్తా...." అత్తగారు యింత ముఖంచేసుకుని చెప్పారు.

శ్రీదేవికి మరింత నీరసం ముంచుకుని వచ్చింది.

"చూడు....డికాషన్ వుంది. కాఫీ కలుపుకుని త్రాగు కావాలంటే-రొట్టెల పిండి కలిపి వుంచాను, నేనొచ్చేక చేద్దువుగాని. లేకుంటే చల్లారిపోతాయి. ఆ....అన్నట్లు .... చంటాడు గదిలో బయటకెళ్ళాడు. కొంచెం శుభ్రం చేసే

సుకో...." వెళ్ళిపోతూ సెలవిచ్చారు అత్తగారు.

"అమ్మొచ్చింది...." అంటూ చుట్టూ చేరిన పిల్లలను కసితీరా కొట్టాలనిపించింది. అంతవరకు ఎక్కడెక్కడ ఆడుతున్నవాళ్ళు తనొచ్చేసరికి వచ్చేసి విసిగించేస్తారు.

ఎలాగైతేనేం? పనంతా ముగించుకుని బయటపడేసరికి పెద్దమ్మాయి తయారు.

"అమ్మా! ఈ లెక్క రావటంలేదు."

"మీ టీచర్నడుగు "

"హోంవర్కిచ్చారమ్మా. రేపు చేసి చూపించకపోతే దెబ్బలాడతారు."

'ఈ టీచర్లు వాళ్ళకురాని లెక్కలన్నీ హోంవర్కు యిచ్చేస్తారు కాబోలు.'

దాని కెలాగో చెప్పి చంటాడ్ని పడుకోబెట్టి, బస్‌స్టాప్‌లో సగం చదివిన పుస్తకం తీయబోయింది.

"ఇంకా చదువేమిటి? లైటార్పు.... శ్రీవారి హుంకరింపు.

"అబ్బ. ఈ రోజు వంట్లో ఏమీ బాగా లేదండీ. నీరసంగా వుంది...." శ్రీవార్ని వారించబోయింది.

"నా దగ్గరకొచ్చేసరికి నీకు నీరసాలు. అన్నీ ముంచుకుని వస్తాయి. ఏ నాడూ కాస్త నవ్వుతూ దగ్గర చేరవు కదా...."

శ్రీదేవి నవ్వింది.

ఆ నవ్వులో జీవం లేదు. ప్రపంచాన్ని చూచి హేళనవుంది. రక్తిలేదు. విరక్తి వుంది.

చిన్నకునకు పట్టబోతూ వుంటే 'కఁయ్యి'మని లేచిన చంటాడ్ని దగ్గరకి తీసుకుంటూ అనుకుంది.

"ఆడదానికి అందరూ శత్రువు లేనా?" □

---

# శ్రీశ్రీ నిర్వహించు పదబంధ ప్రహేళిక

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | ■ | 4 | 5 | | 6 |
| | ■ | 7 | | | | | ■ | |
| 8 | 9 | ■ | | ■ | | ■ | 10 | |
| 11 | | | ■ | 12 | ■ | 13 | | |
| ■ | | ■ | 14 | | | ■ | | ■ |
| 15 | | | ■ | | ■ | 16 | | 17 |
| 18 | | ■ | 19 | ■ | 20 | ■ | 21 | |
| | ■ | 22 | | | | 23 | ■ | |
| 24 | | | | ■ | 25 | | | |

ఆధారాలు

మార్చి '78

## అడ్డం

1 కావ్యనాయిక

4 తమిళనాడులో గ్రామం

7 తులసి వనంలో కళంకం

8 మోసగాడు

10 కరిగించే పాత్ర

11 శత్రువుల్ని కొట్టడం ఎలా?

13 స్త్రీ (మకారాది)

14 మంగలి కత్తి (ఎటుతిప్పినా అదే)

15 ఉదాహరణకి పుష్పకం

16 వల

18 ఒక కవి ఇంటిపేరు

21 ఆవు కనేది

22 ఎన్ని బిరుదులున్నా చెళ్ళపిళ్ళవారికి ఇదంటే ఇష్టం

24 సమర్పణ

25 నోటికి పెదవులు

నిలువు

1 గుర్రాల భాష
2 అదృష్టం ఒక అంశ
3 తమాషాలు
4 మజిలీలు
5 స్తోత్ర పాఠకుడు
6 ప్రమద్వర
9 పార్వతి
10 బలి నడిగింది గజమే
12 మూడు గణాలు (దేవుడి దయకోసం?)
15 పాత సరదాల పత్రిక
17 గలాటాలు (ఛందో బద్ధమైనవి)
19 జాతీయ—(—సన్నివేశం)
20 బ్రహ్మ
22 షకా
23 ముందడుగువద్దు (వెనుకంజ కూడా)

ఫిబ్రవరి పదబంధ ప్రహేళికకు సమాధానం:

అడ్డం: 1 నాసిక; 4 చకోరి; 7 రామప్పంతులు; 9 బాకా; 11 తిట్టు; 12 రుద్రయ్య: 14 గురువు; 15 బొగ్గులు; 16 ఆయువు: 17 నటన; 19 వాలు; 22 పాడి; 23 అక్కరకురా; 25 అనట్టి; 26 మాసిక.

నిలువు: 2 సిరా; 3 కమఠి; 4 చతుర్థి; 5 కోలు; 6 సాంబారు; 8 పుట్టువు; 10 కాద్రవేయులు; 11 తిరుగుటసా; 13 ముగ్గురు; 16 ఆవారా: 18 నడిమి; 20 ముక్కట్టి; 21 లకుమా; 23 అన; 24 రాపి.

---

## నిబంధనలు గమనించండి!

పదబంధ ప్రహేళిక కొట్టివేతలు, దిద్దుబాట్లూ లేకుండా పూర్తిచేసి మార్చి 1 తేదీలోపు మాకు చేరునట్లు పంపండి. తెల్లకాగితం మీద గళ్ళుగీసి పూర్తిచేసి పంపిన ఎంట్రీలు చెల్లవు. ఎంట్రీలు పంపువారు వారి పూర్తి చిరునామా ఎంట్రీపైనే రాసి పంపాలి. ఆల్‌కరెక్ట్ ఎంట్రీకి రు. 50/- బహుమతి. ఒకటికి మించి ఆల్ కరెక్ట్ ఎంట్రీ వొచ్చినప్పుడు బహుమతి సొమ్ము విజేతలకు సమానంగా పంచబడుతుంది. ఆల్‌కరెక్ట్ ఎంట్రీ ఒకటీ రాకపోతే బహుమతి సొమ్ము పైనెల బహుమతి సొమ్ముకు కలిపి అందజేయబడుతుంది.

---

ఫిబ్రవరి పదబంధ ప్రహేళిక విజేతలు:

1 అలపర్తి వెంకట సుబ్బారావు, నందివెలుగు. 2 యం. సుందరి, కాకినాడ. 3 కె. జె. ఎం. కృష్ణారావు, ఏలూరు. 4 వి. గోపాలకృష్ణ, మద్రాసు-20 5 వఝె నాంచారయ్య, విశాఖపట్నం-1. 6 టి. ఉమాదేవి, హైదరాబాదు-20. 7 కె. గాయత్రి, హైదరాబాదు-28. 8 టి. లక్ష్మీదేవి, హైదరాబాదు-20. 9 పి. మల్లిక్, హైదరాబాదు-36. 10 సిహెచ్. లలిత, శ్రీకాకుళం. 11 బి. సాహితి, మద్రాసు-41. [వీరికి జాక్‌పాట్ బహుమతి రూ. 100/- ను పంచి ఒక్కొక్కరికీ రూ. 9/- చొప్పున పంపిస్తున్నాము.]




తృతీయ బహుమతి గెలుచుకున్న 'ఒకటి ఒంటరి అంకె' నవల మాకు పూర్తి సంతృప్తి నిచ్చింది. మా అభిమాన రచయిత ఫొటో మీరు ప్రచురించలేక పోయినందుకు చాలా నిరుత్సాహం చెందాము.

—పి. పార్వతీశం. బొబ్బిలి.

తృతీయ బహుమతి పొందిన నవల 'ఒకటి ఒంటరి అంకె' కథలో సందర్భోచితంగా పాత్రలను నడిపించటం గొప్పతనం. నవల చిన్నదే అయినా సారం చిక్కగా వుండి మనసుకు పట్టుతుంది. పాత్రలుగూడ చాల కొద్దిగ వుండటంవలన గజిబిజి లేకుండా స్టోరీ చక్కగా సాఫీగా సాగిపోయింది. పాపం త్రిపురం అనిపిస్తుంది, నవల చివరివరకు చదివాక.

—కొంగర ఉమామహేశ్వరరావు.
తెనాలి.

"ఏ కథ చూసినా; ఏముంది బాగు;" అన్నట్టున్నాయి ఈ నెల కథలు. పెద్ద రచయితల కధలు ప్రచురించాలనే మీ ఆశయం, తాపత్రయం మెచ్చుకోదగ్గవే; కాని ఒక్క మాట. రచయితల పేరుచదివి కథలు మెచ్చుకొనే రోజులు వెనక్కు వెళ్ళిపోయాయి. ప్రస్తుతం పాఠకులు కథ, కథలోని వస్తువును మాత్రమే ఆశిస్తున్నారు. కనుక ఆ విషయం మీరు గుర్తించి మంచి కథలు ప్రచురిస్తే మంచిదని నా అభిప్రాయం.

—యినుగంటి బుచ్చివెంకట్రావు,
కొవ్వాడ.

## శ్రీశ్రీ పదబంధ ప్రహేళిక

శ్రీశ్రీ పజిల్సును నే నెప్పుడూ స్పోర్టివ్‌గానే తీసుకొని పూర్తిచేసుకుంటున్నానని చెప్పుకుంటున్న శ్రీ యన్. కె. రామారావుగారు తాను Solve చేయలేక పోయిన క్లూల విషయమై శ్రీశ్రీని నిలదీసి ప్రశ్నించిన ఉత్తరం మాత్రం స్పోర్టివ్‌గా లేదు. క్షమిస్తే—'ఆడలేక మద్దెల ఓడు' అన్నట్టుగా వుంది.

అసలు పజిలు అంటేనే అనేక చిక్కుముడులు వేయబడ్డ దారపు వుండ; తెలివీ, చాకచక్యమూ వుపయోగిస్తే ముడులన్నీ విడదీసి సరైన దారాన్ని సంపాదించుకోవచ్చు. లేకపోతే మరిన్ని పీటముడులు పడిపోతుంది.

ఈ మాత్రం Solvation కు శ్రీశ్రీని కించపరచడం, పత్రికయొక్క నైతిక బాధ్యతను గుర్తుచేయడం తనను తాను చిన్నబుచ్చుకోవడమే కాగలదు.

అంతకంటె ప్రతినెలా పదబంధ ప్రహేళికకు ఒక పేజీ కేటాయించి 'గతనెల పజిలు సమాధానాలు' అనే శీర్షిక క్రింద పజిలు ఫలితాలుకు "బ్రీఫ్ నోట్సు" శ్రీశ్రీచేత నిర్వహింప జేయవలసినదిగా కోరివుంటే మరింత హుందాగా వుండి వుండేది.

—మాదేటి కృష్ణమోహనరావు, తుని

శ్రీ శ్రీగారు నిర్వహించు 'పదబంధ ప్రహేళిక' ఇదివరకున్నంత వినోదాత్మకంగా లేదన్నది నిర్వివాదాంశము. ఆయనిచ్చే ఆధారాలు కొన్ని మరీ అసమంజసంగా వుంటున్నాయి. అందుకు ఉదాహరణలు కొన్ని:—

నవంబరు నెల ప్రహేళికలో: 7 అడ్డం ఆధారానికి సమాధానం 'దండకవి' అని నాలుగక్షరాల పదము యిచ్చారు శ్రీశ్రీగారు. కానీ పజిల్లో 5 గడులున్నాయి. 'దండకవిలె' అని సమాధానం వస్తుంది. దీన్ని శ్రీశ్రీగారు వివరించాలి.

డిశంబరు నెల ప్రహేళికలో: 23 అడ్డం. ఆధారం. "సాహిత్య సంస్థలో పోతేనేమి" "కవితాసతి" అని దీని సమాధానం. ఇది కేవలం By product ఆధారం అసమంజసంగానూ, అసంబద్ధంగానూ ఉంది. "కవితాసమితి" అనే సాహిత్య సంస్థలోనుంచి 'మి' పోతే 'కవితాసతి' అని ఆయన వివరణ ఇస్తారేమో! ఆధారం కాస్త reasonable గా 'కయితకు భార్య' అనో లేదా మరో రకంగానో ఇవ్వాల్సింది.

జనవరి నెల ప్రహేళికలో: 23 నిలువు ఆధారం "ఇలాగా అల్లడం జడ" దానికి వారిచ్చిన సమాధానం 'జబ్బు' ఎలాగో వివరించాలి.

ఫిబ్రవరి నెల ప్రహేళికలో: 15 అడ్డం ఆధారం 'పిగ్గేంకాను' దీని కర్థమేమిటో? శ్రీశ్రీగారే సెలవియ్యాలి.

ఒక్క 'ప్రహేళిక' కోసమే 'జ్యోతి' కొనేవాళ్ళలో నేనొకన్ని. ఎన్నోమార్లు All correct చేశాను. ఇలాంటి అసమంజసమైన ఆధారాల్తో మా Interest చంపేస్తున్నారు శ్రీ శ్రీగారు.

"కుప్పుస్వామీ అయ్యర్ మేడీజీ" చెయ్యడమే నాధ్యేయమంటే మహాకవికింకేమి చెప్పలేము.

—తోట చంద్రశేఖరరెడ్డి,
ప్రొద్దుటూరు.

శ్రీశ్రీ జ్యోతిలో నిర్వహిస్తున్న పదబంధ ప్రహేళిక తెలుగు అక్షరాల అందమూ అంతర్యమూ తెలిసిన ప్రతి ఒక్కర్నీ ఆటకాయిస్తుంది, అలరారిస్తుంది. కావాలని అల్లరి పెడదామని ఆయన యిచ్చిన ఆధారాలు, పజిలు పూర్తిచేసే వాళ్ళని తికమక పెడతాయి. పక్కదారి పట్టిస్తాయి. చికాకు పెట్టించి తిట్టుకొనేలా చేస్తాయి. అందుకేగదా పాపం నల్లగొండ యన్. కె. రామారావుగారు ఫిబ్రవరి జ్యోతిలో శ్రీ శ్రీని అంతగా దుమ్మెత్తిపోసింది!

రామారావుగారు వెలిబుచ్చిన రెండు సందేహాలూ నాకు అర్థమయిన మేరకు నేనే తీర్చడానికి ప్రయత్నిస్తాను.

1. 'సాహిత్య సంస్థలో పోతేనేమి?' అనే క్లూకి 'కవితాసతి' ఎలా జవాబు?

సాహిత్య సంస్థ అంటే కవితాసతిమి.

కవితా స'మి'తిలో పోతేనే. 'మి'; కవితాసతి అవలేసా?

2. ఒకటికంటె రెండు నయం అనే క్లూకి 'తలలు' ఎలా జవాబయింది?

తలలు అంటే మనుషులని అర్థం. ఒకరికన్న ఇద్దరు కలిసిచేస్తే. లేదా రెండు తలలు జోడిస్తే నయం. ఇంతకీ హోమర్ తన ఇలియడ్‌లో పదో భాగంలో 225 వ లైనులో.

Two heads are better than one

అని ఎప్పుడో అన్నాడు నా సమర్థన రైటేనా శ్రీశ్రీ? ఇంతకీ—

బాబూ, ఇది పదబంధ ప్రహేళిక

అల్లరిపెట్టడమే దీని ప్రత్యేక ప్రణాళిక

శ్రీ శ్రీ ఒక్కడే ఇలాంటి క్రీడల్లో ఏకైక ఏలిక!

ఎత్తేశారు కనక ఈ శీర్షిక.

ఒప్పుకోం సుమా, సంపాదకా!

అవసరాల రామకృష్ణారావు. భవానీపట్నా.

[ఎన్. కె. రామారావుగారి విమర్శకు బదులుగా సరైన వివరణనిస్తూ శ్రీ అంగర వెంకట గిరిజాకుమార్, శ్రీకాకుళం; శ్రీ వి. రామమోహనరావు, హైదరాబాద్. శ్రీ మారేటి కృష్ణమోహనరావ్, తుని. శ్రీమతి పద్మ హైదరాబాద్. శ్రీ యం. కె. రావ్, విశాఖపట్టణం, కూడా ఉత్తరాలు రాశారు. —ఎడిటర్]

కొన్ని క్లూలకు సంబంధించినంత వరకు శ్రీశ్రీ విమర్శకి గురికాక తప్పదు. గత కొన్ని నెలలుగా పజిల్స్ కేవలం బుద్ధిగమ్యాలు కావడం శోచ నీయం. పజిల్ అనేది ముఖ్యంగా హృదయోల్లాసాన్ని, మనోవికాసాన్ని కల్గించేటట్లుండాలని అనుకోవడం దురాశ కాదు. ఆ విషయాన్ని శ్రీ శ్రీ దృష్టిలో ఉంచుకోవాలి. ముద్రా రాక్షసాల మాట అటుంచి, మౌలికంగా క్లూకి సంబంధించినంతవరకు కొన్ని Lapses ఉన్నాయి. ఉదాహరణకి జనవరి పజిల్‌లో "ఇలాగా అల్లడం జడ"కి సమాధానం "జబ్బు! ఏవిధంగా చూసినా ఇది సమర్థ నీయం కాదు. అలాగే అంతకు ముందొక సారి "నిగమాంత శర్మ" అని ఇచ్చి, సమాధానం "వేదాన్తి" అని ఇవ్వడం జరిగింది. క్లూలో "శర్మ" అనే పదానికి, సమాధానంలో ఏ ఒక్క aspect కూడా True representative కాజాలదు. వీటిగురించి శ్రీ శ్రీ ఏమంటారో?

—అంగర వెంకట గిరిజాకుమార్.

శ్రీకాకుళం.

## శ్రీశ్రీ వివరణాలు

నల్లగొండనుంచి శ్రీ యన్. కె. రామారావుగారు నా పజిల్సు స్పోర్టివ్‌గా తీసుకుంటానంటూనే కారాలూ, మిరియాలూ నూరుతూ రాశారు. తలమీద నేను చేసిన గాయం, బెట్టుకింద కొట్టిన ట్టనిపించింది వారికి. ఈ దురభిప్రాయాన్ని పోగొట్టడానికిగాను, వారు పేర్కొన్న రెండు క్లూలకూ నా సమాధానాలు ఈ దిగువ ఇస్తున్నాను.

మొదటిది: "సాహిత్య సంస్థలో పోతేనేమి," సాహిత్య సంస్థ "కవితా సమితి అందులో, "మి" అనే అక్షరం పోతేనే, మిగిలేది "కవితా సతి."

రెండవది:"ఒకటికంటే రెండునయం" "Two heads are better than one" అని ఇంగ్లీషు నానుడి. దీన్ని తెలియని, లేదా మరిచిపోయిన వాళ్ళకే "ఒకటికంటే రెండు తలలే ఎందుకు నయం కావాలి?" అనే సందేహం ఉదయిస్తుంది. ఇటువంటి సందేహాలే అసమంజసాలూ, అహేతుకాలూ।

నా జవాబులు రామారావుగారికి సంతృప్తి కలిగించి తీరుతాయనే నా విశ్వాసం.

"కుప్పుసామయ్యర్ మేడ్ డిఫికల్ట్" చోట చంద్రశేఖరరెడ్డి (ప్రొద్దుటూరు) గారికి:

ఒక విధంగా నా పజిల్సన్నీ సులభమైన దాన్ని కష్టం చెయ్యడమే. ముక్కును చూపించమంటే తలంతా చుట్టడమే. ఈ ఇబ్బందులకు తట్టుకునే వాళ్ళంటే నాకెంతో ఇష్టం. కారణం, నేనూ అలాంటి వాణ్నే కాబట్టి.

నవంబరు: 7 అడ్డం. అచ్చు తప్పుకి వివరణ అనవసరం.

డిసెంబరు: 23 అడ్డం. "వాణి నా రాణి" అంటే సరిపోయేది. ముక్కు కుసూటిగా పోతే.

జనవరి: 23 నిలువు

"రాజని భావనా? సరసురాలవు?
"జబ్బు"గ నల్లినా విదే
మే జడ?" అనే పద్యం ఈ ఆధారానికాధారం.

ఫిబ్రవరి: 15 అడ్డం?

హరి, నీ పిగ్గు "బొగ్గులు" కాను? అనేది అచ్చమైన తెలుగు నానుడి.

మిత్రుడు
—శ్రీశ్రీ.

అంగర వెంకట గిరిజాకుమార్ (శ్రీకాకుళం) గారికి:

"విగమాన్తి" అంటే సరిపోయేది. కాని నిగమ శర్మను ప్రవేశపెట్టి కొంత గందరగోళం సృష్టించాను. ఇందులో "Rules of the game"కి అతిక్రమణ లేదనుకుంటాను. Let's play the game.

sincerely yours
Sri Sri

ఫిబ్రవరి' 78 సంచికలో ప్రత్యేక పారితోషికం పొందిన కథలు

చీకటి కిరణాలు — రచన: నాగభైరవ ఆంజనేయులు

వారసత్వం — రచన: 'వాణిశ్రీ'

# సినిమా

## మాచర్లకు దగ్గరే జెరూసలేం!

మాచర్లకు దగ్గరగా కేవలం మూడు మైళ్ళ దూరాన్నే ఉంది జెరూసలేం. అక్కడి వీధులలోనే శిలువ వేయబోయే ముందు చిత్రహింస ననుభవిస్తూ శిలువ మోసుకొంటూ ఏసు పయనించాడు. ఇది నిజంకాదు. కాని ఇది నిజమే ననిపించేంత సహజంగా అక్కడి కుగ్రామం బైరన పాడును జెరూసలేంగా తీర్చిదిద్దాడు రాధా చిత్ర సంస్థ తరపున ఆర్ట్ డైరెక్టర్ దిలీప్ పింగ్. ఇది నిజమేననిపించేలా చూపరులకు నిజమైన ఏసులాగానే కనిపించాడు ఆ పాత్ర నిర్వహించిన విజయచందర్. రాధాచిత్ర నిర్మిస్తున్న వర్ణచిత్రం 'కరుణామయుడు' చిత్రానికిగాను ముఖ్యమైన కొన్ని సన్నివేశాల చిత్రీకరణ పదిహేను రోజులపాటు బైరనపాడులో జనవరి ప్రధమార్థంలో జరిగింది.

## 'యజ్ఞం చేశాము'

"నిజంగా ఈ షెడ్యూలు ఒక యజ్ఞం లాగానే చేశాము. అంతమంది నటీ



'విచిత్ర జీవితం'లో వాణిశ్రీ, నాగేశ్వరరావు

నటులకు వసతి సౌకర్యాలూ, ఆపైన డాన్స్ పార్టీ, స్టంట్ పార్టీ సభ్యులకు ఏర్పాట్లూ, మద్రాసునుంచి తీసికెళ్ళిన వంద మంది జూనియర్ ఆర్టిస్టులకూ, టెక్నీషియన్లకూ మాచర్ల, నాగార్జునసాగర్‌లలో అతి ప్రయాసపై ఎకామడేషన్ చూడగలిగాము. కష్టం ఎంతయినా అనుకొన్న రీతిలో చిత్రీకరణ జరిగింది. రష్ కూడా మొన్ననే చూశాము. చాలా బాగా వచ్చింది" అన్నారు నిర్మాత విజయచందర్ పైన చెప్పిన షూటింగ్ విషయంగా మాట్లాడుతూ.

## 'మా ఊళ్ళో షూటింగు చెయ్యొద్దు!'

షూటింగ్ మొదటి రెండురోజులూ గడిచాక బైరనపాడు వాస్తవ్యులలో కొందరు పేచీ పెట్టారు ఆ వూళ్ళో షూటింగు కొనసాగటానికి వీల్లేదని. రెండు లక్షల రూపాయల సెట్టులో సంతోషంగా షూటింగ్ చేసుకుపోతున్న నిర్మాత గుండెల్లో రాయిపడక ఏం చేస్తుంది, ఆ మాట విన్న తర్వాత. అయితే వారి అభ్యంతరం, వారికి ఇబ్బంది కలిగికాదు. మరో కారణం ఉంది. ఆ కారణం వారు వివరించినప్పుడు నిర్మాతగా, నటుడుగా విజయచందర్ సంతృప్తి చెందారు, సంతోషపడ్డారుకూడా. వారు చెప్పిన కారణం "రెండురోజుల్నుంచీ చూస్తున్నాము. ఆ ఏసుప్రభువుని కొట్టుకొంటూ, అయన ఎద్దులా ఆ శిలువ మోసుకొంటూ, రక్తం కారుతుండగా మా వీధులలో నడుస్తుంటే మేం చూడలేకపోతున్నాము ఇక చూడలేము. షూటింగ్ మానెయ్యండి" అని. అంతగా కదిలిపోయారు ఆ వూరి ప్రజలూ, చుట్టుపట్లనుండీ వేలాదిగా వచ్చిన ప్రజలూను.

## మార్చిలో విడుదల!

"మొన్నటి షూటింగ్‌తో చిత్రం తొంభై వంతులు పూర్తయింది. ఇంకొక్క అయిదారు రోజుల షూటింగు. మధ్యలో దరదృష్టకరమైన సంఘటన మా దర్శ దర్శకులు భీమ్‌సింగ్ మరణం, ఫిబ్రవరిలో పాచ్ వర్క్ పూర్తిచేసి, ఎడిటింగ్ రీ రికార్డింగులు ముగించి మార్చికి విడుదల చేసేందుకు ప్రయత్నిస్తున్నాము" అని నిర్మాత, క్రీస్తుపాత్రధారి విజయచందర్ చెప్పారు.



'సీతామాలక్ష్మి'లో తాళ్ళూరి రామేశ్వరి, చంద్రమోహన్

## వాణిశ్రీధర్ 'గోరంతదీపం'

ముళ్ళపూడి వెంకటరమణ రచయితగా తయారైన చిత్రంలో చమత్కారాలకు, లోటేమిటి? బాపు దర్శకుడుగా తయారైన చిత్రంలో అద్భుత కళానైపుణ్యానికి, కనువిందుచేసే చక్కని దృశ్యకావ్యపు లక్షణాలకు ఢోకా ఏమిటి? ఏమీ వుండదని తెలుసు కనుకనే తెలుగు ప్రేక్షకులు గోరంత దీపం విడుదలకై ఎదురు చూస్తున్నారు. వాణిశ్రీ, శ్రీధర్‌లు వాణిశ్రీధరులై తొలిసారిగా నాయకీ, నాయకులుగా నటిస్తున్న ఈ చిత్రానికి మాటలు సమకూర్చడమే గాక నిర్మాణం కూడా చేపట్టారు ముళ్ళపూడి, మోహన్‌బాబు, రావుగోపాలరావు, అల్లురామలింగయ్య, కాంతారావు, ముక్కామల, సాక్షిరంగారావు, అశోక్ కుమార్, భూషణ్, అప్పారావు, సూర్యకాంతం, జి. వరలక్ష్మి, రాధాకుమారి, ఝాన్సీ, హలం, జయవిజయ, కల్పన కూడా నటించారీ చిత్రంలో. కె.వి. మహాదేవన్ సంగీతం, ఇషాన్ ఆర్య ఛాయాగ్రహణం, ఈచిత్రానికిప్రత్యేకలంకారాలు. ఈ చిత్రానికి నేరెళ్ళ రామలక్ష్మి కథ సమకూర్చారు. ముత్యాల ముగ్గులో 'మేండొలిన్' వాద్యంతో తెలుగు ప్రేక్షకులకు వీనులవిందు చేసిన సజాద్‌హుస్సేన్ తిరిగి తమ వాద్యం చేపట్టి గోరంతదీపంలో చాలా సన్నివేశాలకు రసపుష్టి చేకూర్చారు.

## మంచి బాబాయ్ తయారయింది!

శోభన్‌బాబు 'మంచి బాబాయ్'గా కన్పిస్తూ కథానాయకుడిగా నటిస్తున్న వర్ణ చిత్రం పూర్తయింది. సాహసమూ, సెంటిమెంటూ సరైన రీతిలో మేళవించి తయారుచేసిన రసవత్తరమైన కథ కు రూపకల్పనగా తయారైన మంచి బాబాయ్‌కి టి. కృష్ణ దర్శకుడు. జయసుధ, జయచిత్ర, సత్యనారాయణ, శ్రీధర్, శరత్‌బాబు, వంకాయల, కె. విజయ, నిర్మల, రమాప్రభ మొదలైనవారు నటిస్తున్న ఈ చిత్రాన్ని బాలాజీ చిత్రనికేతన్ పతాకం క్రింద టి. బాబుల్‌నాధ్, జె. లక్ష్మణరావు నిర్మించారు.

'గోరంత దీపం'లో వాణిశ్రీ, శ్రీధర్





సాగరసంగమంలో జయప్రద, శైలజ

## నూతన జానపదం!

కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో తిరుపతి ప్రొడక్షన్స్‌వారు సినిమా స్కోప్‌లో తలపెట్టిన వర్ణచిత్రం 'సింహ బలుడు'లో ఎన్. టి. రామారావు, వాణిశ్రీ నటిస్తున్నారు. 'కన్వెన్షనల్'గా మనం చూసే జానపదంగా గాక ఒక చక్కని 'యాక్షన్' చిత్రంగా, నూతన తరహాలో చిత్రించేందుకు ప్రయత్నిస్తు న్నాను,' అన్నారు దర్శకులు రాఘవేంద్ర రావు నిర్మాతలు ఏర్పాటుచేసిన ప్రెస్ మీట్‌లో ఈ చిత్రం గురించి ముచ్చ టిస్తూ. డా॥ డి. వి. యస్. రాజు సమ ర్పణలో దాట్ల శ్రీ రంగరాజు నిర్మిస్తున్న యీ చిత్రానికి డి. వి. నరసరాజు(రచన), యం. యస్. విశ్వనాథన్ (సంగీతం), కన్నప్ప (ఛాయాగ్రహణం) మార్తాండ్ (కూర్పు) సాంకేతిక బలాన్ని చేకూరుస్తు న్నారు.

## రాధాకృష్ణ

ప్రముఖ రచయిత్రి యద్దనపూడి సులోచనారాణి కథకు చిత్రరూపంగా 'రాధాకృష్ణ'ను తయారుచేస్తున్నది అన్న పూర్ణ కళానికేతన్ సంస్థ. ఈ చిత్రానికి సాంకేతిక వర్గం: కె. రాఘవేంద్రరావు (దర్శకత్వం) ఎ. విన్సెంట్ (ఛాయా గ్రహణం) ఎస్. రాజేశ్వరరావు (సంగీతం) సత్యానంద్ (సంభా షణలు) భాస్కరరాజు (కళ). శోభన్ బాబు, జయప్రద, చలం, సత్య నారాయణ, ప్రభాకరరెడ్డి, అల్లు రామ లింగయ్య, మాడా, సూర్యకాంతం, రమా ప్రభ, గిరిజ నటిస్తున్న యీ వర్ణచిత్రానికి నిర్మాత డి. మధుసూదనరావు. సహనిర్మా తలు: కె భానుప్రసాద్, పి గంగాధరరావు.

## 'చలిచీమలు'

నటుడు దేవదాస్ దర్శకత్వంలో తయారవుతున్న 'చలిచీమలు' చిత్రానికి మంథా వెంకటరమణరావు కథ 'కొలువు' ఆధారం. పరుచూరి సంభాషణలు సమ కూర్చిన ఈ చిత్రాన్ని శ్రామిక చిత్ర సంస్థ నిర్మిస్తూంది. S. R. వేజెళ్ళ స్క్రీన్‌ప్లే. వైద్యనాథన్ సంగీతం సమకూర్చిన ఈ చిత్రంలో సత్యేంద్రకుమార్, శైలజ,

నూతన్‌ప్రసాద్ (ముత్యాల ముగ్గు నిత్య పెళ్ళికొడుకు వరప్రసాదే) రామభద్రరాజు, చెక్కా, రాళ్ళపల్లి మొదలైనవారు నటిస్తున్నారు. ప్రముఖచిత్రకారుడు చంద్ర ఈ చిత్రానికి 'కళ'ను సమకూర్చారు.

## రసవత్తరమైన ప్రేమకథ సీతామాలక్ష్మి

అనగనగా ఓ కొండయ్య. ఆ కొండయ్యకు జత సీతాలు. కొండయ్యంటే మనసున్న మందారమనీ, మనిషంత బంగారమనీ ముచ్చట పడిపోతుంది సీతాలు. సీతాలంటే సింగారమేననీ, సీతమాలచ్చిమంటే మాలచ్చిమవతారమేననీ పొంగిపోయాడు కొండయ్య. పరువంలో వున్న యువహృదయాలు వారివి. ప్రేమతో పరవశించి పదాలు పాడుకొన్నాయి. అయితే 'విధి'గా డొకడున్నాడు. సాఫీగా జరిగిపోయే జీవితాలంటే అమిత అయిష్టం వాడికి. ఏదో పాచిక వేస్తాడు. నడుస్తున్న కధకు ఊహించని మలుపు తెస్తాడు. సీతాలు, కొండయ్యల ముచ్చటైన ప్రేమకథ విధినడిపించిన నాటకంలో ఊహించలేని మలుపు తిరిగింది. ఫలితంగా సాంఘికంగా, ఆర్థికంగా ఉన్నతురాలైన సీతాలుకీ, ఉన్న చోటునే వున్న కొండయ్యకూ మధ్య అంతరం ఏర్పడింది. ఆ అఘాతానికి ఇద్దరూ తల్లడిల్లారు. సీతాలు మరీను .... సీతాలు, కొండయ్యల రసవత్తరమైన ప్రేమకథ కె. విశ్వనాథ్ దర్శ

'ఆడదంటే అలుసా'లో జయలక్ష్మి





మద్రాసు ఐ.ఐ.టి.లో 'బాపు చిత్ర కళా ప్రదర్శనం' చూసేందుకు వచ్చిన ప్రముఖ రచయిత కొడవటిగంటి కుటుంబరావుతో చిత్రకారుడు బాపు

కత్వంలో 'సీతామాలక్ష్మి' చిత్రంగా రూపొందింది కె. మురారి నిర్మించిన యీ చిత్రంలో చంద్రమోహన్, సీతామాలక్ష్మి సారీ....తాళ్ళూరి రామేశ్వరి, శ్రీధర్ కీలకమైన పాత్రలలో కన్పిస్తారు. కె.వి. మహదేవన్ సంగీతం సమకూర్చారీ చిత్రానికి.



'ఎత్తుకు పైఎత్తు'లో సంగీత, కమలహాసన్

## అన్నదమ్ముల సవాల్ !

కృష్ణ, రజనీకాంత్, త్యాగరాజు, భీమరాజు, ప్రభాకర్, చలం, అల్లు, అంజలీదేవి, జయచిత్ర, చంద్రకళ, హలం, జయమాలిని మొదలైన వారు నటిస్తున్న 'అన్నదమ్ముల సవాల్' చిత్రాన్ని శ్రీ సారధీ స్టూడియోస్ (ప్రై. లి.) బానర్‌పై జి. డి. ప్రసాదరావు, పి. శశిభూషణ్ నిర్మిస్తున్నారు. షూటింగ్ కార్యక్రమం ముగించుకొని విడుదలకు సన్నాహాలు జరుపుకొంటున్న ఈ చిత్రానికి యస్. యస్. లాల్ ఛాయాగ్రహణం, సత్యం సంగీతమూ సమకూర్చారు. కె. ఎస్. ఆర్. దాస్ దర్శకులు.

—యస్వీనారాయణ

# జ్యోతి కథల పోటీ

బహుమతులు :

ప్రథమ బహుమతి : రు. 1000/-
ద్వితీయ బహుమతి: రు. 600/-
తృతీయ బహుమతి : రు. 300/-

ఇంకా...ప్రశంసార్హమైన మరో ఆరు కథలకు ఒక్కొక్క-దానికి రూ. 100/- చొప్పున ప్రత్యేక బహుమతులు.

రచనలు పంపుటకు ఆఖరుతేది : 1, మార్చి, 1978.

1. కథలు 16 పేజీలు మించకుండా (ముద్రణలో) ఉండాలి (సుమారు పేజీకి 30 లైన్లతో 16 పేజీల ఫుల్‌స్కేపు పేజిలు మించకుండా).
2. అనువాదాలు, అనుసరణలూ అంగీకరింపబడవు. రచనలు తమ స్వంతమేననే హామీ పత్రాన్ని విధిగా కథాంతంలోనే, పంపాలి.
3. ముఖ్యగమనిక : రచయితలు తమ చిరునామాను కథవున్న పేజీలలోగానీ, ఆ పేజీల వెనకగానీ కాకుండా, మరోకాగితంపై వ్రాసి జతచేయాలి.
4. రచయితలు కలంపేరుతోబాటు తమ అసలు పేరును విధిగా తెలియచేయాలి.
5. బహుమతుల ప్రకటన, మొదటి మూడు బహుమతులు పొందిన కథలూ జ్యోతి జూన్ 1978 సంచికలో ప్రచురింపబడుతాయి.
6. ప్రచురణార్హముగాని కథలు తిప్పిపంపగోరువారు కథలతోపాటు తగినన్ని తపాలా బిళ్ళలంటించిన స్వంత చిరునామాగల కవరు జతచేసిపంపాలి.
7. పోటీకి రచనలు పంపే కవర్లపై 'జ్యోతి కథలపోటీ'కి అని విధిగా రాయాలి.
8. పోటీలో బహుమతి పొందని కథలలో ప్రచురణార్హమైనవాటిని ప్రచురించుకొనే హక్కు మాకుంటుంది.
9. పోటీ విషయంగా జ్యోతి సంపాదకులదే తుది నిర్ణయం. —ఎడిటర్

---

## గమనిక

ఈ సంచిక 19 వ పేజీలో పోటీకి కథలు పంపేందుకు
చివరి తేదీ 31 మార్చి 1978 గా పొరపాటు ముద్రించబడింది
కథలు పంపేందుకు చివరి తేదీ 1, మార్చి 1978గా గమనించగలరు

Edited&Publishedby V. Leelavathy Raghavaiah, at 17B Rajaram Colony Kodambakkam,Madras-600 024,& Printed byD. Hanumantha Rao,at Kranti Press, 12, Francis Joseph Street, Madras-600001.